# ఫారెక్స్®
# తల్లుల మొదటి ఎంపిక!

## తన పాపాయికి ప్రేమతో తినిపించి పెంచే ప్రతి తల్లికీ తెలుసు: పాపాయి పెరుగుదలకై ఘన ఆహారాలను ప్రారంభించేటపుడు మొట్టమొదటి ఎంపిక ఇదే–ఫారెక్స్®.

ఎందుకంటే, మేలుపర్చబడిన ఫారెక్స్‌లో ముద్దుల పాపాయి పెరుగుదలకై అవసరమైన పోషణ పదార్థాలు సరియైన పాళ్లలో కలవు.

- ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు అవసరమైనట్లు సరియైన పరిమాణంలో ప్రొటీన్లు; సున్నిత జీర్ణశక్తికి అనువుగా క్రొవ్వు పదార్థాలు కలవు.
- పుట్టిన నాలుగు నెలలకు, పాపాయికి తల్లి నుండి లభించిన ఐరన్ నిల్వ తగ్గిపోతుంది. పాపాయి రక్త-పుష్టికై ఫారెక్స్‌లో తగినంత ఐరన్ కలదు.
- దృఢమైన ఎముకలు, గట్టి పళ్లకోసం ఫారెక్స్‌లో పాపాయి పెరుగుదలకు ఉత్తమ 2:1 నిష్పత్తిలో కాల్షియం, ఫాస్ఫరస్ కలవు.
- ఫారెక్స్‌లో పాపాయి బాగా ఇష్టపడి తినే రుచి కలదు.
- దీనిని కలపడం, తినిపించడం సులభం.




పాలు చేర్చ అవసరం లేదు.
కేవలం నీళ్ళలో

**ఫారెక్స్®–శ్రేష్ఠమైన ఘన ఆహారం**
**తల్లి ప్రేమకు ప్రతిబింబం**

# అదుపు తప్పిపోతున్న ఆర్థిక వ్యవస్థ

గుర్రం దౌడు తీసిన వెంటనే మూసుకుపోయే తలుపులని గురించి మనం విన్నాము, కానీ ఆ తలుపుతో సహా గుర్రం పారిపోతే ఏం చేస్తారు?

అంతర్జాతీయ ద్రవ్య నిధిలోని ఒక నిపుణుని అంచనా ప్రకారం రహస్య స్విస్ ఖాతాలలో భారతీయులు దాచుకున్న మొత్తం రు. 1200 కోట్లకి పైగా ఉన్నదని తెలుస్తున్నది. ఇది పైకి కనిపిస్తున్నది మాత్రమేనని కూడా అన్నాడట ఆ నిపుణుడు. వాస్తవంగా విదేశాలలోని ఆ నిల్వలు దానికి 15 నుంచి 20 రెట్లు దాకా ఉండవచ్చు. ఇలాంటి విషయాలని అందరికంటే చివరికి తెలుసుకునే ప్రభుత్వానికి అది వార్తగానే ఉండవచ్చు. కానీ జాగ్రత్తగా ఆ విషయాలని గమనించే వారికి మాత్రం అది వార్తకానే కాదు. దేశంలో ఉన్న నల్ల డబ్బు ఎంత అని లెక్కలు వేసినట్లే ఎప్పటికప్పుడు విదేశాలలో ఉన్న విదేశీ మారక ద్రవ్యం ఎంతో అంచనాలు వేస్తూనే ఉంటారు. అదేమీ తమకి తెలియదన్నట్లు కాంగ్రెసు (ఐ) రాజకీయ వాదులు నటించటమే హాస్యాస్పదంగా ఉంటుంది. భారీ ఎత్తున రహస్య ఖాతాలు ఉన్న వారిలో వారు కూడా ఉండి ఉంటారు. దేశ రాజధానిలో వినిపిస్తున్న పుకార్లు నిజమైతే ఒకటి లేదా రెండు (పేర్ల జోలికి మనం వెళ్లవద్దు) కుటుంబాల వారు దాచుకున్న మొత్తమే కొన్ని వందల కోట్లు ఉండి ఉండాలి.

అంతర్జాతీయ ద్రవ్యనిధి వెల్లడించిన దానిని బట్టి ఆ రహస్య నిధులు గత ఒక్క ఏడాదిలోనే రు. 400 కోట్లు పెరిగాయి. అంటే వీళ్లందరికీ పోయినేడు ఒక పండుగలాంటిదన్నమాట. ఆర్థిక మంత్రి గొప్పగా ఉద్ఘాటిస్తున్న పెట్టుబడి, దిగుమతులని పిలువబడే వాటి జోరుని బట్టి చూస్తుంటే అదేమీ అసాధారణమైనటువంటిది కాదు. ఈ పెట్టుబడులు, దిగుమతులనే వాటి జోరుకీ ఉత్పత్తికీ ఏమీ సంబంధం లేకుండా ఉన్నది. ఉత్పత్తి అన్నది అసలు పెరగనే లేదు. రహస్య ఖాతాలకి మాత్రమే దానితో సంబంధం ఉండి ఉండాలి. విదేశాలలో వస్తువులు కొనుగోలు చేసేందుకు వినియోగించే విదేశీ మారక ద్రవ్యంలో 10 నుంచి 15 శాతం వరకూ అనామతుగా కమీషన్‌ల రూపంలో గుట్టు చప్పుడు కాకుండా ఆ రహస్య ఖాతాలలోకి చేరిపోతుంది. గత సంవత్సరం మనం రు. 20,000 కోట్ల విలువైన వస్తువులని దిగుమతి చేసుకుని ఉంటాము. ఆ ఏడాది దిగుమతులు జోరుగా జరిగాయి. చప్పున లెక్క వేసి చూస్తే ఆ ఒక్క సంవత్సరంలోనే ఎంత డబ్బు గుట్టు చప్పుడు కాకుండా రహస్య ఖాతాలలో జమ అయి ఉంటుందో తెలుస్తుంది.

మేధావుల వలసకీ, మన డబ్బు విదేశాలకి చేరిపోవటానికీ తేడా లేదు. వ్యక్తులు దేశం వదలిపోతున్నారు ఆ కారణంగానే సంపద కూడా దేశం నుంచి హరించుకుపోతున్నది. ఇటువంటిది మూడవ ప్రపంచం అంతటా జరుగుతూనే ఉన్నది-ముఖ్యంగా లాటిన్ అమెరికా బ్రెజిల్, మెక్సికో వంటి దేశాలలో. ఒకప్పుడు ప్రపంచ బాంక్ అక్కడి విజయగాథలని మిగతా ప్రపంచానికి వివరిస్తూ ఉండేది. మన యువతరం వేలాదిగా దేశం వదలి వెళ్లిపోతున్నారు. వాళ్లు ఎంత తెలివైన వారైతే అంత త్వరగా అమెరికా సంయుక్త రాష్ట్రాలకీ, యూరోప్‌కీ వెళ్లటానికి సిద్ధపడుతున్నారు. బోల్షివిక్ విప్లవంలో రష్యన్ సైనికులు యుద్ధం చెయ్యటానికి నిరాకరించి బారకాసుల నుంచి పారిపోయినట్లు మన యువతరం ప్రవర్తిస్తున్నారు. శైశవ దశలో ఉన్న దేశానికి మేధావుల వలస కన్నా మించిన ఉపద్రవం మరొకటి లేదు. పులి మీద పుట్రలా దానికి తోడు ఇప్పుడు సంపదని కూడా విదేశాలకి తరలించటం జరుగుతున్నది.




## న్యూఢిల్లీ లేఖ



డా. జయ్ దుబాషి

విశ్వనాథ ప్రతాప్‌సింగ్ ఏమైనా చెప్పవచ్చు కాని ఇది ఒక ఆర్థికె సమస్య కాదు. తప్పకుండా ఇది సామాజిక సమస్య. బహుశః రాజకీయమైనటువంటిది కూడా. మీరు రూపాయలు, డాలర్లు సంపాదిస్తే రూపాయలని డాలర్లలోకి మార్చి స్విట్జర్లాండ్‌లోనో, మరో చోటో దాచుకోటం తెలివైన పని. ఎందుకంటే అప్పుడే మీరు సంపాదించిన డబ్బు విలువ పడిపోకుండా ఉంటుంది. ప్రస్తుతం రూపాయి విలువ 12 పైసలు. దానికి ఏమీ రాదనే చెప్పాలి. అదే డాలర్- లేదా స్విస్ ఫ్రాంకు లేక జర్మన్ మార్కులు కూడా డాలర్‌లాగే విలువైనటువంటివి-వాటిని ఎక్కడైనా నగదుగా మార్చుకోవచ్చు. ఈ కారణం వల్లనే ఎన్‌క్రూమాలూ, ఫెర్డినాండ్ మార్కోస్‌లూ, మిగతా తృతీయ ప్రపంచ నాయకులు తాము దోచిన డబ్బుని న్యూయార్క్‌లోనో, జ్యూరిచ్‌లోనో (ఇంకెక్కడో ఆ దేవుడికే తెలియాలి) దాచుకుంటున్నారు. ముగాబే, కౌండాలు కూడా ఇప్పుడు ఆ పనిలోనే తీరిక లేకుండా ఉండి ఉంటారు. అంతర్జాతీయ ద్రవ్య నిధి నివేదికలని బట్టి మన ఎన్‌క్రూమాలు (ఆయన నెహ్రూ కుటుంబానికి పరమ ఆప్తుడుగా ఉండే వారు) కూడా అదే పనిలో ఊపిరి సలపకుండా ఉన్నారని స్పష్టమవుతున్నది. ఎన్‌క్రూమాలకి వారి దేశాల మీదే నమ్మకం లేదు. మన నాయకులకి కూడా భారత దేశం అంటే విశ్వాసం లేదు. ఇలా సంపద బయటికి పోవటం అన్నది భారత దేశం అనే నౌక మునిగిపోతున్నదని ప్రజలు గుర్తించటానికి ప్రబల నిదర్శనం. మనం అనుకున్న దానికంటే చాలా ముందుగానే ఎలుకలు నౌకని వదలి పెట్టి పోయే సమయం వస్తుంది

గత వారం నేను అన్నట్లుగా భారత ప్రభుత్వం అనేటువంటిది ఏదీ లేదు ప్రభుత్వం అనేదే లేకుండాపోయింది ఇంత వరకూ దేశంలో నల్ల డబ్బు ఎంత ఉందనే అంకెలని మాత్రమే చూడవలసి ఉండేది కానీ ఇప్పుడు విదేశాలలో రహస్యంగా దాచిన విదేశీ మారక ద్రవ్యం వివరాలు చూస్తుంటే నేను చెప్పిన దానిలో వాస్తవం ఉన్నదా లేదా అన్నది మీకు అర్థం అవుతుంది ఇప్పుడు మనకి విదేశాలలో

దాదాపు రు. 30,000 కోట్లు ఉన్నది. దేశంలో అంతకి రెండు రెట్లు నల్ల డబ్బు ఉంది. ఈ రెండూ కలిపి దాదాపుగా రు. 1,00,000 కోట్లు అవుతుంది. ఇంత పెద్ద మొత్తం మీద ప్రభుత్వానికి ఎటువంటి అదుపూ లేదు. అంత భారీ మొత్తం మీద అదుపు లేని ప్రభుత్వం అంటే మనది ఎటువంటి ప్రభుత్వం? ఆర్థిక వ్యవస్థలో అంత పెద్ద మొత్తం దేశం వెలుపల ప్రభుత్వం అదుపు లేకుండా ఉన్నప్పుడు అది ఆర్థిక వ్యవస్థని ఎలా అదుపు చేస్తుంది? భవిష్యత్ ప్రణాళికలని ఎలా రూపొందించగలుగుతుంది? మనకి రెండు ఆర్థిక వ్యవస్థలు ఉన్నాయి. త్వరలో రెండు ప్రభుత్వాలు వచ్చినా ఆశ్చర్య పడక్కర్లేదు. మెక్సికో, బ్రెజిల్‌లో అలాగే ఉంది. మార్కోస్‌ని పదవీభ్రష్టుడిని చేయక ముందు ఫిలిప్పయిన్స్‌లో కూడా అలగే ఉండేది. దేశం లోపలా, వెలుపలా ఉన్న డబ్బులో చాలా భాగం పంజాబ్‌లో ఉపయోగపడుతున్నది. బహుశ డార్జిలింగ్‌లో కూడా ఉపయోగపడుతుంది, ఎందుకంటే త్వరలోనే అక్కడ కూడా మరొక ఉద్యమం తల ఎత్తబోతున్నది. ఎక్కడ డబ్బు ఉంటే అక్కడ అధికారం ఉంటుంది, అలాగే ఎక్కడ 'అధికారం ఉంటుందో అక్కడ గొడవలు ఉంటాయి.

మన కష్టాలన్నీ ప్రారంభ దశలోనే ఉన్నాయని నేననుకుంటున్నాను. విదేశాలలో ఉన్న ఖాతాలలో డబ్బు పెరిగిపోతున్న తీరు చూస్తుంటే త్వరలోనే భారతీయ సంపద మన దేశంలో కంటే విదేశాలలోనే ఎక్కువగా ఉండే పరిస్థితి వస్తుంది. ఇప్పటికే చాలా మంది భారతీయ వాణిజ్యవేత్తలు యూరోప్, తద్విత చోట్ల ఫాక్టరీలు పెడుతున్నారు. ఎందుకంటే వాళ్ల దగ్గర అవసరానికి మించిన డబ్బు ఉన్నది. స్వరాజ్‌పాల్ విదేశంలో నివసిస్తున్న భారతీయుడు. బ్రిటన్, తదితర ప్రాంతాలలో ఉన్న ఆయన ఫాక్టరీలు అన్నీ చట్టబద్ధమైనటువంటివే. కాని త్వరలోనే ఫోర్డ్, జనరల్ మోటార్స్ వంటి కంపెనీలలో కూడా భారతీయుల పెట్టుబడులు మీకు కనిపిస్తాయి. అంటే భారతీయులు అమెరికా సంయుక్త రాష్ట్రాలు, జపాన్‌లలో అభివృద్ధికి పెట్టుబడి సమకూరుస్తున్నారన్నమాట. ఇక్కడ మనం అధికారికంగా చిప్ప చేత్తో పుచ్చుకుని ప్రతి ఏడూ ప్రపంచ బాంక్‌కో, మరో సంస్థ దగ్గరికో సహాయం కోసం తిరుగుతూ ఉంటాము. నిజానికి ప్రభుత్వం చేస్తున్న పనేమిటంటే, ఎక్కువ వడ్డీకి తన డబ్బుని తానే అప్పు తీసుకుంటున్నది. ఎందుకంటే ప్రపంచ బాంక్‌కి స్విట్జర్లాండ్ చాలా ఉదారంగా డబ్బు ఇస్తుంది. మన ఆర్థిక మంత్రి తగినన్ని వనరులు మనకి లేవని ప్రతి రోజూ బీద అరుపులు అరుస్తున్న దానిని బట్టి ఇక్కడ మన ప్రజలు పస్తులు ఉంటూ ఉంటే మన డబ్బు ధనిక దేశాల అభివృద్ధి కోసం పెట్టుబడిగా ఉపయోగపడుతూ ఉన్నది. కాంగ్రెసు ఆర్థిక విధానం మనకి అందించినది ఇదే. నవ్వాలో ఏడవాలో తెలియని, మాటలలో వ్యక్తం చేయలేని వ్యధాభరిత స్థితి మనది. □

సమృద్ధ పరిమళము
సరియైన ధరతో




"గులాబి మరియు ఆకుపచ్చ రంగులలో లభించును"



# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు
స్థాపితం 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు (1938-1972)

12-18 డిసెంబర్, 1986
శ్రీ అక్షయ నామ సం మార్గశిర శు ద్వాదశి
సంపుటము 79 : సంచిక 15

ముఖ్య సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక(యాక్టింగ్) సంపాదకుడు
మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు 2 75 |
| పోస్టులో 6నెలల చందా | రు. 78 00 |
| పోస్టులో 12నెలల చందా | రు. 156.00 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం .
నటి మందాకిని
(ఫొటో కాజాస్)






### ధర్మపథం

నటి సుహాసిని" ముఖ చిత్రంతో వెలువడిన 14–20 నవంబరు 1986 సంచిక ధర్మపథం శీర్షికలో మూర్ఖుల పాండిత్యం గురించి రచయిత చక్కగా వివరించారు

– బళ్లారి మహమ్మద్ సలీమ్, గుత్తి

### కథలు

పీడ భార్య కోరిక, మైడియర్ ఇడియట్ కథలు చాలా బాగున్నాయి

– ఎం శివాజీ, మోదుకూరు

★ ★ ★

14–20 నవంబర్ '86 సంచికలో న్యూస్రాపాయల నోటు కథ హాస్యంగా వుండి మమ్మల్ని ఆనందపరిచింది

– రెడ్డి శివనాగేశ్వరరావు, మాచర్ల

★ ★ ★

సుహాసిని ముఖచిత్రంతో వెలువడిన ఆంధ్రసచిత్ర వారపత్రికలో నీళ్ళుపుట్టని నిజాయితీ కథ చాలా బాగుంది

– లోకేశ్వరీదేవి, ఇచ్ఛాపురం

★ ★ ★

ఈ వారం (14–20 నవంబరు) సంచికలో పీడ భార్య కోరిక బాగుంది సినిమా థియేటర్ వద్ద తన టిక్కెట్ను ఆఫీసరుగారి పరం చేసి, దిగాలుగా, దీనంగా మిగిలిపోయిన గోపాలం పరిస్థితికి జాలేసింది ఇలాంటి అభాగ్యుల భార్యల కోరికలు చిన్నవైనా అవి ఎండమావులే!

– వక్కలంక రామారావు, మానేపల్లి

★ ★ ★

నవంబర్ 14–20, 1986 సంచికలోని నీళ్ళు పుట్టని నిజాయితీ" కథ నిరుద్యోగ సమస్య వల్ల ఉత్పన్నమౌతున్న అనర్థాలకు అద్దం పట్టింది యువతను పట్టి పీడిస్తున్న నిరుద్యోగ సమస్యను ఇతి వృత్తంగా స్వీకరించిన రచయితకు అభినందనలు

– కె వి యస్ యల్ నరసింహారావు, రాజమండ్రి

### సీరియల్స్

కన్నడ ప్రజల హృదయాలను దోచుకొన్న ఏకైక తెలుగు వారపత్రిక ఆంధ్ర సచిత్ర వారపత్రికలో సీరియల్స్ ఆలోచనాత్మకంగా, సృజనాత్మకంగా సాగిపోతున్నాయి 'నిశ్శబ్ద సంగీతము' ముగింపు చాలా బాగుంది

కె వెంకటలక్ష్మి, రాయచూర్ (కర్నాటక)

★ ★ ★

21-27 నవంబర్ పూర్ణిమ ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది "రసరాగ వాహిని" మొదటిలోనే మమ్ములనెంతో ఆకట్టుకుంది రచయిత్రి కె నాగేశ్వరి గారికి హృదయపూర్వక అభినందనలు

నాగండ్ల వెంకటేశ్వర్రావు, రమేష్, అమ్మాపాలెం (వరంగల్)

### శీర్షికలు

నటి పూర్ణిమ" ముఖ చిత్రంతో వెలువడిన పత్రిక చాలా అందముగా, ముచ్చటగా, ఆకర్షణీయంగా ఉంది

ఇందులో 'అభిమాన తారలపై అభిప్రాయాలు', "విజయశాంతి సమాధానాలు" బాగున్నాయి

విజయలక్ష్మి, మనోరమ, ఇస్కపల్లి, (నెల్లూరు)

### వ్యాసాలు

21-27 నవంబర్– 1986 సంచికలో 'శివ పంచాయతన క్షేత్రం'– చదువుతూంటే స్వయంగా ఆ పుణ్య క్షేత్రం చూచినట్లయింది 'కొసరాజు'గారి అన్నమయం విచారకరం తెలుగు చిత్రసీమకు అటువంటి రచయితలు దొరకడం చాలా అరుదు

యన్ కనకారావు, పర్లాకిమిడి


(72 వ పేజీ చూడండి)

సీరియల్

# ఆరోహణ

శైలకుమార్



(గత సంచిక తరువాయి)

తిరుపతి కొత్త వీధిలోని ఓ మేడ మీది గదిలో ఒంటరినివాసం పాతికేళ్ళ చక్రవర్తిది పేరులో తప్ప జీవితంలో మిగలని చక్రవర్తిత్వం దేవస్థానం వారి ఆఫీసులో ఒక చిన్న గుమాస్తా అతను చేస్తున్న ఉద్యోగం, గడుపుతున్న జీవితంతో ఏమాత్రం సంతృప్తి లేక అనుక్షణం ఘర్షణ పడే మనస్సు, బాధకు ఆనందానికి చలించి ఉద్రేకపడి ఊగిపోయే వయస్సు అతని ఆస్తి

సాహిత్యం జీవితం, కవిత్వం ప్రాణం చక్రవర్తికి శ్రీశ్రీ ఉద్రేకం, దేవులపల్లి విషాదం, తిలక్ భావుకత, గాలిబ్ ప్రేమో పాసన అతని హృదయాన్ని కదిపి కుదుపుతున్నాయి అక్షరాల సౌందర్యానికి జీవితాన్ని అమ్మేసుకుని రసస్పందనల కౌగిట్లో ఖైదీగా దిక్కులు చూస్తున్నాడు అతను చిన్నప్పటి నుంచి యాంత్రిక జీవితం హృదయం మీద చేసిన గాయాలను కవిత్వంతో కప్పి పుచ్చుకుంటున్నాడు చక్రవర్తి

ఏదో రాయాలని, ఈ ప్రపంచానికి ఏమో చెప్పాలని, మనిషికి మనిషికి మధ్య అడ్డు గోడలుగా నిలబడుతున్న సున్నితపు తెరల్ని తెంచి మనసుకు పట్టాభిషేకం చేయాలని అతని ప్రయత్నం

ఆరు బైట డాబా మీద పడుకుని, అర్ధరాత్రుళ్ళు మెలుకువ వచ్చి చెప్పలేని విషాదంతోను, భరించ లేని ఏకాంతం తోను మెలికలు తిరిగిపోయేవాడు రాత్రిళ్ళు గదిలో ఒంటరిగా కూర్చుని మనసుకు మాటల రూపం ఇస్తూ కథలు, కవితలు వ్రాసుకునే వాడు దాదాపు అన్ని పత్రికలూ ఆదరిస్తూ వున్నాయి అతని రచనల్ని

ఆఫీసులోను గది దగ్గరా కూడ ఎవ్వరితోను ఎక్కువగా మాట్లాడే వాడు కాదు చక్రవర్తి ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ దిక్కులు చూస్తూ వుండేవాడు సాయంత్రాలు ఊరివెలుపలికి నడుచుకుంటూ వెళ్ళి ఒంటరిగా కూర్చుని ఆలోచనల్లో మునిగి పోయేవాడు కొందరు అతనికి గర్వం అనుకునే వారు కొందరు అమాయకుడనుకునేవారు. ఎవరు ఏమనుకుంటున్నా ఏమీ పట్టించుకునే వాడు కాదు చక్రవర్తి

ఆఫీసులో చక్రవర్తి ఎక్కువగా మాట్లాడేది ప్రభాకర్‌తో ఆదోని దగ్గర ఒక పల్లెటూరు ప్రభాకర్‌ది ఎప్పుడూ సరదాగా నవ్వుతూ అందరినీ నవ్విస్తూ వుండే వాడు ప్రభాకర్ చక్రవర్తి పట్ల ఏదో తెలియని అభిమానం అతనికి. చక్రవర్తి కవిత్వాన్ని శ్రద్ధగా వినేవాడు చక్రవర్తిలోని తపన, బాధ కొంత వరకు గుర్తించ గలిగింది కూడ ప్రభాకరే

ఆఫీసులో కూర్చుని ఏదో ఫైలు చూసుకుంటున్నాడు చక్రవర్తి పదకొండు గంటలు కావటం వల్ల ఆఫీసులో అందరూ తమ తమ పనుల్లో వున్నారు

"అయ్యగారు పిలుస్తున్నారండి" చెప్పాడు ఆఫీసు జవాను చక్రవర్తి దగ్గరకి వచ్చి

చూస్తున్న ఫైలును ప్రక్కన పెట్టి మేనేజరు గదిలోకి అడుగు పెట్టాడు చక్రవర్తి

"ఏమయ్యా అసలు నీకు బుద్ధుందా గర్జించాడు మేనేజరు చక్రవర్తిని చూస్తూనే ఆయన మాటల శబ్దం బయటికి వినిపిస్తోంది

మేనేజరు కోపం చూసి బిత్తర పోయాడు చక్రవర్తి అసలు ఏం జరిగిందో, ఎందుకు మేనేజరు అరుస్తున్నాడో అర్థంకాలేదు చక్రవర్తికి

"బెల్లం కొట్టిన రాయిలా మాట్లాడవేం! అసలు నిన్ను కాదయ్యా అనాల్సింది నీకు ఉద్యోగం ఇచ్చిన వెధవను అనాలి. నీలాంటి వాళ్ళు ఆఫీసులో వుండబట్టే దేశం ఇట్లా తగలడింది" రొప్పుతున్నాడు మేనేజరు

అప్పటికీ విషయం అర్థం కాక బిక్క మొహంతో మౌనంగా నిలబడి పోయాడు చక్రవర్తి

మేనేజరు అరుపులు బయటికి వినిపించటం వల్ల ఆఫీసు స్టాఫు అంతా చెవులు రిక్కించి వింటున్నారు

"ఇది ఎస్టిమేషన్ ఫైలు అనుకున్నావా లేక నీ ఇష్టం వచ్చినట్లు రాయటానికి చిత్తుకాగితాల కట్ట అనుకున్నావా" అంటూ ఓ ఫైలు సరిగ్గా చక్రవర్తి ముందు పడేటట్లు విసురుగా వేశాడు మేనేజరు.

ఫైలు చేతిలోకి తీసుకుని చూశాడు చక్రవర్తి దాని మీద ఓ కవిత వ్రాసి వుంది తన అక్షరాలే నిన్న మధ్యాహ్నం ఏదో రాయాలనిపించి అనాలోచితంగా ఆ కాగితాల మీదే రాశాడు ఆ గీతం

"చూడు చక్రవర్తీ నీకు కవిత్వాలు కాకరకాయలు రాసుకోవాలని వుంటే ఉద్యోగం మానేసి ఇంటి దగ్గర కూర్చుని ఆపని చెయ్యి అంతే కాని ఇలా ఆఫీసులో ముఖ్యమైన కాగితాల మీద తగలెట్టకు"

"సారీసర్ పొరపాటయింది "

"ఆ పొరపాటు ఇంకొసారి జరిగితే చాలా సీరియస్ యాక్షన్ తీసుకోవాల్సి వుంటుంది బి కేర్‌ఫుల్"

మౌనంగా ఫైలు చేతికి తీసుకుని మేనేజరు గది నుంచి బయటికి వచ్చాడు చక్రవర్తి జైలు నుంచి విడుదలై వస్తున్న ఖైదీని చూసినట్లు చూస్తున్నారంతా

తల వంచుకొని గబగబా సీటులోకి వచ్చి కూర్చున్నాడు. మేనేజరు మాటలకు అతని మనసు అవమానంతో కుంగిపోతోంది. ఒక చిన్న పొరపాటుకు అన్ని మాటలన్న మేనేజరు మీద కోపం కూడ వచ్చింది పొట్ట కూటికోసం

**జరిగిన కథ–1:** హీరోయిన్ అరుణ, హీరోలపై డైరెక్టర్ కిరీటి పాటను చిత్రీకరిస్తుంటాడు ఆ సమయంలోనే ఆ పాట రచయిత చక్రవర్తి అక్కడికొస్తాడు ఎన్నోచోట్ల సన్మానాల్ని నిరాకరించిన ప్రముఖ కవి చక్రవర్తి తనకు తిరుపతితో ఉన్న అనుబంధం మూలంగా తిరుపతిలో సన్మానానికి అంగికరిస్తాడు సన్మానం సమయానికి ఎక్కడో దూర ప్రాంతంలో షూటింగులో ఉన్న హీరోయిన్ మానస అక్కడికి చేరుతుంది నీలిమను చూడగలననే ఆశతోనే తిరుపతి వచ్చిన చక్రవర్తి ఆశ ఫలిస్తుంది నీలిమ, చక్రవర్తి ఒకరి సంగతులు ఒకరు కనుక్కుంటుంటారు

గుమాస్తాగిరి చేస్తూ తిరగబడలేని తన అసహాయతమీద కోపం, కసి జాలి కలిగాయి

ఏమిటీ మేనేజరేదో హారతిస్తున్నాడు అడిగాడు ప్రభాకర్ చక్రవర్తి టేబులు దగ్గరికి వచ్చి మేనేజరు తిట్టడాన్ని హారతివ్వడంగా ఆఫీసంతా ప్రచారం చేశాడు ప్రభాకర్

ఆఁ ఏముందీ కవిగారేదో కవిత్వం వ్రాసుంటారు అది ఆయనకు అర్థం కాక అరచి వుంటాడు అంది వ్యంగ్యంగా చక్రవర్తికి రెండు సీట్లు అవతల కూర్చునే టైపిస్టు రేఖ

కోపంగా రేఖ వైపు చూశాడు చక్రవర్తి

ఏం రాశారో మాకూ కాస్త చూపించండి అంటూ చక్రవర్తి చేతిలోని ఫైలు అందుకున్నాడు మరో క్లర్కు పశుపతి

రేఖా ఏదో ఒకరోజు చక్రవర్తి చాలా గొప్ప కవి అవుతాడు చూస్తూ వుండు విసురుగా అన్నాడు ప్రబాకర్.

చూస్తూనే వుంటాంలెండి సాగదీస్తూ అంది రేఖ

అందరూ నవ్వారు ఆ నవ్వులలోని హేళన భరించ లేక సీట్లోంచి లేచి క్యాంటీను వైపు వెళ్ళాడు చక్రవర్తి

చక్రవర్తి వెళ్ళగానే అతడు ఫైలు మీద రాసిన కవితను బిగ్గరగా, వ్యంగ్యంగా చదవసాగాడు పశుపతి

విసురుగా అతని చేతిలోని ఫైలు లాక్కున్నాడు ప్రబాకర్

చూడు పశుపతీ నీకు శక్తుంటే ఎదుటి మనిషి లోని గొప్పతనాన్ని గుర్తించి ప్రోత్సహించు అంతేగాని ఇలా చీప్‌గా నీరు కార్చాలని మాత్రం ప్రయత్నించకు

ప్రబాకర్ కోపం చూసి తగ్గాడు పశుపతి

సాయంత్రం అయింది ఆఫీసు నుంచి ఒక్కొక్కరే వెళ్ళిపోతున్నారు

ఆ వర్కు రేపు చూసుకోవచ్చులే వెళదాంరా పిలిచాడు ప్రభాకర్ చక్రవర్తి దగ్గరకు వచ్చి ఒక్కక్షణం ప్రబాకర్ మొహం లోకి చూసి ఫైళ్ళు కట్టేసి లేచాడు చక్రవర్తి మధ్యాహ్నం నుంచి అతను ఎవ్వరితోను మాట్లాడలేదు మౌనంగా తన పనేదో తాను చేసుకున్నాడు

ఇద్దరూ బయటికి వచ్చి టీ తాగటానికి హోటల్ వైపు నడక సాగించారు మౌనంగా వస్తున్న చక్రవర్తిని చూసి నిట్టూర్చాడు ప్రబాకర్



# ఆరోహణ

మధ్యాహ్నం జరిగిందానికి ఇంకా బాధ పడుతున్నావా అడిగాడు ప్రభాకర్ 'టీ' కి ఆర్డరు ఇచ్చిం తరువాత

లేదు

మరెందుకలా వున్నావు

ఏం లేదు ఎందుకు అందరూ నా మీద శత్రుత్వం ప్రకటిస్తున్నారో అర్థం కాక

తమకు చాతకానిది నీకు చేత నౌతుందన్న కసి, కోపం వాళ్ళకు. నీకు పేరు ప్రతిష్ఠలు వస్తే వాళ్ళే నీకు బ్రహ్మరథం పడతారు చూడు అన్నాడు ప్రభాకర్

టీ వచ్చింది ఇద్దరూ తాగసాగారు

ఇలాంటి వాతావరణంలో పేరు ప్రతిష్ఠలు సంపాదించగల నన్న నమ్మకం నాకు లేదు ప్రబాకర్

ఇదిగో ఇలా నిరాశ పడటమే నే నొప్పుకోను ఏకాగ్రతతో నీ కృషి నువ్వు చెయ్యి ఫలితం తప్పకుండ వుంటుంది

చివరికి రేఖ కూడ చూడు ఎంత వ్యంగ్యంగా అందో

రేఖ గురించి నీకు తెలీందేం వుంది'

రేఖ గురించి ఆఫీసులో రకరకాల విషయాలు ప్రచారంలో వున్నాయి ఈ ఉద్యోగం కాక రాత్రి పూట రసికులతో వేరే ఉద్యోగం చేస్తుంది అన్నది అందులో ముఖ్యమైనది ఆమెతో మేము గడిపాము అని ఆఫీసులో చెపుతున్న వాళ్ళూ వున్నారు మామూలు అందంతో వుండే రేఖ వెనుక వున్న విషయాలు వినటం తప్ప మరేం తెలియదు చక్రవర్తికి

అసలు నేనీ ఉద్యోగం చెయ్యలేను ప్రభాకర్ ఈ ఫైళ్ళు ఎస్టిమేట్లు నాకేమాత్రం సంతృప్తి నివ్వటం లేదు అశాంతి పెంచుతున్నాయి' ఏదో ఒక పత్రికలో సబెడిటరుగా చేరిపోవాలనుంది బాధగా అన్నాడు చక్రవర్తి

అభిరుచికి తగ్గట్టుగా బ్రతికే అవకాశాలు ఈ దేశంలో అందరికీ లేవు చక్రవర్తీ ఉన్నవాటితో రాజీపడాలి'

ఆ రాజీవల్ల మిగులుతున్నది అశాంతే"

ఆ అశాంతినే అక్షరాల్లో పెట్టు అదే గొప్ప రచన అవుతుంది" అన్నాడు ప్రబాకర్

ఉలిక్కి పడ్డాడు చక్రవర్తి ఆ మాటలకు తన కేమీ తెలియదనే ప్రభాకర్‌లో ఎంత ఆలోచన

సిగరెట్లు వెలిగించుకుని ఇద్దరూ లేచి బయటికి వచ్చారు.

"రూము కేగదా" అడిగాడు ప్రభాకర్.

"ఔను అని కదిలాడు

ప్రభాకర్ అన్న మాటలను గురించే ఆలోచిస్తూ రూముకు వచ్చాడు



చక్రవర్తి స్నానం చేసి బట్టలు వేసుకుని రోడ్డు మీదికి వచ్చాడు

కపిలతీర్థం వైపు నడక సాగించాడు చక్రవర్తి స్నానం చెయ్యటంవల్లా, చల్లని గాలి వీస్తూ వుండటం వల్ల చాలా హాయిగా అనిపిస్తోంది అలా నడుస్తూ చాలా దూరం వచ్చేశాడు చక్రవర్తి రోడ్డు ప్రక్కన ఇసుక పోసి వుండటంతో వెళ్ళి ఇసుకలో కూర్చుని సిగరెట్టు వెలిగించుకున్నాడు

గాలికి క్రాఫ్ చెదిరి పోతోంది చుట్టూ పరిశీలించాడు అతనికి కాస్త దూరంలో విశాలమైన కాంపౌండుతో ఒక ఇల్లు కనిపించింది ఊరికి దూరంగా విసరివేసినట్లుగా వుంది ఆ ఇల్లు 'ఇంత దూరంలో ఇల్లు కట్టుకున్నది ఎవరు' అనుకున్నాడు మనసులో

సూర్యుడు అస్తమిస్తున్నాడు సంధ్యారుణ వర్ణం ఆకాశమంతా అలుముకొంది ఎర్రని మేఘాలు కొండమీద కిరీటాల్లా వున్నాయి గాలి వల్ల ...ఐ రూపాలు మార్చుకుంటున్న మేఘాలను, బొమ్మల్లా కనిపిస్తూ కొండ మీద ...ండి దిగుతున్న బస్సులను చూస్తూ వుండి పోయాడు

నిర్మానుష్య మైన ఆ ప్రదేశంలో తాను నిజంగా చక్రవర్తినే అనుకుని నవ్వుకున్నాడు తల తిప్పి కపిల తీర్థాన్ని చూశాడు వర్షాలు లేక పోవటం వల్ల సన్నటి ధార పడుతోంది

ఉదయం మేనేజరు అన్న మాటలు, ప్రభాకర్ ఓదార్పు గుర్తొచ్చాయి చక్రవర్తికి ఒక విధమైన కసి బయలు దేరింది వాళ్ళందరూ ఆశ్చర్య పోయేంత పేరు సంపాదించాలి రచనల ద్వారా అనుకున్నాడు తన కోపానికి తనకే నవ్వు వచ్చింది

ఎవరు ఎన్ని విధాల హేళన చేసినా, విమర్శించినా తను ఏకాగ్రతను కోల్పోయి నిరాశ పడకూడదని నిర్ణయించుకున్నాడు ఆ నిర్ణయంతో అతనికి కొండంత బలం వచ్చింది తను రచనల మీద తప్ప మరి దేని మీదా దృష్టిసారించకు ఏదు అనుకున్నాడు

సూర్యుడు మరింత క్రిందికి దిగాడు ఆకాశంలోని ఆ అరుణ రాగపు అందాన్ని చూస్తూ తాను వ్రాయాలనుకున్న నవల గురించి ఆలోచనలో పడ్డాడు చక్రవర్తి

గాలి అలల మీద తేలుతూ, తీలగా సన సన్నగా ఒక పాట చక్రవర్తిని తాకింది దూరంగా ఎవరో స్త్రీ పాడుతోంది ప్రపంచంలోని విషాద మంతా ఆ గొంతులోనే నిండినట్లు, అంత విషాదంగా మరెవ్వరూ ఆ పాట పాడలేనట్లు పాడుతోంది ఆ యువతి గొంతు నుండి కాక హృదయం నుండి ఆలపిస్తోంది రాగం

చెవులు రిక్కించి మరీ విన్నాడు చక్రవర్తి మరుక్షణం ఉలిక్కి పడ్డాడు ఆ పాట అతను వ్రాసిందే కొద్ది రోజుల క్రితం రేడియోలో ప్రసారమైంది

తుఫానులో పడవ ఊగినట్లు ఆనందాశ్చర్యాలతో ఊగిపోయిందతని హృదయం తన పాటను గుర్తించి ఎవరో స్త్రీ ఆలపిస్తోందన్న ఆనందం ఆమె రూపం కనిపించటం లేదన్న బాధ

సనసన్నగా చీకట్లు కమ్ము కుంటున్న ఆ సాయంకాలంలో, చల్లని చిరుగాలి వీస్తున్న ఆ సమయంలో ఆ ఏకాంత ప్రదేశంలో, గాలిలో తేలి, హృదయాన్ని తాకి అనంత విషాదంలోకి లాక్కు పోతున్న ఆ పాట, అజ్ఞాతంగా ఆ పాటను ఆలపిస్తున్న ఆ స్త్రీ, ఆ సమయం చక్రవర్తిని ఓ మత్తులోకి తీసుకెళ్ళాయి

కవిగా తన జీవితం ధన్యమైందనుకున్నాడు చక్రవర్తి ఆ క్షణం ఆ పాడుతున్న దెవరో చూడాలన్న కోరిక కొండంతగా ఎదిగింది అతనిలో తపన ఆపుకోలేక పరిసరాలు పరిశీలించాడు ఎదురుగా కనిపిస్తున్న ఆ ఇంటి లోంచి వినిపిస్తోంది ఆ పాట

ఆ పాట లోని ఆర్ద్రతకు, కవిగా తనకు అక్కడ ఆ క్షణం లభించిన గుర్తింపుకు చక్రవర్తి కళ్ళు చెమ్మ గిల్లాయి

ఒక్క ఉదుటున లేచి ఆ ఇంట్లోకి ప్రవేశించి ఆ పాడుతున్న దెవరో చూడాలన్నంత ఆవేశం వచ్చింది అతనికి ఎవరో ఏమిటో తెలియకుండా ఎలా వెళ్ళటం సంస్కారం అడ్డు వచ్చి అతన్ని ఆపేసింది

పాట ఆగిపోయింది హృదయాన్ని ఎవరో పిండి శూన్యాన్ని దోసిట్లో పోసినంత బాధ

## ఆరోహణ

ఆ ఇంటి వైపే చూస్తూ చాలా సేపు వుండిపోయాడు చక్రవర్తి ఆ ప్రదేశం నుండి కదలి వెళ్ళటానికి అతనికి మనస్కరించటం లేదు అలాగే పాట విన్న మత్తులో, ఆ ఆనంద విషాదాల మైకంలో ఆలోచనా రహితంగా ఎంతో సేపు వుండిపోయాడు చక్రవర్తి

చివరికి బరువుగా పైకి లేచాడు ఆ ప్రదేశాన్ని వదల లేక వదలి పెడుతూ భారంగా రూము వైపు నడక సాగించాడు

రూముకు వచ్చి పడుకున్నాడే గాని అతని కేమాత్రం నిద్ర పట్టలేదు. తన పాట పాడుతున్న ఆ స్వరం అతడిని క్షణ క్షణమూ మేల్కొలిపింది. ఆ పాడిన వ్యక్తిని చూడలేక పోయానన్న బాధ. చూసి తీరాలన్న పట్టుదల పెరిగింది చక్రవర్తిలో ఆ ఆలోచనలకు ఎన్ని సిగరెట్లు కాలిపోయాయో.

తెల్లవారి నిద్ర లేచిం తరువాత గుర్తు వచ్చిందతనికి రాత్రి భోం చెయ్యలేదని. లేచి కూర్చుని రాత్రి కలిగిన భావ సంచలనానికి ఓ కవితా రూపం ఇచ్చాడు చక్రవర్తి.

ఇష్టం లేకుండానే ఆఫీసుకు బయలుదేరాడు చక్రవర్తి. ఆఫీసులో ఆ ఫైళ్ళు కాగితాలు చూడగానే ఎక్కడలేని విసుగు కలిగింది

సీట్లో కూర్చున్నాడే గాని అతని మనసు నిండా ఆలోచనలు. నిన్న సాయంత్రం జరిగిన విషయం ప్రభాకర్‌కు చెప్పాలా వద్దా అనుకున్నాడు. ఎవరికీ చెప్పకుండా ఆ అనుభూతిని తన హృదయంలో దాచుకోలేననిపించింది.

"కాఫీకి వెళదాంరా" అంటూ ప్రభాకర్ ను తీసుకెళ్ళి జరిగిందంతా చెప్పాడు

కాలుతున్న సిగరెట్టును చూస్తూ కొద్ది సేపు ఆలోచనలో పడ్డాడు ప్రభాకర్

"బహుశా ఆమె నీ పాటను బాగా అర్థం చేసుకుని వుండాలి లేదా పాటలోని విషాదానికి ఆమె జీవితానికి ఏదో సంబంధం అయినా వుండాలి అన్నాడు ప్రభాకర్

'ఔను ఆమె ఎంత విషాదంగా పాడిందో నేను వర్ణించ లేకపోతున్నాను వెంటనే ఆమెను చూడాలన్న కోరిక ఎంత బలంగా ఆపుకున్నానో నాకే తెలుసు

' ఆ మనిషిని నువ్వు చూడక పోతేనే మంచిదేమో

ఎందుకూ

చూడాలి అనే కోరికలో వున్న అనుభూతి చూస్తే తగ్గుతుందేమో

'లేదు ప్రభాకర్ ఆమె భౌతిక రూపానికి ఈ అనుభూతికి సంబంధం లేదు నాక్కావలసిందల్లా ఆమె ఎందుకు నా పాటను అభిమానించిందీ అని '

'నువ్వు రాసిన పాట కాబట్టి నీకలా అనిపిస్తోంది ఆమె చాలా మామూలుగా పాడుకుందేమో

'లేదు మామూలుగా పాడితే అంత విషాదం ఆ గొంతులో పలకదు ఆ పాట విన్న ఎవరి హృదయమైనా కరగక తప్పదు ఆ విషాదానికి సిగరెట్టు వెలిగించుకుంటూ సీరియస్‌గా అన్నాడు చక్రవర్తి

మరీ అంత సీరియస్‌గా ఆలోచించకు చక్రవర్తీ జీవితంలో చాలా సంఘటనల్ని మనం మామూలుగా తీసుకోవాలి ప్రతి దానికీ కదలి పోతే చాలా కష్టం "

చక్రవర్తి మొహంలోకి చూశాడు ప్రభాకర్ మౌనంగా సిగరెట్ కాలుస్తూ వింటున్నాడు చక్రవర్తి

'మనల్ని తిట్టేవాళ్ళు వున్నట్లే మెచ్చుకునే వాళ్ళూ వుంటారు అలా మెచ్చుకున్నారనుకుని ఆ సంఘటన వదిలెయ్యి "

అలాగే చూద్దాం అన్నాడు నవ్వుతూ చక్రవర్తి

ఇద్దరూ ఆఫీసులోకి అడుగు పెట్టారు

మీకేదో పత్రిక వచ్చిందండోయ్ కవిగారూ అంది రేఖ తన టేబులు ముందు నుంచి వెళుతున్న చక్రవర్తితో

'చూడండి నన్ను పేరుతో పిలిస్తే చాలు అనవసరమైన గౌరవాలు అక్కరలేదు సూటిగా చూస్తూ అన్నాడు చక్రవర్తి

ఒక్కక్షణం బిత్తర పోయింది రేఖ ఆ సమాధానం విని

"ఏదో కవిత్వం వ్రాస్తారనే అభిమానంతో అలా పిలిచాను అదీ తప్పేనా"







అంది రేఖ ఇబ్బందిగా ముఖం పెట్టి

'మీ అభిమానం సంగతి నాకు తెలుసు' అని పత్రిక తీసుకుని సీట్లో కూర్చున్నాడు. చక్రవర్తి కథ 'కలకానిది' ముద్రింపబడి వుంది ఆ పత్రికలో తృప్తిగా దాన్నొకసారి చూసి పత్రిక పక్కన పెట్టాడు చక్రవర్తి

చక్రవర్తి మాటల వల్ల వచ్చిన కోపాన్ని టైపు మిషను మీద చూపించటం ప్రారంభించింది రేఖ

* * * *

సాయంత్రం ఆఫీసు అయిపోగానే నేరుగా రూముకు వచ్చాడు చక్రవర్తి మళ్ళీ ఆ ఇంటి దగ్గరికి వెళ్ళి కూర్చోవాలన్న కోరిక అతన్ని బలంగా లాగేస్తోంది స్నానం చేసి తయారై కపిలతీర్థం వైపు బయలుదేరాడు

ఆ ఇంటిని పరిశీలనగా చూశాడు చక్రవర్తి మరీ అంత పెద్ద ఇల్లు కాకపోయినా చుట్టూ కాంపౌండుతోను పూల మొక్కలతోను అందంగా వుంది ఇల్లు కట్టించిన వాళ్ళ అభిరుచి చూడగానే తెలుస్తోంది

నిదానంగా ఇంటినే చూస్తూ వెళ్ళి అదే ఇసుకలో కూర్చుని సిగరెట్ వెలిగించుకున్నాడు ఎన్నో భావాలు ఒక్కసారిగా చుట్టుముట్టాయి అతన్ని ఈ రోజు కూడా ఆమె పాడుతుందా, లేక ప్రభాకర్ అన్నట్లు నిన్న మామూలుగా పాడిందా? హృదయంలో భావ సంచలనం

ఆలోచిస్తూ సిగరెట్టు మీద సిగరెట్టు కాలుస్తూ కూర్చున్నాడు చక్రవర్తి

ఆకాశం నిండా నల్లని మేఘాలు కమ్ముకుంటున్నాయి గాలి మరీ చల్లగా వుంది ఇప్పుడో మరి కొద్ది సేపటిలోనో వర్షం పడేటట్లుగా వుంది వాతావరణంలో జరుగుతున్న మార్పును ఏమాత్రం గుర్తించ లేదు చక్రవర్తి అతని మనసంతా ఆలోచనలు

"ఎవరికి ఎవరూ కారు
నీకై ఎవరూ రారు
ఎందరిలో నువ్వుంటున్నా
ఒంటరిదే మనసంటున్నా' గాలిలో తేలుతూ వచ్చి పాట వినిపించింది చక్రవర్తికి అదే స్వరం, అదే విషాదం నాగస్వరం విన్న నాగు తల ఊపినట్లు, ఆ రాగలహరి కలిగించిన మత్తులో పడిపోయాడు చక్రవర్తి ఏదో మైకం ఊపేస్తోంది అతడిని

మెల్లగా చినుకులు పడటం ప్రారంభించాయి తల ఎత్తి ఆకాశం వంక చూసి అలాగే కూర్చున్నాడు పాట ఆగింది వర్షం మరింత ఎక్కువైంది తడిసి పోతున్నాడు చక్రవర్తి

ఆమెను చూడాలన్న కోరిక క్షణ క్షణానికి బలమైంది అతనిలో నిలువలేక పోయాడు ఏదో మత్తులో నడుస్తున్నట్లు, ఏదో ఆవేశం నడిపిస్తున్నట్లు అప్రయత్నంగా ఆ ఇంటి కేసి నడిచి, గేటు తీసుకుని వరండా వరకు వచ్చి అలాగే నిలబడిపోయాడు చక్రవర్తి అడుగు ముందుకు వెయ్యాలా వద్దా అన్న సందేహం ఎవరిని పిలవాలి? ఏమనుకుంటారు అన్న సందిగ్ధం

తడిసి పోయిన చక్రవర్తి మీద నుంచి నీళ్ళు కారుతున్నాయి

ఇంతలో ఎవరో స్త్రీ ఇంటిలో నుండి వరండాలోకి వచ్చింది తడిసి పోయిన బట్టలతో నీళ్ళు కారుతూ అమాయకంగా కనిపించిన చక్రవర్తిని చూసి ఆశ్చర్యపోయింది

అయ్యయ్యో తడిసి పోతున్నారు ఇలా వరండాలోకి రండి ఫరవాలేదు అంది

చక్రవర్తి మత్తు విడిపోయినట్లయింది ఒకసారి తనను తాను చూసుకుని వరండాలోకి అడుగు పెట్టాడు

కూర్చోండి" అంది ఆమె ఓ కుర్చీ జరుపుతూ కూర్చున్నాడు మంత్ర ముగ్ధుడిలా

ఏమండీ లోపలికి అడుగు పెట్టబోతున్న ఆమె ఆగి వెనక్కి తిరిగింది 'ఏమిటి' అన్నట్లు,

మీరేం అనుకోకపోతే అంటూ ఆగిపోయాడు చక్రవర్తి ఎలా చెప్పాలో తెలీక

చెప్పండి అందామె నిదానంగా చక్రవర్తిని పరిశీలనగా చూస్తూ

ఇందాక ఈ ఇంట్లో ఎవరో పాట పాడుతూ వున్నారు వారి నొకసారి చూడాలని ఆగి ఆగి చెప్పాడు తడబడుతూ

పైనుంచి క్రిందికి చక్రవర్తి నొకసారి చూసిందామె

మీరిక్కడికి వచ్చింది వర్షంలో తడుస్తానని కాదా

కాదు ఆమెను చూడాలని' మెల్లగా అన్నాడు తల దించుకుని

ఆమె హృదయం ఝల్లుమంది ఎదుటి మనిషి మీద ఏదో చెప్పలేని గౌరవం కలిగింది అతడు వర్షంలో తడవకుండా వుండటం కోసం వరండా దగ్గరకి వచ్చాడనుకొంది కాని వర్షంలో తడుస్తూ పాట పాడిన ఆ స్త్రీ మూర్తిని చూడటానికి వచ్చాడని తెలిసేసరికి ఆమెలో ఏదో సంచలనం ప్రారంభమైంది

'ఇతనో కళాకారుడయ్యుంటాడు' అనుకుంది మనసులో

ఎందుకు చూడాలనుకుంటున్నారామెని అడిగింది అతని కెదురుగా కుర్చీలో కూర్చుంటూ

విషాదమంతా ఆమె హృదయంలో గూడు కట్టుకొన్నట్లుగా ఆ పాట పాడారు ఆమె కన్న గొప్పగా ఆ పాట ఇంకెవ్వరూ పాడలేరేమో! అందుకని"

గొంతులోని విషాదం ఆమె ముఖంలో కనిపిస్తోందో లేదో చూడాలనా అంది నిట్టూర్చి

ఆమె ఆ మాటల్ని పలికిన తీరులో ఆ పాట పాడింది ఆమే అని చక్రవర్తికి నిర్ధారణ అయింది ఆమె తొలి పలుకుల్లోనే చక్రవర్తికి అనుమానం వచ్చింది పాట ఆమే పాడి వుంటుందన్న ఆ అనుమానం తీరిపోయింది

చీకటి పడటంతో లేచి లైటు వేసింది పరిశీలనగా చూశాడామెను ఎరుపు

# మాట కొత్త బాట

నీ కలం ప్రసవించిన అక్షరంలో
పోలికలు చాలా వరకూ నీ జీవితానివే!
ప్రతి అక్షరం నీ చూపుని చాటుతుంది!
ప్రతి అక్షరం నీ నడకని చూపుతుంది!!
మా కందరికీ లేని ఆరో ఇంద్రియం నీకుంది!
నువ్వు వేడెక్కి పోవాలేగాని
ఎన్ని మర్మాలో నీ ముందుకొచ్చి
ముంచుకొచ్చి కనిపిస్తాయి!
శిలల్లో ఎదిగే శిఖరాల్ని చూస్తావు
అలల్లో కరిగే అగాధాల్ని చూస్తావు
నీ లోచనాలు ఆలోచనాలు!
నీ లోకాలు ఆలోకాలు!
నువ్వు చూసిన ప్రతిసొగసు మాకు చూపిస్తావు
నువ్వు పొందిన ప్రతి స్పందననీ మా కందిస్తావు
నీ మాట మాకు కొత్త బాట
నీ అనుభవం మాకాదర్శం
నీ కన్నా ఎవరున్నారు ధనవంతులు?
నీ కన్నా ఎవరున్నారు దాతలు

–డాక్టర్ మిరియాల రామకృష్ణ

## ఆరోహణ

నలుపు కాని ఛామన చాయ వయస్సు వల్ల శరీరం తిరిగిన వంపులు నల్లని విశాలమైన కళ్ళు కాస్త లావైన ముక్కు ఎరుపూ తెలుపూ కలసిన పెదవులు తల స్నానం చేసిందేమో విడిపోయిన జుట్టును భుజం మీదుగా వక్షం పైకి వేసుకుంది

మరీ అంత అందగత్తె కాకపోయినా ఆమె ముఖంలో ఏదో ఆకర్షణ, గంభీరత వున్నాయి

ఇంతకూ మీరెవరు

నా పేరు చక్రవర్తి అంత కంటే చెప్పుకోవటానికి ఏం లేదు

చక్రవర్తి అన్న పేరు వినగానే ఆమె కేదో జ్ఞాపకం వచ్చింది

మీరు కథలు, కవితలూ వ్రాస్తుంటారా

చెప్పలేని ఆనందం కలిగింది చక్రవర్తికి, తన పేరును ఆమె గుర్తించినందుకు

అప్పుడప్పుడూ అన్నాడు మెల్లగా

అతని మొహంలోకి చూసిందామె చక్రవర్తి జుత్తులో నుంచి ఇంకా నీళ్ళు కారుతున్నాయి

లేచి లోపలికి వెళ్ళి టవలు తీసుకు వచ్చింది

సారీ మాటల్లో మరచిపోయాను' అంది టవలందిస్తూ

ఎందుకండీ

ఫరవాలేదు అంది నవ్వుతూ టవలు అందుకుని తుడుచుకున్నాడు చక్రవర్తి

నిన్న ఆ పత్రికలో వచ్చిన కథ మీదే కదూ

ఔను

మరి చెప్పుకోవటానికి ఇంత వుండగా ఏమీ లేదన్నారే నవ్వుతూ అడిగింది

తనూ నవ్వాడు చక్రవర్తి సమాధానంగా

"పత్రికల్లో మీ రచనలు అప్పుడప్పుడూ చూస్తుంటాను కొన్ని బాగా నచ్చాయి అంది నిజాయితీగ ఆమె

'థాంక్స్ అన్నాడు అంత కంటే ఏమనాలో తెలీక

'మిమ్మల్నో విషయం అడగనా "

అడగండి అంది అతని ముఖంలోకి చూసి ఆమె

ఎందుకు మీరు ఆ పాటను అంత అబిమానించి పాడుకుంటున్నారు

పాట పాడింది నేనే అని కనిపెట్టేశారే

ఇంత సేపు మీతో మాట్లాడి ఆ మాత్రం తెలుసుకోలేనా

తెలుసుకుని పేరైనా అడగలేదే

మీరే చెబుతారని అన్నాడు నవ్వుతూ

'ఆఁ' అంటూ నవ్వి చెప్పింది

నీలిమ

ఎంత చక్కని పేరు అనుకున్నాడు తనలో నీలాకాశంలోని గాంభీర్యం శూన్యం ఆ కంఠంలో నిండి వున్నందుకేమో అంత మంచి పేరు పెట్టుకుంది

పని మనిషి కాఫీలు పట్టుకుని వచ్చింది ఇద్దరూ అందుకున్నారు చల్లగా వర్షం పడుతున్న సమయంలో వేడి కాఫీ తాగటం ఓ చక్కని అనుభూతి

జేబులో చేయి పెట్టి సిగరెట్టు పెట్టె బయటికి తీశాడు పెట్టె మీద ఖర్చీఫ్ పెట్టటం వల్ల తడిసి పోలేదది వర్షానికి

మీ కభ్యంతరం లేకపోతే అన్నాడు ఆమె వైపు చూస్తూ

కాల్చుకోండి

సిగరెట్టు వెలిగించుకున్నాడు చక్రవర్తి

మీరు నా ప్రశ్నకు సమాధానం చెప్పలేదు ఎందుకా పాట అబిమానించారో

రేడియోలో వచ్చే మంచి పాటల్ని టేప్ చేసుకుని మళ్ళీ వినటం నా కలవాటు అలాగే ఈ పాటా చేశాను విన్న కొద్దీ వినాలనిపించింది

కారణం

వ్యక్తి జీవితంలోని ఏకాంతాన్ని విషాదాన్ని చాలా బాగా చిత్రించాడా కవి ఏ తల పండిన కవి రాశాడో కాని ఎంతో నచ్చింది నాకు

'తల పండని వాడు రాయలేడంటారా' కుతూహలంగా అడిగాడు

వ్రాయలేడని కాదు అంత జీవితానుబవం వుండదని

వయసుకు అనుబవాలకు సంబంధం లేదనుకుంటాను నీలిమగారూ

ఔననుకోండి అంది గంబీరంగా

'రేడియోలో కవి పేరు వినలేదా

ప్చ్ మిస్సయ్యాను

కొన్ని క్షణాలు మౌనంగా వుండిపోయాడు

నేనే రాశా నా పాట సూటిగా ఆమెనే చూస్తూ అన్నాడు చక్రవర్తి నిదానంగా

మీరా ఆశ్చర్యపోయింది నీలిమ అతని పట్ల గౌరవం, అబిమానం మరింత పెరిగాయి ఆమెలో

చాలా బాగా రాశారు కవి పేరు తెలుసుకోలేకపోయానే అని చాలా సార్లు బాధ పడ్డాను ఇప్పుడు స్వయంగా మిమ్మల్ని చూడటం చాలా ఆనందంగా వుంది

ఆ పాటను గుర్తు పెట్టుకున్నందుకు నేనే మీకు కృతజ్ఞతలు చెప్పుకోవాలి

నవ్వింది నీలిమ

మీ రచనలన్నీ చదవాలి వీలైతే ఒకసారి ఇవ్వండి శ్రమ అనుకోకపోతే అడిగింది నీలిమ

తప్పకుండా తెచ్చి ఇస్తాను కాని ఒక షరతు

ఏమిటండీ అంది కుతూహలంగా

మీ అబిప్రాయాన్ని చెప్పాలి నిర్మొహమాటంగా

నాకు తెలిసినంత వరకు తప్పకుండ చెబుతాను అంది నవ్వుతూ నీలిమ

మౌనంగా వుండిపోయారు ఇద్దరూ కొంత సేపు

మరి వస్తానండి వర్షం కూడ తగ్గింది అన్నాడు పైకి లేస్తూ చక్రవర్తి

మీకు వీలున్నప్పుడల్లా వస్తూ వుండండి ఆహ్వానించింది నీలిమ

'అలాగే' అని రోడ్డు మీదికి వచ్చాడు చక్రవర్తి రోడ్డు మీద నుంచి వెనక్కి

తిరిగి చూశాడు. వరండా అంచున నిలబడి చూస్తూ వుంది నీలిమ

ఆనందం నిండిన హృదయంతో అమెతో మాట్లాడిన ప్రతి మాట నెమరేసుకుంటూ అడుగు ముందుకు వేశాడు చక్రవర్తి

భోం చెయ్యాలని గాని, రూముకు వెళ్ళాలని గాని అనిపించలేదు చక్రవర్తికి గాలిలో తేలిపోతున్నట్టు, ప్రపంచాన్నే లెక్క చెయ్యనట్టు అడుగులు వేస్తున్నాడు అన్నేళ్ళూ అనుభవించిన ఒంటరితనం ఆనాడే పోయినట్టు, మనసును జ్వలింపజేస్తున్న కవితా దాహానికి ఏదో ఆలంబన దొరికినట్టు అనిపించింది చక్రవర్తికి

ప్రభాకర్ రూము వైపు సాగాయి చక్రవర్తి అడుగులు తలుపు చప్పుడుకు విసుక్కుంటూ వచ్చి తీసిన ప్రభాకరు ఎదురుగా తడిసీ తడవని బట్టల్లో చక్రవర్తి కనిపించే సరికి ఆశ్చర్యపోయాడు

ప్రభాకర్ రూము చక్రవర్తి వుంటున్న ప్రదేశానికి దగ్గరే అయినా చాలా తక్కువ సార్లు వచ్చాడు చక్రవర్తి

రూము లోపలికి అడుగు పెట్టాడు చక్రవర్తి రూములో ఏదో వెగటు వాసన తలుపులు మళ్ళీ మూసేశాడు

"ఏమిటి వర్షంలో తిరుగుతున్నావు

'అమెను చూశాను ప్రభాకర్

కొద్ది సేపు ఏమీ మాట్లాడ లేదు ప్రభాకర్ ఇద్దరూ కూర్చున్నారు వారి మధ్య ఒక చిన్న టేబులు

అందంగా వుందా' అడిగాడు ప్రభాకర్

'అందం చూసే కళ్ళకు మనసుకు సంబంధించినదైతే చాలా అందంగా వుంది" నవ్వుతూ చెప్పాడు చక్రవర్తి

'మాట్లాడావా' చక్రవర్తి మొహంలోకి సూటిగా చూస్తూ అడిగాడు ప్రభాకర్

చాలా విషయాలు మాట్లాడాను సాహిత్యం బాగా చదువుకుందామె కవిత్వాన్ని ఎంతో అభిమానించేటట్టు అనిపించింది అమె మాటల్లో చాలా 'సంస్కారవంతురాలు."

చక్రవర్తి మాటలు వింటూ టేబులు క్రింద దాచిన విస్కీ సీసా, సగం త్రాగిన గ్లాసు బయటికి తీశాడు ప్రభాకర్.

"తీసుకుంటావా" వాటిని టేబులు మీద పెడుతూ అడిగాడు

"అలవాటు లేదు అయినా అంత కంటే ఎక్కువ ఆనందంగా వుంది నాకు '

కొద్ది సేపటి దాకా ప్రభాకర్ ఏమి మాట్లాడలేదు మౌనంగా తాగుతూ వుండిపోయాడు

"చక్రవర్తీ ఉన్న దాని కంటే ఎక్కువగా ఊహించుకుంటున్నావేమో '

"లేదు అలా ఎందుకనుకుంటావు "

'నీ మాటల్ని బట్టి, నీ ముఖంలో కనిపించే ఆనందాన్ని బట్టి నాకలా అనిపిస్తోంది నీలోని కవిని గుర్తించిన అమెను కలుసుకోవద్దని చెప్పను కాని అది స్నేహానికే పరిమితం చేసుకో '

చక్రవర్తి మాట్లాడ లేదు. ఆలోచనలో పడ్డాడు

ఆ రాత్రి అక్కడే నిద్రపోయాడు చక్రవర్తి ఉదయాన్నే ఇద్దరూ తీర్థకట్ట వీధిలోకి వచ్చారు 'టీ' తాగటానికి

"రాత్రి మాటల్లో మరిచాను అమె పేరేమిటి

"నీలిమ "

"బావుంది' అన్నాడు ప్రభాకర్ టీ తాగుతూ

ప్రతి రాత్రీ తాగుతావా '

' లేదు ఎప్పుడో ఒకసారి" నవ్వుతూ అన్నాడు

"ఆఫీసుకు వస్తావుగా" అడిగాడు ప్రభాకర్ రూముకు బయలుదేరిన చక్రవర్తిని

"వస్తాను

ఇద్దరూ విడిపోయారు

(ఇంకా ఉంది)



పాఠకుల శీర్షిక

# గర్భస్థ శిశువు చెప్పిన కథలు

## జ్ఞానోదయం

అర్ధరాత్రి- రమణమూర్తి గాఢ నిద్రలో వున్నాడు "నాన్నా! నాన్నా!" ఎవరో మృదువుగా మలయమారుతంలా నవనీతంలా పిలుస్తున్న శబ్దం నిద్రలో మూర్తి ప్రక్కకి జరిగాడు "నాన్నా! నేను పిలుస్తున్నాను మెలుకువ రాలేదా? - "వచ్చింది- ఎవరు నువ్వు- ఏం కావాలి?" నిద్రలోనే మూర్తి సమాదానం "నేను అమ్మ కడుపులోంచి మాట్లాడుతున్నాను నీకు పుట్టాలనే కోరికతో వున్న, నీకు పుట్టబోయే కూతుర్ని కాని నా దురదృష్టం-.ఈ రోజు ప్రొద్దున నువ్వు డాక్టర్‌తో చెప్పావు "పుట్టేది ఆడపిల్ల అని చెబుతున్నారు ఆడపిల్ల అయితే నాకు వద్దు- ఆడపిల్ల వల్ల తల్లిదండ్రులకన్నీ కష్టాలే అమ్మాయిలు తల్లిదండ్రుల గుండెల మీద కుంపట్లు- కట్నం యివ్వాలి- అత్త మామలు వాళ్ళని హింసించటం, కిరసనాయలు పోసి చంపడం- నో, నో, నాకు వద్దు ఆడపిల్ల రేపే అబార్షన్ చేయండి నా భార్య సీతకు' అని అన్నావు గుర్తుందా!" "ఎస్- ఐ రిమెంబర్- ఐ డోంట్ వాంట్ యు"- మూర్తి ఖచ్చితంగా సమాధానం చెప్పాడు "నాన్నా! నిన్ను చూస్తుంటే జాలేస్తుంది క్రిందటి నీ జన్మ అనుభవాలు నీకు గుర్తు చేస్తూ అప్పటి నీ కథ చెబుతున్నాను విను- అప్పుడు నీ పేరు రామారావు- నీకు యిద్దరు కొడుకులు, గిరి, విరించి ఒక అమ్మాయి- పేరు ఉష-, కొన్ని రోజులకు నీ భార్య పోయింది. నువ్వు మగ పిల్లల్ని ఎంతో ప్రేమగా పెంచావు- నీ డబ్బంతా వాళ్ళకే ఖర్చు చేశావు- వారి మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నావు- చివరికి వాళ్ళు నీకేం చేశారు? పెళ్ళిళ్ళు చేసుకొని, భార్యలతో వెళ్ళిపోయారు- నీ వృద్ధాప్యంలో నిన్ను గాలికి పదిలేశారు తుపానులో మానవక తుపానులో 'కింగ్ లియర్'లా నువ్వు రోడ్డు మిద పడిపోతే, నువ్వు అశ్రద్ధ చేసిన ఉష, ఆమె భర్త నిన్ను చేరదీశారు ఆ వార్ధక్యంలో, రోగాలతో నువ్వు బాధపడుతున్నప్పుడు, నీ కూతరు ఉషే నీకు తోడు నీడగా నిలిచి, నీ జీవన సంధ్య ప్రశాంతంగా ముగిసేటట్లు చేసింది అప్పుడు, నువ్వు మరణిస్తూ ఉషతో అన్నావ్- "అమ్మా! జన్మ జన్మలకీ నువ్వే నా కూతురుగా పుట్టాలి నీ ప్రేమ, సహనం, ఆదరణ వర్షింప చేయాలి- నీ చల్లని ఒడిలో యిలాగే నేను ప్రతీసారి మరణించాలి' అని నాన్నా! ఆ ఉషను నేనే- నన్ను నీ లోకంలోకి ఆహ్వానిస్తావా- లేదా నన్ను అమ్మ గర్భంలోనే అంతం చేస్తావా? ఆలోచించు నాన్నా! సమాదానం చెప్పు"

మూర్తి, ఉలిక్కిపడి నిద్ర నుండి లేచాడు- బార్యను లేపాడు- "సీతా! నేను మనస్సు మార్చుకొన్నాను నాకు జ్ఞానోదయం అయింది- నీకు అబార్షన్ చేయించను ఉషోదయానికి స్వాగతం చెబుతాను" అన్నాడు సీత, ప్రేమగా చూస్తూ తన పూర్తి యిష్టాన్ని తెలియబరిచింది చీకట్లు చెదిరాయి- వెన్నెల కురిసింది

-రాళ్ళబండి నరసింహారావు,
గద్వాల




## హర్షనీయం కాదు

ఆడపిల్ల అయితే గర్భస్రావం చేయించుకోవాలనుకుంటున్న స్త్రీలు పిల్లలని కని వారికో చక్కని భవిష్యత్తు నివ్వటానికి ప్రయత్నిస్తారు ఇటువంటి వాళ్ళకి "పుట్టబోయేది ఆడా? మగా? అనే ప్రశ్నే రాదు

ఆడపిల్ల అయితే ఖర్చు ఎక్కువ అనుకునే తల్లిదండ్రులు ఒక విషయం ఆలోచించాలి కట్నం తప్ప దాదాపు మిగిలిన విషయాలలో ఖర్చులన్నీ ఒకటే మరో ఇరవై సంవత్సరాల తరువాత కట్నం అనే సమస్య ఉండకపోతే అప్పుడేం చేస్తారు కొడుకుని? మగవాడు 'మైనస్' అంటూ కొడుకుని తూలనాడతారా?

ఆర్థికంగానే కాదు స్త్రీకి రక్షణ లేదు- ఆడవారికి కష్టాలు ఎక్కువ అందుకే ఆడపిల్లలు వద్దంటారా? అసలీ ప్రపంచంలో ఎవరికి రక్షణ ఉంది? అసలు ఇంక జనాభాని పెంచవద్దు అని




కాని వాళ్ళని గర్భస్రావం చేసుకోమని బలవంతం చేసే పురుషులు ముందుగా వాళ్ళు పిల్లలని కనాలని ఎందుకనుకుంటున్నారోననే విషయమై ఓ స్పష్టమైన అవగాహనకి రావాలి పిల్లలు తమ అనురాగానికి చిహ్నంగా భావిస్తున్నారా? "తమ స్త్రీ పురుషత్వాలని అందరికీ తెలియ చెయ్యాలనే తపనా? వ్యాపారం కోసమా? కనాలి కాబట్టి కనటమా?"



భార్యాభర్తలు పిల్లలు తమ అనుబంధానికి చిహ్నం అనుకునేవారైతే తమ ఆర్థిక స్థితి గతులననుసరించి ఒకరిద్దరి అనుకుంటున్నామా. పిల్లలకి ధైర్యం, ఆప్యాయతనిచ్చి పెంచండి అబ్బాయి అయినా అమ్మాయి అయినా తేడా ఉండదు

"ఈ కారణాలేం కాకుండా తల్లిదండ్రులకి ఆడపిల్లలంటేనే ఇష్టపడకపోవటం వారి మనస్తత్వం అయితే అటువంటి వారు "మొగ్గగానే గొంతు నులిపేము". అనే సెంటిమెంట్‌కి ఆడపిల్లలని కనవద్దు. కని అసహ్యించుకునే కంటే కనకపోవటం ఉత్తమం భర్తకి ఆడపిల్లంటే ఇష్టం లేదని స్త్రీలు అయిష్టంగా గర్భస్రావం చేసుకోవలసిన అవసరం లేదు

ఇప్పుడిప్పుడే స్త్రీ పురుషునితో సమానంగా జీవించటానికి ప్రయత్నిస్తుంది ఇటువంటి సమయంలో ఇలా స్త్రీ జాతినే భూమి మీదకి తీసుకు రాకూడదనే కొందరి ఆలోచన హర్షనీయం కాదు.

-తుప్పిలి పద్మ, హైదరాబాద్.

# "అమ్మో! మేము రాము!"

ఆమె పేరు భారతి ఐదుమాసాల గర్భిణి మాతృత్వం చవిచూడబోతున్న ఆనందం ఆమెలో కనిపించుటలేదు కారణం అల్ట్రాసౌండ్, యామ్నియో సెంటిసిస్ ద్వారా సెక్స్ డిటర్మినేషన్‌చేసి డాక్టర్లు చెప్పిన మాటలు ఆమె గర్భంలో పెరుగు తున్నది యూనిజవ్యులార్ ట్విన్స్‌ని (జోడు పిండాలు), సెక్స్ ఫిమేల్ (ఆడ) అని చెప్పారు భారతి శ్రీవారు నరేంద్ర, గెజిటెడ్ ర్యాంక్‌లో వున్న ఆఫీసరు ఈ వార్తతో పైకి ఆనందంగా కన్పిస్తున్నా, లోలోపల మాత్రం మారుతున్న ఈ సమాజంలో యిద్దరు ఆడపిల్లల్ని పెంచి, పెద్దచేసి బాధ్యతలు తీర్చుకోవడంలో గల బయం మాత్రం అతనిని కృంగదీస్తోంది పరుగెత్తే కాలంతో పాటు బారతికి ఏడవమాసం మొదలయింది ఒకరోజు ఆమెకి ఫీటల్ మూవ్‌మెంట్స్ (పిండం కదలికలు) తెలియకుండా పోయినవి వెంటనే బారతి నరేంద్రలు క్లినిక్‌కి వెళ్లారు అది అనంత్ పాలి క్లినిక్ అబ్‌స్ట్రిక్స్ విభాగంలో డాక్టర్ బాలాజి డాక్టర్ హేమ పనిచేస్తున్నారు వారు భారతిని పరీక్షచేసి, ఆమె గర్భంలో పెరుగుతున్న శిశువులు సజీవంగానే వున్నాయని కాని వాటిస్థితి మాత్రం మారకుండా అలానే వున్నాయని నిర్ధారించారు వారు చేయబోయే ప్రయోగానికి బారతిని ఎంపిక చేసుకుని, ఆ ప్రయోగం గురించి భారతి నరేంద్రలకు వివరించి వారి వద్దనుంచి అనుమతి తీసికున్నారు ఆ ప్రయోగం గర్భిణీ స్త్రీని ట్రాన్స్‌లోకి పంపించి, తల్లికి గర్భంలో పెరుగుతున్న శిశువులకి మధ్య జరిగే సంబాషణలని రికార్డ్ చెయ్యడమే తల్లి వోకల్‌కార్డ్స్ వద్ద 5 మిమీ పరిమాణంలో కల మైక్రో పోనుని అమరుస్తారు దీనిద్వారా తల్లి మాటలు రికార్డ్ అవుతాయి శిశు హృదయ స్పందనని పీటోస్కోపు ద్వారా ఒక సౌండ్ ఎనలయిజర్‌కి కనెక్ట్ చేస్తారు ఈ సౌండ్ ఎనలైజర్ హృదయస్పందనని మాటలుగా మారుస్తుంది. ఈ విధంగా తల్లీ, శిశువుల సంభాషణని రికార్డ్ చేస్తారు.

అనుకొన్న విధంగా ప్రయోగం మొదలయింది. ప్రయోగాన్ని యింతకు ముందు నిర్వహించి కృత్యకృత్యులైన డాక్టర్ ముదలియార్ గారు పర్యవేక్షిస్తున్నారు. దాదాపు 10 నిమిషాల పైగా ప్రయోగం సాగిన తరువాత ఒక్కసారిగా భారతి సోనో మీరిద్దరు రాకుండా వుండటానికి వీల్లేదు" అంటూ ట్రాన్స్‌లో నుంచి మామూలు స్థితిలోకి వచ్చింది ఇక డాక్టర్లు మైక్రో పోను, సౌండ్ ఎనలయిజర్‌లో రికార్డ్ అయిన మాటలని వింటున్నారు

'తల్లీ శిశువుల సంబాషణ

ఏమిటీ పిల్లలూ ఎందుకలా మౌనంగా వున్నారు అంది తల్లి

"మేమిద్దరం యిప్పటివరకు ఎంతో సఖ్యంగా పెరిగామమ్మా యిక మీ లోకంలోకి అడుగుపెట్టే సమయం ఆసన్నమవుతుంది కదా మా యిద్దరిలో ఒక్కళ్ళమే రావాలని నిర్ణయించుకున్నాము ఎవరు రావాలా అన్నదే సమస్యయ్యింది నీవంటే నీవని ఘర్షణపడి యిలా మౌనంగా వుండిపోయాం' అంది ఒక శిశువు

"మా లోకంలోనికి రావడానికి ఎందుకలా వెనకాడుతున్నారు కారణాలేమైనా వున్నాయా? వుంటే చెప్పండి అంది తల్లి

వెంటనే ముందుగా చెప్పడానికీ నేనంటే నేనని పోటీ పడ్డాయి. రెండు శిశువులు యింతలో తల్లి కల్పించుకుని 'ఏమిటి, మా మధ్యలానే మీ మధ్య కూడా క్రమశిక్షణ లేదా? ఒక్కొక్కరే చెప్పండి" అంది

యి ఒక శిశువు తన కారణం చెప్పడం ప్రారంభించింది



'నేను పూర్వ జన్మలో మంచి విద్యావంతురాలిని చదువులో నాతో సమానమైన యువకునితో పరిచయమయింది. మా పరిచయం ప్రేమగా మ్మారి, పరిణయం వరకు వచ్చింది ఒక్క కులం తప్ప, అయనతో పెండ్లికి నాకు అన్ని అర్హతలు వున్నాయి. అందుకే మా యిద్దరి ప్రేమకు కులమతాల, కట్టుబాట్లతో అడ్డుగోడ కట్టారు పెద్దలు మా ప్రేమ పవిత్రమయినదని, శాశ్వతమని, కులమతాలకు తావివ్వత్దని, యిరువైపుల పెద్దలకు విన్నవించి మా పెండ్లి జరుపమని ప్రాదేయపడ్డాము. కాని కులం, మతం, సాంప్రదాయం, కట్టుబాట్లు అనబడే సాలీడు గూళ్లలో చిక్కుకున్న పురుగులలాంటివారు మా పెద్దలు అయన తండ్రి సంఘంలో మంచి పరపతి వున్న పెద్దమనిషి, మా పెండ్లి జరిగితే ఎక్కడ ఆయన గౌరవానికి భంగం కలుగుతుందోనని భయపడి, నన్ను హత్య చేయించాడు నా శవాన్ని రైలుక్రింద పడేసి హత్యని ఆత్మహత్యగా




నిరూపించారు అందుకే అసహ్యకరమైన మీ సమాజంలోకి అడుగు పెట్టాలంటే బయపడు తున్నాను 'అంది

తరువాత రెండవ శిశువు తన కారణం చెప్పడం ప్రారంబించింది

నేను పూర్వ జన్మలో మగజాతిలోనే పుట్టాను. నాది బాల్యం నుండి కూడా ఎదుటి వారిని టీజ్ చేసి బాదించే స్వబావం అందునా ఆడపిల్లల్ని అంటే మరీ ఎక్కువగా ఏడిపించేవాడిని కాలేజిలో చేరిన తరువాత టీజ్ చెయ్యడం ఎక్కువయి నేను మా స్నేహితులం సహ విద్యార్థినులను గొడవచేసి బాగా ఏడ్పించేవాళ్లం

నాకు అప్పట్లో ఒక ప్రాణ స్నేహితుడుండేవాడు వాడికి ముగ్గురు చెల్లెళ్లు తండ్రి వృత్తి చాలీచాలని జీతంతో బతుకునావను తోసుకుపోయే గుమస్తాగిరి. ఆడపిల్లల పెళ్ళిళ్లు చేయలేని తండ్రిగా మిగలలేక వాడి నాన్నగారు ఆత్మహత్య చేసుకున్నారు నాకు వాడంటే మిక్కిలి ప్రేమ కనుక, నా గుండెంతా జాలితో నిండింది నేను వాడిపెద్ద చెల్లెల్ని వివాహమాడాను అదే నేను చేసిన తప్పు పెళ్ళైన మరురోజునుంచే కట్నం తీసుకు రాలేదని కోడల్ని వేధించటం మొదలెట్టారు అమ్మా నాన్న – ఆమె భాదలను చూడలేక, పెద్దవారికి ఎదురు చెప్పలేక మీలోకంలోనుంచి వచ్చేశాను అందుకే మీ సమాజంలోకి రావాలన్నా, అందునా ఆడపిల్లగా రావాలంటే భయపడి రానంటున్నాను" అంది

"మేము ఎంతో జాగ్రత్తగా, ఏలోటు రాకుండా పెంచుతామమ్మా అలా అలగకుండా రండమ్మా" అంది తల్లి

లేదమ్మా, మేము మీ సమాజంలోకి రానేరాము అని తమ చేతులతో ప్లాసెంటానుండి ఆహార పదార్థాలను, ఆక్సిజెన్‌ను తీసికొచ్చే అంబెలికల్‌కార్డ్‌ని గట్టిగా నలపడం ప్రారంభించాయి చివరిగా క్షమించు అమ్మా మీ లోకంలో స్త్రీగా పుట్టడంకంటే అడివిలో మానై పుట్టడం మంచిదని అంటారుగా అందుకే వెళ్లిపోతున్నాము అన్నాయి ఆ రెండు శిశువులు

వెంటనే డాక్టరు హేమ హడావుడిగా బారతిని పరీక్ష చేసింది ఈసారి శిశు హృదయస్పందన వినిపించడం లేదు అన్ని పరీక్షలు పూర్తిచేసి యింట్రాయుటిరైన్ డెత్ అని నిర్ధారించారు డాక్టర్స్‌కి వారి ప్రయోగం ఫలించినందుకు ఆనందంగా వున్నా, వారి మనసులు మాత్రం నేటి సమాజంలో సమస్యా భరితమైన స్త్రీజాతి గురించిన ఆలోచనలతో నిండి వున్నాయి.

విషయం అంతా తెలుసుకున్న బారతి, నరేంద్ర నిశ్చేష్టులయ్యారు

—నెల్లూరి సత్యనారాయణ,
గుంటూరు. □

## వ్యక్తిగతం



న్యాయమూర్తి రఘునందన్ స్వరూప్ పాఠక్ భారత ప్రధానన్యాయమూర్తిగా నియమింపబడ్డారు ఈ ఏడాది డిసెంబరు 21న పదవీ విరమణ చేస్తున్న ప్రధానన్యాయమూర్తి పి ఎన్ బగవతి నుంచి ఆయన పదవీ బాధ్యతలని స్వీకరిస్తారు మృదుస్వభావి అయిన శ్రీ పాఠక్ 1924 నవంబరు 4న జన్మించారు అలహాబాద్‌లోని సెయింట్ జోసెఫ్ హైస్కూలు, ఎవింగ్ క్రిస్టియన్ కాలేజీలలో చదువుకున్నారు 1948 నవంబరు 8 నుంచి అలహాబాదు హైకోర్టులో న్యాయవాద వృత్తిని ప్రారంభించారు రాజ్యాంగ చట్టంలో నిపుణులైన ఈయన ఆదాయపు పన్ను, అమ్మకపు పన్ను, పౌర చట్టం కంపెనీల చట్టం, పారిశ్రామిక వివాదాలకి సంబంధించిన కేసులని నిర్వహించారు □



ప్రపంచ క్రికెట్ చరిత్రలో ఎన్నో రికార్డులు సృష్టించిన ప్రఖ్యాత క్రికెట్ క్రీడాకారుడు సునీల్ గవాస్కర్ ఇప్పుడు మరో సరికొత్త రికార్డు సృష్టించాడు. ఇటీవల జరిగిన ఆంధ్ర విశ్వవిద్యాలయం 59వ స్నాతకోత్సవంలో ఆయనకి క్రీడాప్రపూర్ణ గౌరవ డాక్టరేట్ ఇవ్వబడింది. ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి క్రీడా ప్రపూర్ణ గౌరవ డాక్టరేట్‌ని అందుకున్న మొట్టమొదటి క్రీడాకారుడిగా గవాస్కర్ మరో సరికొత్త రికార్డు సృష్టించాడు ... □



ప్రతిష్టాత్మకమైన రామేశ్వర్‌దాస్ బిర్లా స్మారక్ కోశ్ అవార్డు ఈ ఏడాది డా. బి. కె బచావత్‌కి లభించింది. దేశంలో వైద్యరంగంలో ఆయన చేసిన అసామాన్య పరిశోధనకి గుర్తింపుగా ఆయనని ఈ అవార్డుకి ఎంపిక చేశారు. పరిశోధనారంగంలో 33 సంవత్సరాలు కృషిచేసిన ఈయను ఇంతవరకు ఎన్నో అవార్డులు అందుకున్నారు. 1962లో ఆయనకి శాంతి స్వరూప్ భట్నాగర్ అవార్డు, 1974లో అమృత్ మోడీ రిసెర్చ్ అవార్డు లభించాయి .. □

# వారఫలం

## 12-12-1986 శుక్రవారం మొదలు 18-12-1986 గురువారం వరకు

★ **మేషం** వ్యవహారం చాలా దినాలుగా వేధించేది ఒకటి ఉన్నది అలాంటి దానిని సామరస్యంగా సవరించుకొనటం శ్రేష్ఠం అయినవారితో శుభ కార్యాల మంతనాలు కొందరు జరుపుతారు ఫలితం అనుకూలం అని నిర్ణయింప వీలులేదు స్త్రీలకు రాజకీయంగా మేలున్నది జాగ్రత్తపడి సవరించుకొని మేలు పొందండి

★ **వృషభం** · నాకు యిది రాలేదు, అది కైవశం కాలేదు, యింకా కలిసి రాలేదని ఆవేదన పడకండి, కొంత శాంతంగా రోజులు గడిపితే అన్నీ అనుకూలమవుతాయి. సాహితీ రంగాన మేలు జరిగే మార్గమున్నది ఒక వేళ ధనం అందవచ్చు విపరీతమైన సంఘటన ఒకానొకటి జరుగనున్నది. అది లాభించేదా? కాదా? అన్న విషయం మీరే గ్రహిస్తారు స్త్రీలకు వృత్తియందు మేలే

★ **మిధునం** : రక రకాల వ్యవహారాలలో మీకు జోక్యం ఉంటుంది. ఒకటి రెండు మార్గాల ధనాదాయానికి అవకాశమున్నది. అంత కృషి చేయనవసరము లేదని గాదు అర్థం విద్యావేత్తలకు అనువైన వారం రచయితలకు చక్కని అవకాశాలుంటాయి కథకులకు సముచితమైన అవకాశాలుంటాయి స్త్రీలకు సుఖ శాంతులు, ఆనందం, ధనాదాయం, ఉద్యోగ రీత్యా హాయి.

★ **కర్కాటకం** . ఒకే విషయం అనుకూలంగా లేదని ఊరకే ఆలోచించటం తగదు వారాంతంలో నిర్మాణ కార్యక్రమానికి దిగుతారు, సానుకూలమవుతుంది. విలాస వస్తు సేకరణకు అనుకూలం వ్యాపారాన అంది పుచ్చుకొన్నట్లు మేలు చేకూరుతుంది. స్త్రీలకు: వస్తు వాహన సేకరణకు అనుకూల వారం.

★ **సింహం** : విశ్వాసంతో చదువండి అంతా మీ అభీష్టానికి తగినట్లే వాస్తవం, జ్యోతిష శాస్త్ర రీత్యా చెప్పబడి ఉంటుంది 'అర్ధాష్టమ శని' అనర్థదాయకుడు గోచార రీత్యా కొందరకు ఆరోగ్యం చెడవచ్చు. జాగ్రత్త! స్త్రీలకు: ఆహార విహారాదులందు యిబ్బంది.

★ **కన్య** : మేలు కోరిన వారు హటాత్తుగా యింటికి వస్తారు. ఒక వేళ విదేశీ పర్యటనలో ఉన్న బంధువులూ రావచ్చు. అధిక వ్యయానికి మీరు గురికాగలరు అప్రయత్నంగా కొందరకు ధనం రావచ్చు. స్త్రీలకు . కళా రంగాన, ఆట పాటల్లో సదవకాశాలు, స్వల్పాదాయం

★ **తుల** : పది మందిలో పేరుప్రతిష్టలు రాగలవు రచనా విధానమునకు అలవాటు పడిన వారైనా, గ్రంథకర్తలైనా, కళా రంగానుభవం గల వారైనా, వేషాలు వేసే వారైనా, గాయకులైనా మీకు చక్కని అవకాశాలు లభిస్తాయి స్త్రీలకు ఉత్తేజకరమైన దినాలు, సభా గౌరవం

★ **వృశ్చికం** : దిన దినాభివృద్ధి ఉన్నా, యింకా అన్ని విధాలా అనుకూలమని చెప్ప వీలులేదు ఏదో కొరత కనిపిస్తూనే ఉంటుంది బెంగ పడరాదు త్వరలో అధికమైన మేలు జరిగే మార్గమున్నది ప్రజాకర్షణకు తగిన సమయం పత్రికా వ్యవహారాలలో ముందడుగు వేస్తారు స్త్రీలకు ఆదాయాన్ని మించిన వ్యయం, చిరాకు

★ **ధనుస్సు** · ముఖ్యులను కలసికొనుట జరుగుతుంది దనవంతుల ఆశ్రయం చిక్కుతుంది రాజకీయంగా కొన్ని పనులు నెరవేరుతాయి. అయినా లాభం? వ్యయస్థానస్థితుడు 'శని' ఏదో ఒక మార్గాన బాధిస్తూనే ఉంటాడు అధిక వ్యయం మరీ వయసు మీరిన వారి విషయంలో చెప్పనక్కరలేని యిబ్బందులుంటాయి స్త్రీలకు వృత్తియందు రాణింపు ఉన్నా ఏదో లోపం వెన్నాడుతుంది

★ **మకరం** : సుప్రసిద్ధ వ్యక్తులను కలసికొంటారు పత్రికా సంస్థలందు ఉద్యోగించువారికి, రచయితలకు అనువైన వారం, ధనాదాయమున్నది సుఖ శాంతులు, శుభ కార్యాలోచనలకు లోపం రాదు వ్యాపారం బాగా సాగిపోవుటకు ఆక్షేపణ లేదు వ్యవహారం మీకు అనుకూలం 'గురు శనుల' ఆశీస్సులున్నాయి స్త్రీలకు వారాంతంలో ఆదాయం

★ **కుంభం** : చాల మందికి చిన్నవో, పెద్దవో ప్రయాణాలు చెప్పుటకు అగత్యమున్నది చాల వరకు తగ్గించటం ఉచితమైన కార్యం. ఒకానొక వృత్తి నిర్వహణలో యిబ్బంది రావచ్చు, గమనించాలి విద్యావేత్తల వలన జరుగవలసిన పనులు చర చరా జరిగిపోతవి స్త్రీలకు గతంలో చెడిన వ్యవహారాలు సానుకూలమవుతాయి.

★ **మీనం** : ఉత్తమ ఫలదాయక వారం, అయినా రాశి యందు స్థితుడైన 'రాహువు' కొంత గందర గోళం చేస్తాడు అనుకున్న పనులు నెరవేరకపోవటం, సమయానికి డబ్బు అనుకొన్న విధంగా అందకపోవటం గమనిస్తారు. ఏమయినా వారం సాఫీగా ఆనందదాయకంగా గడచిపోతుంది స్త్రీలకు : సాహితీ రంగాన, పత్రికల రచనా విధానాన ద్రవ్య లబ్ధి

-విద్వాన్ కోటసత్యరంగయ్యశాస్త్రి

# భారతి

సాహిత్యాభిమానులకి ★ చక్కటి అవకాశం!

## చందాదారుగా చేరండి!

## ఆదా చేయండి రు 11 దాకా!

ఏజంటు ద్వారా బారతి సంవత్సరం చందా రు 48

పోస్టు ద్వారా అయితే బారతి సంవత్సరం చందా రు 51

కాని మీరు రు 40 ముందుగా ఒకేసారి చెల్లిస్తే మీకు ఒక సంవత్సరం పాటు బారతి అందుతుంది!

★ అంటే రు 11 దాకా ఆదా చేసుకో వచ్చునన్న మాట!

రు 40 చందా మొత్తాన్ని ఆంధ్రపత్రిక (గాందినగర్ విజయవాడ)కి మని ఆర్డరు ద్వారాగాని డిమాండు డ్రాఫ్టు ద్వారాగాని పంప ప్రార్థన ఏజెంటుకి గాని ఇతరులకి గాని చెల్లించ వద్దని మనవి

ఈ క్రింది కూపనుని నింపి డిమాండు డ్రాఫ్టుతో గాని మనీ ఆర్డరుతో గాని జతపరచి పంపాలని మనవి

★ మీరు ఉన్నచోట ఏజెంటు ఉంటే ఏజెంటు ద్వారా బారతి సరఫరా చెయ్యబడు తుంది

★ ఏజంటు లేకపోతే బారతి మీకు పోస్టులో అందుతుంది!

★ చందా మొత్తాన్ని ఇతరులకి ఇవ్వరాదు! నేరుగా ఆంధ్రపత్రికకే చెల్లించాలి!




- - - - - - - - - - - - - - - - ✂ - - - - - - - - - - - - - - - -

నేను బారతి మాస పత్రికకు చందాదారునిగా చేరదలుచు కున్నాను చందా పైకము రు 40 డి డి / ఎం ఒ ద్వారా పంపుతున్నాను

పేరు ______________________________

చిరునామా ______________________________

______________________________

చందాదారుని సంతకం

# బరువు...

## పాలక్కూర సీతాలత

వాయునందనరావు "గొంతులో స్థిరమైన నిర్ణయం ప్రతిధ్వనించింది

తమ్ముడి మాటలకు ఉలిక్కిపడ్డాడు యయాతి

తమ్ముడూ అన్నాడు కొంచెం గాభరాగా

అవును అన్నయ్యా . నాలో ఈ నిర్ణయం ఈ రోజు ఉదయం కల్గింది నా పరీక్షాఫలితాలు పేపర్లో చూసుకున్నప్పుడు ఫస్టు క్లాసులో వుంది నా నంబరు నాకంటే తక్కువ క్లాసులో ప్యాసయిన వాళ్ళు యం కాం చదువుతామనీ, సి ఏ చేస్తామనీ నిర్ణయాలు తీసుకుంటున్నారు అలాంటప్పుడు నేను కేవలం డిగ్రీతో చదువు మానెయ్యడం ఏం బాగుంటుంది?

జవాబు చెప్పలేక పోయాడు యయాతి

ఎంతలో ఎంతగా మారిపోయాడు తమ్ముడు!

నిన్నటి దాకా వాడు చెప్పిన కబుర్లకీ, ఈ మాటలకు ఎంత తేడా

నాకు తోడుగా వుంటాననీ ఉద్యోగం చేస్తూ సహాయపడతాననీ అన్నావుకదా

నిర్లక్ష్యంగా పెదవి విరిచేడు వాయునందనరావు

ఇక ముందు నేను చదవనని చెప్తే నా స్నేహితులందరూ ఎలా నవ్వారో నీకు ఏం చెప్పను? నేను నా తెలివి, తేటలు అన్నీ వృధా చేసుకుంటున్నాననీ, ఇంకా పై చదువులు చదివితే తప్పకుండా ఏ ఆఫీసరు ఉద్యోగమో దొరుకుతుందనీ నన్ను ప్రోత్సహిస్తున్నారు నాకూ అలాగే అన్పిస్తోంది అందుకు నువ్వు నన్ను ఆదుకోవాలి కాదనకు జీవితంలో లభించిన దానితో తృప్తి పడి ఊరుకోవడం కంటే చేతకానితనం మరొకటి వుండదు అన్నాడు

ఆశ్చర్యంగా తమ్ముడి ముఖంలోకి చూసేడు యయాతి

ఎంత చిత్రంగా మాట్లాడు తున్నాడు!

కానీ అందుకు అవకాశం...'

అవకాశం అన్నది దానంతట ఆది దొరకదు మనమే కల్పించు కోవాలి ఆఖరిక్షణంలో చెప్పి డబ్బు కావాలి అని నీ పీకల మీద కూర్చోదల్చుకో లేదు. అందుకే నాలో ఈ నిర్ణయం కలిగిన వెంటనే చెప్తున్నాను డబ్బు గురించి ప్రయత్నం చేసుకుందుకు నీకు చాలా సమయం వుంది ఈలోగా యం కాం లో చేరేందుకు ఫారాలు తీసుకు వస్తాను ...

తను కట్టుకున్న ఆశా సౌదాలు కూలిపోవడమే కాక ఆకూలడం ఏదో తన నెత్తిమీదే జరిగినట్లు విలవిల లాడి పోయేడు యయాతి

ఒరేయ్ వాయూ. అంటూ అన్నగారు పిలుస్తున్నా కూడా తనకు వినపడనట్లుగా అక్కడ్నుంచి వేగంగా కదిలి వెళ్ళిపోయాడు వాయునందనరావు

యయాతి చిన్నగా నిట్టూర్చాడు

హుః తన నెత్తి మీద వున్న బరువు ఏదో తక్కువ అయినట్లుగా ఇప్పుడు మరికొంత బరువు

తను మొయ్యగలడా? లేక ఆ బరువు తనను అణగదొక్కుతుందా?,

కూర్చున్న కుర్చీలోనే వెనక్కు జార్లపడి కళ్ళు మూసుకున్నాడు

అతనికళ్ళ ముందు రీలగా గతం

* * * * * * *

మహౌద్వల్యరావు గారు పని చేస్తున్నది గుమాస్తాగా అయినా అయన మీదవున్న బాధ్యతలు తక్కువేం కాదు

ముసలితల్లి, రోగిష్టి భార్య, ఇద్దరు కొడుకులు, ఆతర్వాత నలుగురు అమ్మాయిలు–ఈ బరువు చాలదన్నట్లు ఒక విధవ చెల్లెలు.

పెద్దకొడుకు యయాతి బి. కాం చదువుతున్నాడు రెండో వాడు వాయునందనరావు ఇంటర్లో వున్నాడు. మిగతా - ఆడపిల్లలు హైస్కూలు ఎలిమెంటరీ స్కూలు లోనూ చదువుతున్నారు భార్యకు ఈ మధ్య జబ్బు చేస్తే వడ్డీ మీద అప్పు తెచ్చారు తల్లికి కళ్ళు కన్పించక పోవడంతో ఆమెకు ఆపరేషన్ చేయించారు విధవ చెల్లెలు తాలూకు బాధ్యత జీవితాంతం భరించవల్సిందే

ఇలాంటి పరిస్థితుల్లో ఆయన హఠాత్తుగా ఒక రోడ్డు ప్రమాదంలో కన్ను మూశారు

ఆడుతూ పాడుతూ కాలేజీ జీవితం గడుపు తున్న యయాతిని బాధ్యతల తాలూకు బంధాలు గట్టిగా బిగించాయి చదువుతున్న చదువు మధ్యలో ఆపవల్సి వచ్చింది

ఆ ఆఫీసు వాళ్ళే దయదల్చి ఉద్యోగం ఇచ్చేరు యయాతికి

అన్ని బాధ్యతల్నీ చిరునవ్వుతో స్వీకరించేడు ఒక్కసారి కూడా బాధపడలేదు పెదవుల మీద మాయని చిరునవ్వుతో, ఇంట్లో ప్రతి ఒక్కరి అవసరాలు తీరుస్తూ కాలం గడపసాగేడు

సంవత్సరాలు గడిచి పోయాయి

తమ్ముడిని కాలేజీలో బి. కాం. లో చేర్పించాడు.

వయసు వచ్చిందని పెళ్ళి చేసుకోమని కోరింది తల్లి అడ్డంగా తల ఊపేడు

వద్దమ్మా . నా జీవిత లక్ష్యం వేరు పెళ్ళి చేసుకుంటే ఆలక్ష్యం సాధించలేను

అందుకే ఆ విషయంలో నన్ను బలవంతం చెయ్యకు అన్నాడు

ఆదేమిట్రా మా అందరికోసం నువ్వు నీ జీవితం త్యాగం చేసుకుంటావా?' అంది తల్లి బాధగా

ఆ బాధని గమనించనట్లుగా జవాబు చెప్పాడు యయాతి,

అంత పెద్ద మాట వాడకమ్మా, ఇందులో ఏదో, త్యాగం వుందని నేను అనుకోను నాన్నగారు నాకు అప్పు చెప్పిన బాధ్యతలు నిర్వహించ గలిగితే అంతకంటే నాకు సంతోషం వుండదు. నీకు కోడల్ని తెచ్చుకోవాలని వుండవచ్చు కానీ నాకు మాత్రం భార్యను పొందాలని లేదు భార్య అంటూ వస్తే మనిషి స్వార్థంగా ప్రవర్తించే అవకాశం వుంటుంది ఆ పరిస్థితి రాకూడదు.

డిగ్రీ చదువుతున్న వాయునందనరావు అన్నగారి గొప్పతనాన్ని అర్థం చేసుకున్నాడు

అన్నయ్యా నేను చదువు మానేస్తాను నీకు తోడుగా ఏదైనా ఉద్యోగం చేస్తూ బాధ్యతలు పంచుకుంటాను అన్నాడు

కంగారుగా తమ్ముడి వంక చూసేడు యయాతి

వద్దు తమ్ముడూ అంతపని చెయ్యకు . కనీసం డిగ్రీ కూడా చదవకపోతే ఏం మంచి ఉద్యోగం వస్తుంది చెప్పు? నేను ఏదో శ్రమపడి పోతున్నానన్న ఆలోచనలు మానుకుని శ్రద్ధగా చదువు డిగ్రీ పూర్తి చెయ్యి తర్వాత సంగతి ఆలోచిద్దాం .నేను పూర్తి చెయ్యలేక పోయిన డిగ్రీ చదువు కనీసం నువ్వయినా చదవాలి అన్నాడు అందుకు అంగీకరించాడు వాయునందనరావు

వీలు దొరికినప్పుడల్లా అన్నగారికి మానసిక స్థైర్యం కలిగేలా"

'ఇంకెంత అన్నయ్యా ఇంకొక్క ఏడాది నా చదువు పూర్తి కాగానే ఇకనువ్వు అభ్యంతరం పెట్టినా కూడా వినకుండా ఏదో ఒక ఉద్యోగం చూసుకుని నీకు తోడుగా వుంటాను అనేవాడు

ఆ మాటలకు యయాతి పొంగి పోయేవాడు ఎంత మంచి మనసు తన తమ్ముడిది!

'నీలాంటి తమ్ముడు దొరికిన ఏ అన్న అయినా చాలా చాలా అదృష్టవంతుడు

ఇంటి పరిస్థితులు అర్థం చేసుకుని అన్నకు చేదోడు వాదోడుగా వుంటానని అనే తమ్ముళ్ళు ఎందరు వుంటారు గనుక?' అని ఆనందించేవాడు

ఒకసారి మహౌద్వల్యరావు గారి విధవ చెల్లెలుకి బాగా జబ్బు చేసింది అందుకోసం ఎక్కడెక్కడి నుంచో డబ్బు తెచ్చి సుమారు రెండు వేలు ఖర్చు చేశాడు యయాతి

అది చూసి చిరాకు పడ్డాడు వాయునందనరావు.

మన కుటుంబం తాలూకు బాధ్యతలతో సతమతమవుతుంటే ఈ అత్తయ్య బరువు కూడా మన మీదే పడాలా? ఆవిడను-భరించవల్సిన అవసరం మనకు ఏమిటి? ఆవిడను ఎక్కడికయినా పంపేసెయ్యి అన్నాడు

తల అడ్డంగా తిప్పాడు యయాతి,

'తప్పురా , ఆమె పరాయిది కాదు నాన్న గారికి చెల్లెలు. నీకు నీ చెల్లెలుతో ఎలాటి రక్త సంబంధం వుందో నాన్న గారికి ఆమెతో కూడా అంతే ఆమెను చూసేవారు ఎవ్వరూ లేరు ఆమెను మనమే భరించాలి. అప్పుడే నాన్న గారి ఆత్మకు శాంతి ఇలా ఎన్నడూ మాట్లాడకు బాధ్యతల నుంచి తప్పుకోవాలని అనుకోవడం పిరికి వాళ్ళ లక్షణం సుమా!" అంటూ నచ్చ చెప్పాడు యయాతి,

ఆ మాటలతో వాయునందనరావు కళ్ళు వారళ్ళు

విడి పోయాయి. అన్నగారు అతని కళ్ళకు సాక్షాత్తు భగవంతుడిలా గోచరించాడు.

"అన్నయ్యా.... నువ్వు చాలా ఉత్తముడివి. నీకు చేతులెత్తి నమస్కారం చేస్తున్నాను. నీలాంటి సంస్కార వంతులు కోటికి ఒకరు వుంటారు... అన్నాడు.

చిన్నగా నవ్వి ఊరుకున్నాడు యయాతి.

వాయునందనరావు పరీక్షలు దగ్గరకు వస్తున్న కొద్దీ అతను ఎంతో శ్రద్ధగా చదువుతున్నాడు.

అలా చదువుతూనే మధ్య మధ్యలో –

"ఉద్యోగం గురించి ఇప్పటి నుంచీ ప్రయత్నిస్తే మంచిదేమో!" అనేవాడు.

యయాతి తను పనిచేస్తున్న ఆఫీసులోనే పెద్ద ఆఫీసరుని కలిశాడు. శ్రద్ధగా పని చేసే అతనంటే ఆఫీసులో అందరికీ మంచి గౌరవం వుంది ఆ గౌరవం కొద్దీ ఆ ఆఫీసరు వాయునందన రావుకి తమ ఆఫీసులోనే ఉద్యోగం ఇయ్యడానికి అంగీకరించాడు.

"మీ తమ్ముడిని నేను చూశాను. తెలివైన వాడు. చురుకైనవాడు. అతనికి ఉద్యోగం ఇయ్యడానికి నేను అంగీకరించింది నిన్ను చూసి కూడా. నీ వినయ విధేయతలు, కష్టపడి పని చేసే తత్వం నన్ను బాగా ఆకర్షించాయి. నీకష్టం తీర్చడం నా బాధ్యతగా భావించి ఈ సహాయం చేస్తున్నాను...." అన్నాడు ఆ ఆఫీసరు.

ఆనందరితో పొంగి పోయేడు యయాతి.

"చాలా థాంక్స్ సార్" మీ మేలు నేను ఎన్నడూ మరువలేను..." అన్నాడు కృతజ్ఞత ఉట్టి పడుతున్న గొంతుకతో యయాతి.

ఆ కబురు విన్న వాయునందనరావు కూడా పొంగిపోయేడు. "నిజంగా ఆయన మనపాలిట భగవంతుడే..." అన్నాడు.

ఆ మాట అక్షరాల నిజం. ఆతర్వాత వాయు నందనరావు ఆ ఆఫీసరుని కలిసేడు.

"పరీక్షలు రాసి ప్యాసుకా.... డిగ్రీ సర్టిఫికెట్ తెచ్చుకో... ఆ తర్వాత ఉద్యోగం ఇస్తాను.." అన్నాడు ఆయన.

ఒక నమస్కారం చేసి వచ్చేశాడు వాయునందన రావు.

పరీక్షలు పూర్తి కాగానే ఉద్యోగంలో చేరిపోవాలని ఉబలాట పడ్డాడు కానీ యయాతి వారించాడు.

"నీ పరీక్షా ఫలితాలు రానియ్యి... నువ్వు ప్యాసు కావడంలో ఏదో సందేహం వుండి ఇలా అనటం లేదు. ఒకసారి ఉద్యోగంలో అంటూ చేరితే ఇక జీవితం అంతా తీరిక లేకుండా పోతుంది. కనుక ఈ శలవల్లో అయినా కాస్త ఎంజాయ్ చెయ్యి.... పైగా డిగ్రీసర్టిఫికెట్ చేతికి వచ్చాకనే నీకు ఉద్యోగం ఇస్తానని అన్నారు కనుక అంత తొందర లేదు....."

సరే అనక తప్పలేదు వాయునందన రావుకి.

అలాంటి వాడు ... ఈ రోజున... పరీక్షా ఫలితాలు పేపర్లో వచ్చిన ఈరోజున.... తన నిర్ణయం మార్చుకున్నాడు. ఎందుకని?

వాడిలో ఆ మార్పు ఎలా వచ్చింది? కుటుంబ పరిస్థితుల్ని ఎలా మర్చి పోగలిగాడు?

తను ఖచ్చితంగా పై చదువులు చదువుతాననీ అందుకు అవసరం అయిన సొమ్ము సిద్ధం చేసుకోమనీ ఎంతనిక్కచ్చిగా చెప్పాడు!

తన బరువులో భాగం పంచుకుంటానని ఇన్ని కబుర్లు చెప్పిన వాడు ఇలా తన బరువు మరింత పెంచడానికి ఎందుకు సిద్ధపడ్డాడు!

తన తమ్ముడి మంచి తనాన్ని చూసి తను ఎంతో సంబరపడి పోయాడు. తన భుజాల మీంచి కొంత భారం తగ్గుతోందని భావించి తేలిగ్గా ఊపిరి పీల్చుకున్నాడు.

కానీ..... కానీ ...

తన ఆశలు అన్నీ కూలిపోయాయి. తన కలలు అన్నీ కరిగి పోయాయి.

హే భగవాన్.. ఏమిటీ పరీక్ష?

"బాబూ... నీకు టైము అవుతున్నట్టు వుంది.... భోజనం వడ్డించనా?" అంటూ తల్లి వచ్చి పలుకరించడంతో ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చాడు యయాతి

"ఆ... వడ్డించు అమ్మా...." అంటూ లేచాడు.

ఎందుకో సరిగ్గా అన్నం తినలేక పోయాడు. పెరగబోతున్న భారం అతని ఆకల్ని దూరం చేసిందా?

"ఏం బాబూ.. అన్నం సరిగ్గా తినటం లేదు." అంది తల్లి.



వాయునందనరావు నిర్ణయం ఆమెకు ఇంకా తెలియదు. ఆమెకు చెప్పి ఆమె మనశ్శాంతి దూరం చెయ్యదల్చుకోలేదు యయాతి.

అందుకే ఏదో అని మాట తప్పించేశాడు

ఆఫీసుకి వెళ్ళి పోయాడు.

★ ★ ★ ★ ★

అన్నగారితో నిక్కచ్చిగా మాట్లాడిన తర్వాత అక్కడ వుండలేక రోడ్డు మీదకు వచ్చేశాడు వాయునందనరావు ఆ తర్వాత ఎక్కడకు వెళ్ళాలో, ఏం జెయ్యాలో తోచలేదు అందుకే గమ్యం ఎరుగని బాటసారిలా కాళ్ళు తీసుకువెళ్తున్న చోటికి అలా నడుచుకుంటూ వెళ్ళసాగాడు. అతని మెదడు నిండా గజిబిజిగా ఆలోచనలు

ఆ రోజు ఉదయం పరీక్షా ఫలితాలు వస్తాయని తెలిసి పెందరాళే లేచి పోయాడు తను తప్ప కుండా ప్యాసు అవుతానని నమ్మకం వున్నా పేపర్లో నంబరు చూసుకుంటే అదో తృప్తి ఇంట్లో పేపరు తెప్పించరు కనుక రోడ్డు మీదకు వచ్చాడు తియ్యని కలలతో –

తను పరీక్ష ప్యాసుఅవుతాడు మరొక పది రోజుల్లో డిగ్రీ కాగితం చేతికి వస్తుంది. ఆ తర్వాత తను ఉద్యోగం చేస్తాడు

రోడ్డు మీదే అతని క్లాస్ మేట్స్ మరో నలుగురు తగిలారు అందరూ కల్సి సరదాగా కబుర్లు చెప్పుకుంటూ బస్‌స్టాండ్‌కి వెళ్ళేరు అప్పుడే వచ్చాయి ఆనాటి దినపత్రికలు

పేపర్లో నంబరు చూసుకున్నాడు. తను ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు మిగతా అందరిదీ సెకండు క్లాస్

ఆనందంతో కేరింతలు కొట్టారు అందరూ

ఏరా నీ తర్వాతి కార్యక్రమం ఏమిటి?" ఒకడు అడిగేడు

జవాబు చెప్పాడు

'ఛ" అదేమిటిరా .. చదువు కోవల్సిన వయసులో చదువుకోవాలి. అప్పుడే ఉద్యోగం ఏమిటి? పైగా ఫస్టుక్లాసు వచ్చింది కూడా '

'అవున్రా సెకండు క్లాసు వచ్చిన నేను యం. కాం. చెయ్యాలనుకుంటుంటే నువ్వు ఉద్యోగంలో చేరి చదువు మానేస్తావా? నీకు మంచి భవిష్యత్తు వుందిరా అనవసరంగా పాడు చేసుకోకు."

"డిగ్రీ చదువుకి ఈ రోజుల్లో విలువ ఏముందిరా?"

ఈ మాటలన్నీ బాగా పని చేశాయి తన మీద.

"అదికాదురా మా ఇంటి పరిస్థితులు... " చిన్నగా గొణిగేడు

"అలా అనకు మనసుంటే మార్గం వుండక పోదు మీ అన్నయ్యను అడుగు... పై చదువులు చదివితే తప్పకుండా ఆఫీసరు కాగలవు"

తన కళ్ళముందు ఎన్నెన్నో కలలు ... అందమైన రంగురంగుల కలలు.

అందుకే అన్నగారి దగ్గరకెళ్ళి తన నిర్ణయంలోని మార్పు చెప్పాడు

తను పై చదువులు చదివి తీరాలి . ఇది తన తిరుగు లేని నిర్ణయం..

# బరువు

"హలో . ఎటు బయలు దేరావు?" ఎవరో అడిగారు.

ఆ మాటలకు ఈ లోకంలోకి వచ్చాడు.

చుట్టూ చూశాడు.. ఇల్లు విడిచి చాలా దూరం వచ్చేశాడు... అన్నగారి ఆఫీసు వున్న ప్రాంతం అది.

పలకరించిన మిత్రుడికి ఏదో జవాబు చెప్పాడు. అతను వెళ్ళి పోయాడు

అప్పుడే ఒక ఒంటి ఎద్దు బండి అతని వైపు వస్తూ కన్పించింది. కాలిబాట మీద ఎక్కి ఆ బండివైపు చూస్తూ వుండి పోయాడు. సిటీలో ఇలా ఎద్దు బళ్ళు తక్కువగా వెళ్తూ వుంటాయి రోడ్డు మీద. పల్లెటూరి నుంచి ఏదో పనిమీద వస్తాయి కాబోలు.

బండిని పరీక్షగా చూశాడు. ఎద్దు వంక చూశాడు.

ఎద్దు ఎందుకో కన్నీరు కారుస్తోంది. బరువు మొయ్యలేకనా?

బరువు కూడా చాలా ఎక్కువగా వుంది. పాపం .. భారంగా.... మొయ్యలేక... మొయ్యలేక.. నెమ్మదిగా ఈడుస్తోంది.

సరిగ్గా అప్పుడే ఒక ఘోరం జరిగి పోయింది.

ఆ ఎద్దు రోడ్డు మీద కూలబడి పోయింది!

బండివాడు లబో, దిబో అంటూ దిగేడు. నేల కూలిన ఎద్దుని పైకి లేపడానికి ప్రయత్నిస్తున్నాడు కానీ వీలు కావటం లేదు.

"పాపం.. దాని కాలు జారి వుంటుంది.. బండి మీద చాలా బరువు వేశావు".. అన్నాడు వాయునందనరావు కల్పించుకుని

"ఏం సెయ్యను దొరా.. తప్పు అయిపోనాది... కక్కుర్తి పడి పోయినాను".. అన్నాడు వాడు.

"నేను నీకు సహాయపడ గలనా?" అడిగేడు.

"ఈ బస్తీలో ఎవుడూ ఎవడ్ని పట్టించుకోడు. చాలా మంచోడివి లాగున్నావు బాబూ...." అన్నాడు.

తేలిగ్గా నవ్వేశాడు.

ఎద్దును పైకి లేపడంలో ఆబండివాడికి సహాయ పడ్డాడు కానీ లాభం లేక పోయింది.

"బండిలో బరువు తగ్గించాలేమో!" అన్నాడు వాయునందనరావు ఆలోచించి.

"మరో దారి అగుపించదు .." బండివాడు అన్నాడు.

అప్పుడే మరొక రెండు ఎద్దుల బండి వచ్చింది. అది ఖాళీగా వుంది. ఆ బండివాడు మొదటి వాడిని చూసి–

"ఏంది రంగన్నా... ఏట్టైనాది?" అడిగేడు

"ఏం సెప్పను సుబ్బయ్య మావా... ఎద్దు కూలబడి పోనాది."

సుబ్బయ్య బండివంక పరీక్షగా చూశాడు

"ఏంది రంగన్నా... అంత బరువు ఎట్టినావు ఆ ఎద్దు బతకాలనా సావాలనా అంతగా ఆశ పనికి రాదు.. రెండు ఎద్దులు మొయ్యాల్సిన బరువది ఒక్కటి ఎలా మోస్తది?.. దాని కాలు ఇరగి సచ్చి పోతే నీకు, ఈ ఆదారం కూడా వుండదు ... ఇలాగ ఎప్పుడూ సెయ్యబోకు.. " అంటూ మెత్తగా చివాట్లు పెట్టాడు సుబ్బయ్య.

తల వంచుకున్నాడు రంగన్న.

"ఇక ఎన్నడూ అలా సెయ్యను... ఇప్పుడు నన్ను కాపాడు మావా...." దీనంగా అన్నాడు.

"ముందు ఆ బండి ఖాళీ సెయ్యాల. ఆ సామానంతా నా బండిలో ఎట్టు... అప్పుడు బండి తేలిక అయ్యి ఎద్దు లేవగలుగు తుంది. దాన్ని పైకి లేపి కాలు గానీ ఇరిగిందేమో సూడాలి."

తల ఊపాడు.

రంగన్న, సుబ్బయ్య – ఇద్దరూ కల్సి చకచక ఒంటి ఎద్దు బండిని ఖాళీ చేసి ఆ సామాను రెండు ఎడ్ల బండిలో వెయ్యసాగారు.

వాయునందనరావు అక్కడే వుండి ఇదంతా గమనిస్తున్నాడు. ఈ వ్యవహారం ఏదో తేలిపోయే వరకూ అక్కడ నుంచి కదలాలని లేదు అతనికి.

ఒక అరగంటలో సామాను మార్పిడి పూర్తి అయ్యింది.

ఆ ఇద్దరూ కలిసి పడి పోయిన ఎద్దును పైకిలేపారు. సుబ్బయ్య ఆ ఎద్దు కాలు దగ్గర కూర్చుని చిన్నగా మాలిష్ చేశాడు.

"అదురుష్టం .. కాలికి ఏం కాలేదు.. " అన్నాడు.

సామాను నిండివున్న బండి తాలూకు ఎడ్ల వైపు చూశాడు వాయునందనరావు.

ఆ ఎద్దుల ముఖాలు నిర్మలంగా వున్నాయి. ఎలాంటి అలసటా లేదు

అవును .. బరువును సమానంగా పంచుకుంటు న్నాయి కదా!

"చూసేవా.. రంగన్నా. . నీ బండిలో సామానంతా నా బండిలో ఏసినా ఆ ఎడ్లు ఎంత తేలిగ్గా ఉన్నాయో సూడు . మరింత బరువు కూడా మొయ్యడానికి సిద్ధంగా ఉన్నాయి దీని వల్ల ఒక సత్తెం తెలుస్తది... బోలెడు బరువు ఉన్నాదంటే అది ఒక్కడూ మొయ్యనేడు. ఆబరువుకి కింద పడిపోయి సచ్చిపోతాడు. అదే బరువు ఇద్దరు మోస్తా వుంటే ఏ ఒక్కడికీ అంత కష్టం అనిపించదు. సర్లే ... పద " అంటూ బండి ఎక్కి ఎడ్లను అదిలించాడు.

బళ్ళు రెండూ ఒకదాని వెనుక నడవసాగాయి

వాటి వంక రెప్పలు వాల్చడం మరిచి పోయిన వాడిలా చూస్తూ వుండి పోయాడు వాయునందన రావు

ఈ సుబ్బయ్య ఏమీ చదువుకోలేదు అయినా ఎంత చక్కని సత్యం చెప్పాడు.

అనుభవాన్ని మించిన చదువు ఈ ప్రపంచంలో లేదుకాబోలు!

సుబ్బయ్య మాటలు మాటిమాటికీ అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

బరువు . పంపకం... తేలిక..

తన అన్నగారి నెత్తి మీద ఎన్ని బాధ్యతలు

ఆ బాధ్యతలన్నీ మోస్తూ ఇక మొయ్య లేక ఏ ఆరోగ్యమో చెడగొట్టుకుని అన్నగారు ఆ ఒంటి ఎద్దులా కూలిపోతే. ..

ఆ బరువు అంతా తను మొయ్యాలి.

అంతకంటే ఆ బరువు ఏదో ఈక్షణం నుంచే తను

పంచుకుంట అటు అన్నగారికీ సుఖం తనకూ గౌరవం!

అన్నగారి మంచితనం అంతా అతనికి గుర్తువచ్చింది

మొయ్యవల్సిన బాధ్యతలు ఎన్ని వునా కూడా చిరాకుపడకుండా ఎంతో సమర్ధతతో, ఎవ్వర్నీ నొప్పించకుండా ఏ ఒక్కరూ తమ అవసరాలు తీరలేదని బాధపడే అవకాశం కల్గించకుండా ప్రవర్తించే ఆతీరు–

నిజంగా అతను భగవత్స్వరూపుడే. అలాంటి వాడికి అంతకష్టం కలిగించాడుతను!

ఎంత పరుషంగా మాట్లాడేడు!

ఎంత మూర్ఖంగా ప్రవర్తించేడు!!

తన చదువు తనకు వివేకం నేర్పవల్సింది పోయి తనని మూర్ఖుడిని చేసింది

అన్నగారు తన మనసు ఎంతలా కష్ట పెట్టుకున్నాడో కదా ఏమనిషి అయినా తన తాహతు బట్టి ఆశలు పెంచుకోవాలి కానీ అందరాని ఎత్తులకు ఎగరాలని కలలు కనడం ఏం సబబు? ఆకాశం దించేస్తాను నెలవంకను తుంచేస్తాను అని అన్నంత సులభం కాదు ఆపన్లు చెయ్యడం వివేకంతో పరిస్థితుల్ని గుర్తు పెట్టుకుని ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి కానీ ఆధారం లేకుండా గాలిలో ఎగిరితే క్రింద పడక తప్పదు తన యం కాం చదువు అంటే మాటలా? రెండేళ్లు చదవాలి వేలు ఖర్చు చెయాలి

నో అలా కాకూడదు

కలలోంచి తను వాస్తవంలోకి రావాలి.

ఊహలు మరిచి నిజం తెలుసుకోవాలి

ఇక్కడ్నుంచి తిన్నగా అన్నయ్య ఆఫీసుకి వెళ్ళి అతన్ని కలియాలి.

తన నిర్ణయం అతని మనసులో కల్గించిన బాధని వెంటనే దూరం చెయ్యాలి.

'అన్నయ్యా.... నన్ను క్షమించు... ఉదయం ఏదేదో నోటికి వచ్చినట్లు వాగాను. నీ మనసుకి కష్టం కల్గించాను. నేను వెంటనే ఉద్యోగంలో చేరి నీ బాధ్యతలో పాలు పంచుకుంటాను. నేను నీకు మరింత భారం కల్గించదల్చుకోలేదు అని చెప్పాలి.

వెంటనే గబగబా అడుగులు వేస్తూ అన్నగారి, ఆఫీసుకి చేరాడు

అక్కడ యయాతి సీట్లో కన్పించలేదు. ఆశ్చర్య పోయాడు

'ఏమండీ . మాఅన్నయ్య ఎక్కడకు వెళ్ళాడు?" అడిగేడు పక్కసీటు ఆయన్ని.

"అతను ఈరోజు ఆఫీసుకి రాలేదు కారణం తెలియక ఆలోచించు కుంటున్నాం

కుంభవృష్టి కురిసిన రోజున కూడా రాకుండా మానలేదు మీ అన్నయ్య అవునూ. అతను ఇంట్లోలేడా?'

"నేను ఉదయమే ఇంట్లోంచి వచ్చేశాను ఈ పాటికి అన్నయ్య ఇక్కడకు రావాలికదా అని అనుకుని ఇలా వచ్చాను. అన్నయ్య వంట్లో బాగానే వుంది మరి ఎందుకు రాలేదో!"

# ఇ·వేమన·పద్యాలు




వంపుకఱ్ఱ కాల్చి వంపుదీర్పగవచ్చు
కొండలన్ని పిండి గొట్టవచ్చు
కఠిన చిత్తు మనసు కరగింపగారాదు
విశ్వదాభి రామ వినుర వేమ

ఆలోచిస్తున్నట్లు అన్నాడు వాయు నందనరావు

అక్కడ నుంచి వచ్చేశాడు

తను వెంటనే ఇంటికి వెళ్ళాలి అన్నయ్యను కలుసుకోవాలి.

అతను నడిచి వెళుతూ వుంటే రోడ్డు పక్కన ఒక గుంపు కనపడింది

"ఎవరో పాపం లారీక్రింద పడి అక్కడి కక్కడే పోయాట్ట .. పోలీసులు వచ్చారు." అన్నారు ఎవరో

వాయునందనరావు ఇల్లు చేరే ఆత్రంలో ఆ విషయం పట్టించు కోలేదు.

"ఆఁ ఇలాంటి ప్రమాదాలు దేశంలో రోజుకు వంద అవుతున్నాయి... ' అనుకుని అక్కడ నుంచి కదిలిపోయాడు

అతను కూడా ఆ గుంపులో దూరి ఆ చనిపోయిన వ్యక్తి వంక ఒక్కసారి చూసి వుంటే అలా శవంగా మారింది యయాతే అని గుర్తించి వుండేవాడు వాయునందనరావు

అంతవరకూ తన బరువు తగ్గిస్తాడని భావించిన తమ్ముడు తనకు మరొక అదనపు బరువుగా తయారవుతున్నా డన్న బాధతో, చికాకు నిండిన మనసుతో, ఏవేవో గజిబిజి ఆలోచనలతో పరాకుగా నడుస్తూ ఆఫీసుకు వెళుతున్న యయాతి ఎదురుగా వస్తున్న లారీని గానీ, అది చేసిన శబ్దాన్ని గానీ గమనించ నందువల్ల దాని క్రింద పడి ప్రాణాలు పోగొట్టుకున్నాడు

ఆ ఇంటి బరువు బాధ్యతలు పూర్తిగా రేపట్నుంచి వాయునందనరావువే! □




# బైద్యనాధ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాధ్ ఆయుర్వేద భవన్ వైద్యప్రముఖుని సమాధానాలు

**పి. ఎ. సి. కె. రాజా, నిజామాబాదు**

ప్ర : తలనొప్పికి నివారణ?

జ . చంద్రకాంతరస 1 గోళీ మరియు శిరి శూలాది భజరస 1 గోళీ నామ్లతో రెండు పర్యాయాలు తీసుకోవలెను

**జె. సుబ్రమణ్య శాస్త్రి, జక్కరసకుప్పం**

ప్ర మూలవ్యాధికి నివారణ?

జ . బైద్యనాధ్ (పైరాయిడ్స్) గోలీలు రోజుకు రెండు పర్యాయంలు 1 గోళీ మరియు బైద్యనాధ్ అభియారిష్ట భోజనం తర్వాత రెండు చెంచాలు రెండు పర్యాయంలు వేసుకోవాలి. వేడి పదార్థాలను వాడకూడదు.

**జి. యాదగిరి, బుస్సాపూర్; రాజేశ్వరి, అడిగోపుల; సి. సూర్యనారాయణ, కాకినాడ**

ప్ర కడుపులో మంట మరియు ప్రేగులలో పుండ్లు, నోటి పూత, నాలుక పగుళ్ళు?

జ . బైద్యనాధ్ అమ్ల పిత్తాంతకరసం 1 గోళీ బైద్యనాధ్ సూత శేఖరం 1 గోళీ ఉదయం సాయంత్రం నీటితో తీసుకోవాలి మరియు భోజనం తర్వాత బైద్యనాధ్ అతి పిత్తకర చూర్ణం 60 గ్రా. + బైద్యనాధ్ ప్రవాల పంచామృత రసం 3 గ్రా కలిపి 1/2 చెంచా మాధి ఫల రసాయనంతో రెండు పర్యాయంలు తీసుకోవలెను,

**జి. విశ్వనాథరావు, హైదరాబాదు**

ప్ర మెడనొప్పికి మందు సూచించండి?

జ . అశ్వగంధాది భృతం బైద్యనాధ్‌కా మెడపై మాలిష్ చేయవలెను. మరియు బైద్యనాధ్ మహాయోగ గుగ్గులు 1 గోళీ బైద్యనాధ్ మహారస్నాది కాధ 3 చెంచాలు రోజుకు రెండు పర్యాయంలు నీళ్లతో తీసుకోవలెను

**జి. భానుకుమారి, రాజమండ్రి; జి. వరలక్ష్మి, రాజమండ్రి**

ప్ర విపరీతంగా ఒళ్ళు పెరిగినది. తగ్గుట ఎలా?

జ . మీరు బైద్యనాధ్ మేదోహర్ విడుశాధిలోహ 1 గ్రా. తేనెతో, రెండు పర్యాయంలు మరియు బైద్యనాధ్ త్రిఫల గుగ్గులు 1 గోళీ దశమూలారిష్టతో రెండు పర్యాయంలు భోజనం తర్వాత తీసుకోవాలి. క్రొవ్వు పదార్థంలు తినకూడదు.

**డి. హేమాద్రి, పాటిగడ్డా**

ప్ర : కంటి చూపు తగిన వారికి తిరిగి కంటి చూపు తెప్పించవచ్చా?

జ : బైద్యనాధ్ త్రిఫలఘృతం 1 చెంచా పాలతో రెండు పర్యాయంలు, మరియు శీతవరాది చూర్ణం 1 చెంచా రెండు పర్యాయంలు వాడాలి.

**ఆర్. యమ్. రత్నం, గూడూరు**

ప్ర. నిద్ర లేవగానే కీళ్ల నొప్పులతో బాధపడు చున్నాను మరియు మలబద్ధకంతో బాధపడు చున్నాను

జ మీరు ఈ క్రింది బైద్యనాధ్ మందులు వాడగలరు:

1 మహాయోగరాజ గుగ్గులు 2 మాత్రలు రోజుకు రెండు పర్యాయములు, మహారస్నాదిక్వాథం. 2 చెంచాలు + 4 చెంచాలు నీళ్లతో ఉదయం, సాయంత్రం. 2. వాత గజాంకుశ రసం 1 గోళీ, దశ మూలారిష్ట 2 చెంచాలు + 4 చెంచాల నీళ్ళు భోజనం తర్వాత రెండు పూటలు. 3. నంజు వస్తువులు వంకాయ, పుంటికూర, ఆలుగడ్డలు తినకూడదు. ఈ ఔషధాలు కనీసం 6 మాసాలు వాడవలెను.

**జి. వీరబ్రహ్మాచారి, నెల్లూరు; పి. వెంకట సుబ్రమణ్యం, శ్రీకాళహస్తి; భానుప్రకాశ్ శర్మ, హైదరాబాద్**

ప్ర. వీరు శీఘ్రస్ఖలనం మరియు సంభోగ శక్తి కల్గుటకు చికిత్స కొసం వ్రాసినారు.

జ. వీరు ఈ క్రింది బైద్యనాధ్ మందులు వాడవలెను.

1. బైద్యనాధ్ చైటిక్యు 1 గోళీ రోజుకు రెండు పర్యాయములు, పాలతో. పాలలో బైద్యనాధ్ ముసలిపాక్ రెండు చెంచాలు కల్పవలెను. 2. భోజనం తర్వాత అశ్వగంధారిష్ట 2 చెంచాలు + నీళ్ళు 3 చెంచాలు రోజుకు రెండు పూటలు. 3. ఎక్కువ కారం పులుపు తీసుకోకూడదు. ఈ ఔషధంలు కనీసం 3 నెలలు వాడవలెను.

**యస్. రమేష్, బ్రహ్మపురి, నిర్మల్**

ప్ర. 3 సంవత్సరముల నుండి అస్తమా ఉన్నది. ఎలర్జీ కూడా కలదు.

జ మీరు 1. సమీరసన్నాగ రసం 3 గ్రా., మల్ల సింధూరం 3 గ్రా., ప్రవాళభస్మ 6 గ్రా. అన్నీ కలిపి 40 ప్యాకెట్లు చేసి రోజూ రెండు వంతున తేనెతో వాడవలెను. 2. నారదాము లక్ష్మీ విలాస రసం 1 గోళీ దశమూలారిష్ట 2 చెంచాలు + 4 చెంచాలు నీళ్ళు. రోజుకు రెండు పర్యాయములు. 3. గోంగూర, ఆలుగడ్డ, వంకాయ, నూనె పదార్థములు తినకూడదు. 4. ఈ విధంగా 2 సం.లు చేయవలెను.

**వడ్డి మంగరాజు, విజయనగరం**

ప్ర 4 నెలల నుండి తెల్ల బట్ట అవుతుంది.

జ మీరు శ్రీ బైద్యనాధ్ 1. సుందర కల్యా 2 చెంచాలు + 4 చెంచాల నీళ్లు రెండు పర్యాయములు, 2 చంద్ర ప్రభావటి 2 గోలీలు రెండు పర్యాయములు, 3. ఈ విధంగా 3 మాసములు వాడవలెను. □

### కూపన్

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**బైద్యనాధ్ ఆరోగ్య దీపిక**

ప్రశ్న :..........................................

..........................................

..........................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :

# విజయ్

భారతదేశపు నెంబర్. 1 ఐరన్
9 మోడల్స్‌లో లభిస్తుంది.































JAISONS AMA 5186

సీరియల్

ఆదూరి సావిత్రి

(గత సంచిక తరువాయి)

ఆ రాత్రి అతను బాబూరావు ఇంటికి వెళ్ళేవరకు సాధిస్తూనే ఉన్నది తులశమ్మ

ఆఖర ఆశగా "రాజకుమార్ మంచివాడే, బాబూరావు కన్నా నిజాయితీ పరుడు అన్నాడు చలపతి

'కావచ్చు ఆ మంచితనం మనకేం ఒరగబెడుతుంది?" అంటూ నిలదీసింది తులశమ్మ

"మంచితనం అనేది ఎప్పుడూ ఏదో ఒరగ బెట్టడానికే అనుకోవటం మూర్ఖత్వం '

"మేమందరం మూర్ఖులం మీరే మహ తెలివైన వారు. సరేనా? ఈ సోదంతా అనవసరం ఊళ్ళో రాజకీయాలకన్నా నా బిడ్డ పెళ్ళి నాకు ముఖ్యం తండ్రిగా మీకు కూడా ఆ బాధ్యత ఉంది మీరు నా మాట వినకపోతే నేనీ ఇంట్లో పచ్చి గంగ కూడా ముట్టను "

' బాగోదే?

"ఏమిటి బాగుండేది? ఈ రోజుల్లో కూడా మీలాంటి పిచ్చి మారాజులుండబట్టే దేశం ఇలా ఏడ్చింది. మరీ మీకంత భాధగా ఉంటే రాజకుమార్ వైపు ఉంటూ పని మాత్రం బాబూరావుకు చేయండి "

'మరీఅంత నమ్మక ద్రోహమా?"

"నమ్మకమూ, లేదు ద్రోహమూ లేదు మీరిహ మాట్లాడకండి ఇంకా మీరు దీన్ని సాగదీస్తే నేను నా బిడ్డ ఏ నుయ్యో గొయ్యో చూసుకుంటాము ఇహ మీరు నిశ్చింతగా ఆ రాజకుమార్ వెనకాలే అంటుకు పోయి ఉందురు గాని ఏం చేస్తాం మా రాతలిలా తగలడ్డాయి " అంటూ కళ్ళు తుడుచుకొని చెంగులోకి చీదేసింది తులశమ్మ

ఇహ అది తిరుగులేని బ్రహ్మాస్త్రం

"ఎక్కడ కొట్టాలో అక్కడే కొట్టాడు బాబూరావు ' అనుకుంటూ

"సరే వెడతాలే " అనేశాడు చలపతి

రాజకుమార్ వేపు ఉంటూనే అతన్ని నమ్మిస్తూ తన వేపు పని చేయమని బాబూరావు కోరినపుడు కూడా సరే అనే అన్నాడు చలపతి.

ఇహ అతడు తన ద్విపాత్రాభినయం ప్రారంభించాడు. .

ఇలాంటి చలపతుల మనస్తత్వాలకి ఇంకా అలవాటు పడని రాజకుమార్ అతన్ని గుడ్డిగా నమ్ముతూనే ఉన్నాడు.

ఆ నమ్మకాన్ని బాబూరావు ఉపయోగించుకోవటం మొదలెట్టాడు

ముస్లింల ఓట్లన్నీ యువకుడైన రాజకుమార్‌కే పడేలా ఉన్నాయి. వాళ్ళను విడదీసే ప్రయత్నాలు ప్రారంభించాడు బాబూరావు

ఒక రోజు తాము వాడుకగా మంచి నీళ్ళు తెచ్చుకొనే బావి దగ్గరకు వెళ్ళి యా అల్లా!" అనుకుంటూ నాలుగడుగులు వెనక్కు వేశారు ముస్లిమ్స్

ఆ బావిలో పంది పడి చచ్చి ఉంది

తమ ఓట్లు బాబూరావుకు పడతాయనే భయంతో కసితో రాజకుమారే ఈ పని చేయించాడు అనే వార్తను గాలిలోకి ఊదాడు బాబూరావు

"ఛ! ఆయనిలాంటి లుచ్చా పనులు చేయడు అన్నారు వాళ్ళు

'ఈ మాటలు నేనంటున్నానా? ఆయన నమ్మిన బంటు, కుడిచేయి లాంటి వాడు అయిన చలపతి చెబుతున్నాడు " అన్నాడు బాబూరావు

ప్రశ్నార్థకంగా చలపతి వైపు చూశారు వాళ్ళు

ఔను భాయ్ ఆ రాజకుమార్ మీ రనుకున్నంత మంచోడు కాదు మీ ఓట్లు తనకు పడతాయా అన్న విషయం మీద ఆయన కింకా అనుమానమే ఆయన కసలు ముస్లిం లంటే ద్వేషం పైకి ఊరికినే అలా నటిస్తుంటాడు రాత్రి పందిని చంపి బావిలో పడెయ్యమని ఆయన ఆజ్ఞాపించటం నా చెవులారా విన్నాను. నేనూ చెప్పి చూశానది మంచి పద్ధతి కాదని. నువ్వు అన్ని విషయాల్లో

**జరిగిన కథ –5:** ప్రణీత్ తండ్రి వెంకట్రామయ్య పైడిపల్లికు టీచరుగా వచ్చారు ఆయన భార్య కామేశ్వరి పట్నంలో చదువుతున్న ప్రణీత్ పైడిపల్లికు వస్తాడు బాబూరావు, శర్వాణిల కూతురు మంజీర బాబూరావు మాజీ మున్సిపల్ చైర్మన్ మంజీర, శ్యామ ప్రాణస్నేహితులు. తల్లి లేని శ్యామ మేనత్త దగ్గర ఉంటూంటుంది బావ రాజారావుకి శ్యామ అంటే ఇష్టం. మంజీరను ప్రణీత్ ప్రేమిస్తున్నాడని తెలుసుకున్న శ్యామ అతనిని ఆటలు పట్టిస్తుంది. మంజీర, ప్రణీత్‌ల వివాహానికి పెద్దలు తాంబూలాలు పుచ్చుకుంటారు. మంజీర, ప్రణీత్‌లు తోటలో కలుసుకుని ఒకరి మనసునొకరు అర్థం చేసుకోవటానికి ప్రయత్నిస్తారు ప్రణీత్, మంజీర అతికష్టం మీద విడిపోయి లేఖల్లో ప్రణయాన్ని కొనసాగించుకుంటుంటారు ఎన్నికల్లో రాజకుమార్ కాంగ్రెస్ తరఫునా, బాబూరావు ప్రాంతీయ పార్టీ తరఫునా పోటీ చేస్తారు ఇద్దరి మధ్యా కార్పణ్యం రగులుతుంది రాజకుమార్ మీద నేరం ఆరోపించేందుకు బాబూరావు వర్గం మంగిని ఎత్తుకు పోయి చంపేసి బావిలో పడేస్తారు. రాజకుమార్ కుడి భుజం చలపతిని బాబూరావు సుముఖం చేసుకుంటాడు.

కల్పించుకోవద్దని నన్నే గదిమాడు" అన్నాడు చలపతి

రాజకుమార్ నమ్మిన బంటు లాంటి వాడైన చలపతే స్వయంగా చెప్పటంతో ముస్లింలు ఆలోచనలో పడ్డారు

అదును చూసుకుని వెంట వెంట సమిదలు వేస్తూ వేయిస్తూ వచ్చాడు బాబూరావు

"రాజకుమార్ మసీదుల్లో పందుల్ని కోయించి నీళ్ళు తోడుకునే బావుల్లో పడేయిస్తున్నాడు' అనే పుకారు ఊరంతా వ్యాపించింది

'అవునవును అతనలా కోయిస్తుండగా మేంకూడా చూశాం.' అన్నాయి కొన్ని కంఠాలు

ఒక మంచి పని గురించి చెబితే ఆ మంచి మనుషుల్లోకి త్వరగా ఎక్కదు చెడు, అబద్ధం అనేవి రెండూ మాత్రం గాలికన్నా వేగంగా జనంలోకి వ్యాపిస్తాయి

ఒక అబద్ధపు వార్త ప్రాచుర్యం పొందినట్లుగా నిజమైన వార్త పొందదు

మనిషికి అబద్ధం ఇచ్చినంత కిక్కు నిజం ఇవ్వదు

ఒక వ్యక్తి మంచివాడైతే వాడిని అందరూ తలుచుకోరు వాడు చేసే మంచి పనుల్ని పట్టించుకోరు కానీ., అతనేదైనా చెడు పని చేశాడంటే మాత్రం జనం అంతా చెవులు, కళ్ళు అటే కేంద్రీకరిస్తారు అది నిజమా అబద్ధమా అని కూడా ఆలోచించరు.

రాజకుమార్ విషయంలో ఇదే జరిగింది

ఇలా ప్రచారం చేసేవాళ్ళలో చలపతి ముఖ్యుడు అనే వార్త రాజకుమార్‌కు దిగ్భ్రాంతి కలిగించింది.

చలపతిని నిలదీసి అడిగాడు

"నువ్వు కూడా నమ్ముతున్నావా రాజ్‌కుమార్ దీన్ని? ఎప్పటి నుంచో నిన్ను అంటిపెట్టుకొని ఉన్నాను నేను నీకింత ద్రోహం చెయ్యగలనా? మన మధ్య తంపులు పెట్టి విడదీయటానికి బాబూరావు పన్నిన కుట్ర ఇది నువ్వు నన్నిలా అడగటమే నాకెక్కువ బాధ కలిగిస్తుంది." అన్నాడు చలపతి

"సారీ! దీన్ని సీరియస్‌గా తీసుకోకు." అన్నాడు రాజ్‌కుమార్

అబద్ధమో నిజమో అనుమానం అంటూ ఏర్పడింది కనుక అంతరంగిక విషయాలు చలపతితో చర్చించకుండా ఉంటే సరిపోతుంది అనుకున్నాడు రాజ్‌కుమార్

ముస్లింస్ చాలావరకు బాబూరావు వేపు తిరిగి పోయారు

అయినా తన గెలుపు మీద అపనమ్మకమే బాబూరావుకి

గతంలో రాజ్‌కుమార్‌తో పోటీ చేసి ఓడిపోయిన సందర్భంలో ఆయన నేర్చుకున్న గుణపాఠం ఇది

ఎలక్షన్స్ వచ్చేశాయి

"గోగినేని పల్లెలో మన ఏజెంట్లు సరైన వాళ్ళను పెట్టండి అసలు . నువ్వే అక్కడ ఉండి ఆ వ్యవహారాన్ని డీల్ చేయి. అక్కడ ప్రిసైడింగ్ ఆఫీసర్ మనవాడే అక్కడున్న ఓట్లలో మూడొంతులు రాజ్‌కుమార్‌కే పడతాయి అర్థమయిందిగా? జాగర్తగా ఉండు." అని చలపతితో చెప్పాడు బాబూరావు

గోగినేని పల్లెలో పోలింగ్ జరుగుతోంది...

డబ్బు... సారాయి.... కుట్ర.... మోసం సమపాళ్ళలో ప్రవహించాయక్కడ. నీతి నిజాయితీ అనేవి రెండు అవినీతి అక్రమాల చేతుల్లో ఎంత దారుణంగా పతనమై పోతాయో అక్కడ పోలింగ్ చూస్తే స్పష్టంగా తెలుస్తుంది....

ఓటు చేయాల్సిన జనం సగానికి సగం మంది ఉండగానే పోలింగ్ పూర్తయి పోయిందన్నారు...

"అదేమిటి? నా పేరు లక్ష్మీదేవి. నేనసలు ఓటే వెయ్యలేదు. కావాలంటే చూసుకోండి." అన్నదో యువతి ఉద్రేకంగా.

"నువ్వు వోటేసినట్లు ఇందులో నమోదయిందమ్మా మేమేం చెయ్యం?" అన్నాడు ప్రిసైడింగ్ ఆఫీసర్.

"నా వేలికి గుర్తేది? ఓటేస్తే గుర్తుండాలి గదా!" వేళ్ళు ముందుకు చాపుతూ అన్నదామె.

"గుర్తు చెరిపేసుకున్నావేమో!" అన్నాడు బాబూరావు ఏజెంటు.

"నాకేం ఖర్మ పట్టింది?"



# ఒడిలో చెలి మోహన రాగం

"ఆ సంగతి నాకెలా తెలుస్తుంది?"

"అసలా ఓటేసిన లక్ష్మీదేవి ఎవరో సరిగ్గా చూడండి. నేను మాత్రం కాదు. ఈ ఊళ్ళో ఆ పేరు నా ఒక్కదానికే లేదు.'

ఏకుమల్లె లక్ష్మీదేవి భర్త పేరు టేకుమల్లె గాలెయ్య. అంటూ చదివ పి సైడింగ్ ఆఫీసర్

'నా ఓ రాజ్‌కుమార్‌కి వేయాలనుకున్నాను. మీరే దొంగ పేరుతో దాన్ని మీ పార్టీకి గుద్దుకొని ఉంటారు. ." బాబూరావు ఏజెంటు వైపు చూస్తూ ఆవేశంగా అన్నదామె

'ఏవమ్మోయ్! మాటలు మర్యాదగా రానియ్. మాకలాంటి ఖర్మఏం పట్టలేదు నీకే ఆ రాజకుమార్‌గాడి మీద యావ ఉండి రెండు సార్లు గుద్దుదామని వచ్చావేమో" పీకల దాకా తాగి ఉన్న బాబూరావు ఏజెంటు మోటుగా అన్నాడు

నువ్వెళ్ళవమ్మా తల్లీ ఇక్కణ్ణుంచి నువ్వు ఓటేసినట్లు నమోదయి పోయింది ఇహ నువ్వెంత వాదించినా రెండో సారి ఓటియ్యటానికి వీల్లేదు' అన్నాడు పోలింగ్ ఆఫీసరు

ఈ విధంగా ప్రతి చోట గూండాయిజాన్ని కొనసాగించారు బాబూరావు వర్గం వాళ్ళు

ఎలక్షన్లు పూర్తయ్యాయి

కౌంటింగ్ ప్రారంభమయింది

జనం రెండు వర్గాలుగా చీలి కౌంటింగ్ జరుగుతున్న మున్సిపాలిటీ ఆవరణలో నూ, బయట రోడ్ను మీద గుమిగూడారు .

ఒక్కో రౌండు ఫలితాలు తెలియగానే అప్పటివరకూ లీడింగ్‌లో ఉన్న పార్టీ వాళ్ళు తమ ప్రత్యర్థి పార్టీల వేపు హేళనగా చూస్తూ సంతోషంతో ఈల వేసి గోల చేస్తున్నారు మరో రౌండులో రెండో పార్టీవాళ్ళు మెజార్టీగా వచ్చి, మొదటి వాళ్ళ నెద్దేవా చేస్తూ గోల చేస్తున్నారు ప్రశాంతంగా ఉండమని హెచ్చరిస్తున్న పోలీసుల మాటల నెవరూ లక్ష్య పెట్టటం లేదు

కౌంటింగ్ ఆఖరి రౌండ్‌లో ఉండగానే తలవంచుకొని అక్కడి నుంచి విషాదంగా కదలి వెళ్ళిపోయాడు రాజకుమార్

తప్పుడు ప్రచారాలు . రిగ్గింగ్ హత్యలు అన్నీ తోడై బంపర్ మెజార్టీతో గెలిచాడు బాబూరావు

ఇక్కడ పార్టీ ఏదనేది ప్రధానం కాదు బాబూరావు లాంటి వాళ్ళు ఏ పార్టీలో చేరినా ఇలాంటి పద్ధతులే అవలంబిస్తారు తద్వారా ఆ పార్టీ చరిత్రను కలుషితం చేస్తారు




రాజకుమార్ లాంటివాళ్ళు తమ నిజాయితీతో పార్టీ ప్రతిష్టను పెంచగలరే గాని అధికారంలోకి రాలేరు

గతానికి వర్తమానానికి ఓటర్ల మనస్తత్వాలలో వచ్చిన మార్పే మానసిక బలహీనతలే ఇందుకు ముఖ్య కారణం

ఓటర్లే నిజాయితీగా ఉండ గలిగిన నాడు బాబూరావు లాంటి వాళ్ళ ఆటలు సాగవు.

అట్టహాసంగా ఊరేగింపు ప్రారంభమయింది అనంతరం జరిగిన బహిరంగ సభలో జనాన్నుద్దేశించి మాట్లాడుతూ–

"నేనెంత నిజాయితీ పరుడినో ... ప్రజల కోసం ఎంతగా పాటు పడతానో అందరికీ తెలుసు మన నియోజక వర్గానికి నేను మాత్రమే మేలు చేయగలననే నమ్మకం ప్రజల్లో ఉంది. నా గెలుపు ద్వారా ప్రజలిచ్చిన తీర్పే నిష్కళంకమైన నా రాజకీయ చరిత్రకు తార్కాణం మీకు నామీదున్న నమ్మకాన్ని ఎన్నడూ వమ్ము చేయను

నా నియోజక వర్గ ప్రజలకు నేను పునరంకిత మవుతాను మన ఊరికి బస్టాండు లేదు ఇది అతి ముఖ్యమైన సమస్య మన మాజీ ఎమ్మెల్యే రాజకుమార్ గానీ, అతని తండ్రిగానీ తమ ఐదేళ్ళ పాలనలో దీని గురించి పట్టించుకున్న పాపాన పోలేదు ప్రజలకు నమ్మకం పోబట్టే నన్నింత మెజారిటీతో గెలిపించారు మన ఊరికి బస్టాండు నేను కట్టిస్తాను ప్రయాణీకులకు షెల్టర్లు వేయిస్తాను మన నియోజక వర్గంలో ఉన్న ఊళ్ళన్నింటినీ ఆదర్శవంతంగా తీర్చి దిద్దుతాను నా ప్రజల కోసం నా ఆఖరి రక్తం బొట్టు కూడా ధారపోస్తాను ప్రజలారా! మీ కోసం నా ప్రాణాలను సహితం అంకితమిస్తాను" అంటూ ఆవేశంతో గద్గద స్వరంతో ప్రసంగించాడు బాబూరావు. జయ జయ ధ్వానాలు మిన్ను ముట్టాయి

* * * *

రాజధానీ నగరానికి షైరవీలు ప్రారంభించాడు, బాబూరావు మొత్తానికి బాబూరావు మినిస్టర్ కాగలిగాడు ఈ విషయంలో ఫైనాన్స్ మినిస్టర్ రమేష్ చంద్ర బాబూరావుకు బాగా తోడ్పడ్డాడు

కుటుంబాన్ని పైడిపల్లిలోనే ఉంచి తను అటు ఇటు తిరుగుతున్నాడు బాబూరావు .

రాజారావు హైమను పెళ్ళి చేసుకుని అక్కడే ఉండి పొలాలు చూసుకుంటున్నాడు

* * * *

ప్రణీత్ సబ్ ఇన్స్పెక్టర్‌గా పైడి పల్లికి వచ్చాడు

మంజీర ఆనందానికి అవధుల్లేవు అతను వచ్చిన రోజు సాయంత్రమే వాళ్ళింటి కెళ్ళింది

"హాయ్ మంజూ! అంటూ ఆమెను ఉక్కిరి బిక్కిరయేంత దగ్గరగా లాక్కున్నాడు ప్రణీత్

"అబ్బబ్బ! అత్తయ్య!' అతన్ని విడిపించుకుంటూ అన్నది మంజీర.

'సాయంత్రం తోట దగ్గరకు "

ఒద్దు "

,ఏం?

'ఇప్పుడు తమరు ఆకతాయి ప్రణీత్ కాదు "

"అంటే? ఎప్పుడైనా మాత్రం నేను ఆకతాయిగా ప్రవర్తించానా?"

"ఆఁ!"

"ఎంత ధైర్యం నీకు?"

"ఎస్ ఐ గారి కాబోయే భార్యను గదా!

"పర్లేదే!'

మరే! ఒక బాధ్యత గల పోలీసాఫీసర్ మీరు. ఇలా బాధ్యతా రహితంగా ఒక పెళ్ళి కాని అమ్మాయిని వెంటేసుకుని తోటలంట తిరగ్గూడదు అలా తిరిగే వాళ్ళని మందలించాల్సింది పోయి మీరే "

"ఆగాగు. ఆ పెళ్ళి కానమ్మాయి సాక్షాత్తూ నా కాబోయే భార్య. భార్యతో ఎక్కడ ఎలా తిరగటానికయినా మగాడికి లైసెన్సుంది."

"కాబోయే భార్య కానీ .. ఇంకా కాలేదుగా?"

"త్వరలో ఔతుందిగా?"

"అయినప్పుడే తిరగొచ్చుగా?"

"అందాకా ఆగలేనే .. నా వయసు ..."

"చాల్లేంది దరిద్రపు పాట."

"పోనీ... నువ్వేదయినా మంచి పాట చెప్పు."

"అలాగే. పెళ్ళయ్యాక చెపుతాను. అందాకా ఇలాంటివి పాడకండి."

"అగ్రీడ్!"

"థాంక్యూ!"

"అయితే.... తోటకు రావా?"

"రాను."

"ఇలాంటివి పాడనుగా!"

"అయినా రాను."

"హైమ రాలుగాయితనం నీ కంటుకుంటుందేం?"

"ఇక్కడేదో కుట్ర జరుగుతున్నట్లుంది పవిత్రమైన నామాక్షరము లుచ్చరింప బడుతున్నవే!" అంటూ వచ్చింది హైమ.

ఫక్కున నవ్వాడు ప్రణీత్

"ఎలా ఉంది హైమా నీ కొత్త సంసారం?" అంటూ పరామర్శించాడు ప్రణీత్

"మా బావ చిలిపి చేష్టల తీపిలో మా అత్త దెప్పుళ్ళకారం కలిసి మహారంజుగా సాగుతోంది అన్నయ్యా!"

"నీ కసలు సిగ్గు లేదే!" అన్నది మంజీర

"స్త్రీకి సిగ్గు అస్తమానం సింగారం కాదట."

"ఎవరు చెప్పారో గానీ... పచ్చి నిజం." అన్నాడు ప్రణీత్

"సరేగానీ. .. ఇంతకీ తమరి పెళ్ళెప్పుడు?"

"రేపు మా నాన్నగారెళ్ళి అడిగి వస్తానన్నారు ఏం మంజూ రేపు మీ నాన్నగా రుంటారుగా!" అన్నాడతను

"ఉంటారు " అన్నది మంజీర. అప్పుడే ఓ సిగ్గు రేఖ స్నిగ్ధంగా ఆమె మొహాన్ని తాకింది. బరువుగా వాలుతున్న కనురెప్పల వేపు ఆసక్తిగా చూశాడు తను. ఆమె ప్రతి అనుభూతినీ స్వంతం చేసుకోగల సమయం కోసం అతని మనసు ఉవ్విళ్ళూరుతోంది ...

* * * *

"మనంతట మనమే వెళ్ళి అడిగితే లోకువయిపోమూ?" అన్నది కామేశ్వరి భర్తకు అన్నం ఒడ్డించి, పక్కన కూచుని విసనకర్రతో విసురుతూ ..

"సింగినాదం లిద్దూ! ఇదివరకు నిశ్చయం చేసుకున్నదే గదా! ఇప్పుడాయన కొత్తగా మినిస్టరవటంతో క్షణం తీరిక లేకుండా ఉన్నాడు నేను ఖాళీగానే ఉన్నాను గదా' త్వరలో లగ్నాలు పెట్టమని చెప్పి వస్తాను ఆ పిల్ల దాదాపు మన కోడలయినట్టే ఇంకా మనలో మన కెందుకీ పట్టింపులు?" అన్నాడు వెంకట్రామయ్య

"ఔన్లెండి అదేమిటి? పులుసులో అన్నం కొంచమే పెట్టుకున్నారు? అసలింతకీ అందులో ఉప్పు వేశానా లేదా?"

"నువ్వెక్కడ అప్పుడే నీ ఆలోచనలు కాబోయే కోడలి మీద .. రాబోయే అత్తగారి పదవి మీద కేంద్రీకృతమయి పోయాయి "

"అయితే.. ఉప్పెయ్యలేదన్న మాట! అయ్యో! మీకిష్టమని గుమ్మడికాయ పులుసు చేశానండీ! ఉప్పెయ్యకుండా పాడు చేశానా' ఇప్పుడు వేసినా ముక్కలకు పట్టదు. ఆ రుచి రాదు."

"వేశావులే. నేనూర్కే తమాషాగా అంటున్నాను. అనుమానంగా ఉంటే.... ఒక ముద్ద పెడతా తిని చూడు."

"నయం! ఎవరన్నా చూస్తే నవ్వి పోయేరు "

"ఎందుకూ?"

"వీళ్ళ కీవయసులో సరసాలు కావాల్సి వచ్చాయా అని."

"సరసాలకు వయసుతో ఏం పని?"

"మీకు నేను చెప్పలేను బాబూ!"

"అందుకే.... చెప్పకు ఇందు! ఈ ముద్ద తిను."

"బాబోయ్! నాకు సిగ్గు."



# ఒడిలో చెలి మోహన రాగం

"ఏమిటీ!" అంటూ పెద్దగా నవ్వాడాయన

"చాల్లెండి బడాయి!" అని ఆయన్ని మందలించి, "ప్రణీత్! ఆ పని తరవాత చూసుకోవచ్చులే. నువ్వూ రా! వడ్డించేస్తున్నాను." అంటూ మాట మార్పు చాటున సిగ్గును దాచుకుంది కామేశ్వరి

★ ★ ★ ★

చుట్టూ పరిజనమంతా పరివేష్ఠించి ఉండగా... వాళ్ళ స్తోత్రాల్ని అలవోకగా ఆలకిస్తూ.... వాళ్ళ పొగడ్తలకు చెయ్యి మీసం మీదికి పోనిస్తూ.... వాళ్ళ చాడీలకు కళ్ళు ఎరుపు చేసుకుని బుసలు కొడుతూ... వాళ్ళ చెప్పుడు మాటలలో గల తీపిని ఆస్వాదిస్తూ కొలువు తీరి ఉన్నాడు బాబూరావు తన ఇంట్లో గేటు తీసుకుని లోపలి కొస్తున్న వెంకట్రామయ్యను చూసీ చూడనట్లు తల తిప్పుకున్నాడు.

ఆయన మనసు చివుక్కుమంది బాబూరావు ప్రవర్తనకు

"ఛ! అంతా తన అనుమానమే! చూసి ఉండడు." అనుకుంటూ– "నమస్కారం బావగారూ!" అన్నాడు వెంకట్రామయ్య.

ఆ సంబోధనకు బాబూరావు మొహం అప్రసన్నంగా మారింది.

"ఓ మీరా! ఏమిటిలా వచ్చారు?" అన్నాడు బాబూరావు పొడిగా

ఆయన కుర్చీలో నుంచి లేవక పోవటం... తనను కూర్చోమనక పోవటం.... గతంలో లాగా తనను తిరిగి "బావగారు" అని సంబోధించక పోవటం గమనించిన వెంకట్రామయ్య మనసు కేదో అపశ్రుతిలా అనిపించింది. మొహం నల్లబడింది.

"కూర్చోవచ్చా?" అన్నాడు కష్టంగా.

"ఎంతమాట! కూర్చోండి ఇహ చెప్పండి. ఏమిటి?" అన్నాడు బాబూరావు.

"తనెందు కొచ్చాడో నిజంగా ఈయనకు తెలీదా? ఈ నాటకం దేనికి నాంది?" అని కించపడుతూ .. చుట్టూ ఉన్న వాళ్ళ వేపు ఇబ్బందిగాచూస్తూ, "మీతో మాట్లాడాలి! తాతగారు లేరా?" అన్నాడు వెంకట్రామయ్య

"లోపలున్నారు."

అక్కడున్న వాళ్ళ చూపుల శరపరంపరల నుంచి తప్పుకుని, బ్రతుకు జీవుడా అనుకుంటూ లోపలి కెళ్ళి పోయాడు వెంకట్రామయ్య భగవద్గీత పక్కన్న పెట్టి ఆయనను సాదరంగా ఆహ్వానిస్తూ, "అమ్మ మంజూ! మీ మావగారొచ్చారు. కాఫీ పట్రా." అని కేక పెట్టి, వెంకట్రామయ్య వేపు తిరిగి, "అబ్బాయి వచ్చాడటగా? ఓసారి రమ్మనండి చక్కటి ఉద్యోగంలో చేరాడు. అతని చురుకుతనానికి తగిన ఉద్యోగం ఎన్నుకున్నాడు " అభినందనగా అన్నారు తాతగారు.

"అన్ని అడ్డంకులూ తీరిపోయి, వాడూ స్థిరపడ్డాడు గనక, ఇహ వాళ్ళ పెళ్ళి జరిపించేస్తే బావుంటుందని..." అన్నాడు వెంకట్రామయ్య

"అవశ్యం! అలాగే చేద్దాం. అబ్బాయి నిన్ననే వచ్చాడు హైదరాబాదు నుంచి. వచ్చిం దగ్గర్నుంచీ అసలు తీరికే లేదు ఎప్పుడూ ఎవరో ఒకరు అంటి పెట్టుకునుండటంతో ఈ విషయం మాట్లాడుకోటానికే వీలు కుదరలేదు."

"సిద్ధాంతి గారికి కబురంపించనా? లగ్నాలు ఎప్పుడున్నాయో చెపుతాడు?" అన్నది శర్వాణి.

"అలాగే, రంగన్నని పంపించు. వెళ్ళి పిల్చుకొస్తాడు." అన్నారు తాతగారు....

తన ముందునుంచి వెడుతున్న రంగన్నను ఆపి " ఎక్కడి కెడుతున్నావు?" అన్నాడు బాబూరావు.

"తాతగారెళ్ళి అయ్యోర్ని పిలుచుకు రమ్మన్నారు దొరా!" వినయంగా అన్నాడు రంగన్న.

"అక్కర్లేదు. నువ్వెళ్ళి నీపని చూసుకో".

రంగన్న తికమకగా చూశాడు.

"చెపుతుంటే నీక్కాదూ? అంతరాలు తెలుసుకుని మసులుకో". ఉరిమినట్లుగా అన్నాడు బాబూరావు.

కిక్కురు మనకుండా లోపలి కెళ్ళిపోయాడు రంగన్న.

వెంకట్రామయ్యతో పాటు తాతగారూ, శర్వాణీ కూడా ఉలిక్కిపడ్డారు. అర్థం లేని ఆ వాక్యంలో అంతర్గతంగా ఉన్న హెచ్చరిక తనకే అనిపించింది వెంకట్రామయ్యకు.

"వాడు మాట్లాడేసి ఉంటాడు. అందుకే వద్దన్నాడు. కూర్చోండి మీరు. ఇప్పుడు లోపలి కొస్తాడుగా ! నేను కనుక్కుంటాను." అన్నారు తాతగారు తేరుకుంటూ.

ఇహ వాళ్ళ మధ్య సంభాషణ సహజంగా సాగలేదు.

ముసుగులో గుద్దులాట దేనికి? విషయమేమిటో తేల్చుకునే వెళ్ళొచ్చునే ఉద్దేశంతో బలవంతాన కూర్చున్నాడు వెంకట్రామయ్య.

చాలాసేపటి తరువాత లోపలి కొచ్చి "అన్నం వడ్డించెయ్యి, నేను త్వరగా వెళ్ళి పోవాలి." అన్నాడు బాబూరావు శర్వాణితో.

తన వేపు తల కూడ తిప్పి చూడని బాబూరావునే గమనిస్తున్నాడు వెంకట్రామయ్య. ఇంతవరకూ ఎప్పుడూ ఎవరి చేతిలోనూ ఆయన ఇలాంటి అవమానాన్ని ఎదుర్కోలేదు. కొడుకు కోసం ఈ దుర్భర స్థితిని మౌనంగా భరిస్తున్నాడు. మంజీర అంటే ప్రణీత్ కెంత ఇష్టమో ఆయనకు తెలుసు.....

"వాళ్ళు తొందర పడుతున్నార్రా ..." ఉపోద్ఘాతంగా అన్నారు తాతగారు.

"దేనికి తొందర?" నిర్లక్ష్యంగా అన్నాడు బాబూరావు.

'అదే! పెళ్ళి విషయం. ."

"ఎవరి పెళ్ళి?"

"ఏమిటా ప్రశ్న? మంజీరా, ప్రణీత్‌ల పెళ్ళి గురించి మనం ఇదివరకు అనుకున్నదే గదా!"

"అనుకోటానికేం? లక్షా తొంభై అనుకుంటాం. అవన్నీ అమలు జరిపి తీరాలనే రూలేం లేదుగా?"

"అంటే?"

"ఈ పెళ్ళి నా కిష్టం లేదు".

చాటుగా వింటున్న శర్వాణి గుండెల్లో బాంబు పేలినట్లయింది.... తాతగారు తెరిచిన నోరు ముయ్యటం మర్చి పోయారు . మంజీర కళ్ళలో వరద గోదారి ప్రవహిస్తోంది. తట్టుకోలేని దానిలా మంచం మీద కూలబడిపోయింది. .

(ఇంకా ఉంది)






# "లవంగ నూనె లేని టూత్ పౌడరు నాకు పనికిరాదు"



"నాకిష్టమైన టూత్‌పౌడరు ప్రామిస్. ఎందుకేమిటి, దీన్లో లవంగ నూనె ఉంది! అందుకే ఇది ఊరూరా పేరు మోసింది. లవంగ నూనెలో రెండు గొప్ప సుగుణా లున్నాయి. ఇది చిన్నచిన్న బాధలనుంచి పళ్లను సదా కాపాడుతుంది. పైగా పళ్లకు చెడుపుచేసే సూక్ష్మజీవులు దీనిదెబ్బకు నశించిపోతాయి.

ఇందువల్ల పళ్లు గట్టిగా ఉంటాయి. దీని మరొక గొప్ప గుణమేమిటంటే, ఇది నోటిని తాజాగా, సువాసనగా ఉంచుతుంది. అంటే మనం మాట్లాడుతుంటే ఎదుటి వాళ్లు మొహం తిప్పుకోరన్నమాట!

మరొక ముఖ్య విషయమేమిటంటే, ప్రామిస్‌లోని సద్గుణాలతో పోలిస్తే దీని వెల చాల తక్కువ. దీనిపైన పెట్టిన పైసపైసకూ మనకు ఫలితం దక్కుతుంది.




30 గ్రా. పౌచ్‌లో కూడా లభిస్తుంది.

నన్నడిగితే ప్రామిస్ టూత్‌పౌడరే తెచ్చుకోమంటాను. ఇది లవంగ నూనెతో నిండినది. బల్సారా వారు ఎంతో ఆలోచనతో సృష్టించినది".

## లవంగ నూనెతో అద్భుత సృష్టి

# ప్రామిస్

## టూత్‌పౌడర్



బల్సారా—
టూత్ పేస్ట్ విశేషజ్ఞులు



CHAITRA-B BLS 828 TEL

స్కూటర్ స్టార్ట్ అవడం లేదు. పాత బడేకుంది ఈ ఇబ్బందులు తప్పవు.

పదిహేనేళ్ల నుండీ లెక్చరర్ ఉద్యోగం చేస్తున్నా ఓ చిన్నకారు కొనుక్కోలేక పోయాను ఇంకా నయం, పెద్దలు సంపాదించి యిచ్చిపోయిన ఇల్లు ఉండబట్టి సరిపోయింది లేకపోతే ఎన్ని యిబ్బందులు పడే వాడినో!

కాలేజీకి టైం అవుతోంది

సరే! ఇవాళ కాలేజీకి పోకపోతే యేం పోయిందిలే అని ఓ లీవ్ లెటర్ వ్రాసి, స్కూలుకు పోబోతున్న మావాడి కిచ్చి, కాలేజీలో ఇవ్వమని చెప్పి పంపాను

మావాడు వాకిటి దాకా వెళ్ళి మళ్ళా వెనక్కి వచ్చి, 'నాన్నా! మీ కోసం ఎవరో వచ్చారు!" అని చెప్పి మరీ వెళ్ళాడు నేను వాకిట్లోకి పోయాను

ఒక నడికారు పురుషుడూ, నలుగురు ఆడవాళ్ళూ ఒక పిల్లవాడూ ఉన్నారు వాళ్ల శరీరాలు కాయకష్టం చేత కమిలిపోయి మొరటుగా కనబడు తున్నాయి అంతా ఉతికిన నీరు కావి బట్టలు

# పోష్యం

## ప్రతిపర్ల సాంబశివరావు

కట్టుకొని ఉన్నారు.

"మాది మల్లాయ పాలెం!" ఆ పురుషుడన్నాడు.

నాకు అర్థమైంది. ఇప్పుడీ నాటకాలు ఏ వూళ్లోనైనా చూడవచ్చు ఇల్లు తగలబడి పోయిందనో, వరద లొచ్చాయనో, కరువొచ్చిందనో చెప్పి అడుక్కునే ముఠాలు ఎక్కువయ్యాయి. వీళ్లను ప్రోత్సహించ కూడదు

"మా యింటి పేరు. " అని ఆ వ్యక్తి వాళ్ల యింటి పేరు చెప్పాడు.

మా యింటి పేరే అది!

మా వాళ్లే నన్నమాట! ఇంకా నయం తొందరపడి తిట్టలేదు.

"నా పేరు బసవయ్య!" అన్నాడు ఆ వ్యక్తి.

వాళ్లని లోనికి రమ్మన్నాను. బసవయ్య వెంట వచ్చిన ఆడవాళ్ళు భయపడుతూ భయపడుతూ లోనికి వచ్చారు

నాలో ఏమూలో ఇంకా సందేహం పీడిస్తూనే ఉంది. ఇదొక నాటకమేమో! ఇప్పుడీరకం మోసాలు గూడా ఉన్నాయి. వివరాలు తెలుసుకొని, దూరపు బంధువులం అని చెప్పి, ఇంట్లో చేరి, సమయం చూచి ఇల్లు దోచుకొని పోవడం, అడ్డు వస్తే చంపడం

ఈ భావం రాగానే మళ్ళా నా ముఖంలో రంగులు మారాయి

మావిడ ఇదంతా చూస్తూనే ఉంది ఆమె ముఖంలో వీళ్ల యెడ అనాదర భావం స్పష్టమవుతూనే ఉంది.

నా మౌనాన్ని ఏవిధంగా అర్థం చేసుకున్నాడో గాని బసవయ్యే మళ్ళీ మాట్లాడటం మొదలు పెట్టాడు.

"నువ్వు మల్లికార్జునుడి కొడుకువు కాదం టయ్యా?"

'అవును!"

నువ్వు అని సంబోధించడంలో ఆయన ఎంతో ఆత్మీయత కనబరుస్తున్నా నా కెందుకో చికాకని పించింది. వెధవది పదహారేళ్ల కుర్రాణ్ణి గూడా మా కాలేజీలో ఏమండీ అని పిలుస్తాం ఇంత పెద్దవాణ్ణి, అందునా లెక్చరర్ని పట్టుకొని నువ్వు అంటాడేమిటీ ఈ పల్లెటూరి రైతు

"నీ తాత సాంబయ్య దగ్గరికి నేను పదేళ్ల పిలగాడిగా ఉన్నప్పుడు మా అయ్యతో కలిసి వచ్చాను!"

బసవయ్య పక్కనున్న పిల్లాడికి ఏడెనిమి దేళ్ళుంటాయి. వాడు బసవయ్య చేతిని గిల్లి, "అయ్యా! నీళ్ళు!" అన్నాడు.

వాడి ముఖం చూశాను ఆ పిల్లాడి పెదవులు ఎండిపోయి వున్నాయి. కళ్ళు లోనికి పీక్కుపోయి వున్నాయి నేను మావిడ వైపు చూశాను లోనికి పోయి ప్లాస్టిక్ గ్లాసుతో నీళ్ళు తెచ్చి యిచ్చింది.

అది పనివాళ్లకు నీళ్ళు ఇవ్వడానికి ప్రత్యేకంగా కేటాయించిన గ్లాసు.

"మల్లికార్జును డేడీ?"

మా నాన్నను గూర్చి అడుగుతున్నాడు బసవయ్య.

"లేడు! మా నాన్న చనిపోయి పదేళ్ళు కావస్తుంది!"

బసవయ్య కళ్ల నుంచి బొటబొటా కన్నీళ్ళు రాలాయి.

ఆయన ప్రశ్నలూ, నా సమాధానాలకు అతని ముఖంలో కలుగుతున్న మార్పులూ నా మీద, ప్రభావం చూపాయి.

"మీ నాయన నాకంటే నాలుగైదేళ్ళు పెద్ద. అప్పు డొచ్చినప్పుడు మీ నాయనా నేనూ సొంత అన్నదమ్ముల్లాగా ఉండేవాళ్లం!" కళ్ళు తుడుచుకుంటూ బసవయ్య అన్నాడు.

నేనేమీ మాట్లాడకపోతే బావుండదని, "వీళ్ళెవరు?" అని ప్రశ్నించాను.

"నా అప్పచెల్లెళ్ళు. వీడు నా ఒక్కగా నొక్క కొడుకు ఈ పిల్లోడి అమ్మ ఊరి దగ్గరే ఉంది!"

నేనేమీ మాట్లాడ లేదు.

"కోటప్ప కొండ తిరణాలకు వచ్చాం– ఎట్లాగూ ఇంత దూరం వచ్చాం గదా అని మనోళ్లని చూసినట్లుంటది గదా అని ఇటొచ్చాం! పాత బస్టాండు దగ్గర దిగి పశువుల ఆసుపత్రి మీదగా, వంతెన్న కిందగా ఇటు వచ్చాం. నా చిన్నప్పు డొచ్చిన దారి యిదే గాని, చుట్టూ ఇళ్ళు మాత్రం గుర్తు పట్టడానికి వీల్లేకుండా ఉన్నయ్!"

నలభయ్యేళ్ల క్రిందటి గుంటూరుకి ఇప్పటి గుంటూరికి పోలికే లేదు. వీళ్లే గనక వోవర్ బ్రిడ్జి మీదగా వచ్చి ఉన్నట్లయితే మా యిల్లు తెలిసేదే కాదు.

క్రమంగా నాకు కొన్ని విషయాలు గుర్తుకు వచ్చాయి. మా నాన్న అప్పుడప్పుడు అంటూ వుండేవాడు మల్లాయపాలెంలో మనవాళ్ళున్నారని. తన చిన్ననాడు అక్కడికీ ఇక్కడికీ రాకపోక లుండేవని గూడా చెబుతూ ఉండేవాడు. బహుశా తాతయ్య పోయిన తరువాత వాళ్ల సంగతి పట్టించుకునే వాళ్ళు లేక ఆ సంబంధం తెగిపోయి వుంటుంది.

"మీ తాత ఎంత మంచోడు. చుట్టాలంటే పడి చచ్చేవోడు. ఆ రోజుల్లో ఆయన కొంత దూరం రైలు మీదా కొంతదూరం నల్లమల అడవుల్లో నడిచీ ఎన్నో కష్టాలు పడి మా వూరికి చేరేవాడు మీ తాతా, మా నాయనా అన్నదమ్ముల పిల్లలు!" బసవయ్య ఈ చివరిమాట అనగానే నా మనసు పూర్తిగా మారి పోయింది

ఈ బసవయ్య మాకు ఇంత దగ్గర చుట్టమా! ఇంత కాలం నా భార్య తరపు చుట్టాలనే గాని మా నాన్న తరపు చుట్టాలను ఎరుగని నాకు ఈ మాటలు అమృతసేచన మయ్యాయి.

బసవయ్యమీద నాకు అభిమానం కలిగింది.

"మీ తాత మా వూరికి వచ్చేసరికి నేను ఆడుకుంటూ ఉండేవాణ్ణి నన్నెత్తుకొని అక్కడే కూలబడి అదేపనిగా ఏడిసేవాడు మీ తాత ఆయనకు సుట్టాలంటే అంత యిది!"

గత కాలపు స్మృతులతో బసవయ్య చలించిపోయి గద్గద స్వరంతో మాట్లాడలేక పోయాడు. ఆయన వెంట వచ్చిన ఆడవాళ్ళు కళ్ళు తుడుచు కుంటున్నారు.

మావిడ ఆశ్చర్యంతో చూస్తోంది.

చఛ! ఎంత తప్పు చేశాను! ఇంత ఆత్మీయులను

దొంగల్లాగా చూశానే!

నన్ను నేనే నిందించు కున్నాను. నా భావాన్ని గ్రహించి మావిడ ఆ ఆడవాళ్లను లోనికి తీసుకొని పోయింది.

నేను బసవయ్యను నా మంచం మీద కూర్చోబెట్టాను. ఆ పిల్లాణ్ణి నా ఒడిలో కూర్చోబెట్టు కున్నాను.

"అసలు మనదంతా ఒకటే కుదురుకదంటయ్యా! మనది అసలు నెల్లూరు దగ్గర. అయితే మా తాత పెద్ద మడిసిగా అందరికీ అద్దం వుండి అప్పు లిప్పించాడంట. మాటంటే పడే మడిసి గాదు అయన. అప్పులన్నీ ఎగ్గొట్టగా, అప్పులిచ్చిన వాళ్ళు అనే మాటలు పడలేక అద్దం వున్న నేరానిగ్గాను ఆస్తులన్నీ వాళ్లకే ఇచ్చేసి, ఆ వూళ్లో ఉండలేక బతుకుతెరువు ఎతుక్కుంటూ నందేల దగ్గరకు వచ్చారు. అక్కడే మల్లా యపాలెంలో మా నాయన స్థిరపడ్డాడు. మీ తాతావాళ్లేమో ఇక్కడ కొచ్చారు!"

ఎక్కడి కెక్కడ? ఎవరి కెవరు?

ఇంత దగ్గరి బంధువులు కూడా ఒకళ్ల నొకళ్ళు గుర్తు పట్టే స్థితి గూడా లేకుండా పోయిందే!

"ఇన్నాళ్ల నుండీ ఎందుకు రాలేదు?" వాళ్లను తప్పుపడుతూ ప్రశ్నించాను.

"అక్కడ నాకు దిక్కా మొక్కా? నలుగురు అక్క జెల్లెళ్ళు! వాళ్ల మంచీ చెడూ అంతా నేనే చూడాలా! మన యింటి పేరిటోళ్లెవరూ అక్కడ లేరాయె! నిమిషం తీరిక దొరకదు. అంతా కరువు మా పక్క. నాలుగైదేళ్ల కొకసారి వాన కురుస్తుంది. ఆ గింజలతోనే సంసారం నెట్టకొస్తున్నాను! ఇంకెప్పుడు వచ్చేది?"

వాళ్ళు ఇంత కాలమూ ఎందుకు రాలేదని అడిగినందుకు సిగ్గు పడ్డా! అన్నీ బాగున్న నేనెప్పుడన్నా వీళ్ల సంగతి ఆచూకీ తీశానా? చివరికి వచ్చిందీ వాళ్లే!

ఈ ఆలోచన రాగానే వాళ్లమీద ప్రేమాభిమానాలు అధిక మయ్యాయి నాకు మాత్రం ఇక్క డెవరున్నారు?

"నాకు ఒక్కగా నొక్కడు ఈ పిలగాడు వీణ్ణి ఎట్లాగైనా సదివించుకోవాల! అక్కడైతే వీడేమౌతాడో !" ఆపైన చెప్పలేక బసవయ్య మౌనం వహించాడు

నా జీవితంలో ఇన్నాళ్ళు నేను పోగొట్టుకొన్న దేమిటో నాకు అర్థమైంది కష్ట సుఖాలను హృదయం విప్పి చెప్పుకునే ఆత్మీయులైన వీళ్లే నాకు నిజమైన బంధువులు పైగా మా యింటి పేరిటవాళ్ళు! వాళ్లకు సకల మర్యాదలు చేశాను

అంతా స్నానాలు చేసి వచ్చారు కలిసి భోజనం చేశాము

నేను బసవయ్య గోళ్ళు చూశాను. అంతా నా గోళ్ల మాదిరిగానే ఉన్నాయి. కాకపోతే కాయకష్టం చేసే ఆ వేళ్ళు మాత్రం నా వేళ్లలాగా సుకుమారంగా లేవు. తల వెంట్రుకలు మాత్రం అచ్చం నా తల వెంట్రుకల మాదిరిగానే ఉన్నాయి. ఇక ఆ పిల్లాడిని చూస్తుంటే మా వాడి పోలిక లెన్నో వాడిలో





కనుపించాయి

ఆయన మనసులో ఉన్న కష్టాలను సుఖాలను చెప్పుకు పోతున్నాడు

నేనూ అంతే!

ఎప్పుడూ ముక్తసరిగా మాట్లాడే నేను ఇలా మనసు విప్పి అన్నీ మాట్లాడటం చూచి మావిడ ఆశ్చర్య పోయింది

తరతరాల నాటి బంధుత్వం మాది ఇన్నాళ్ళికి కలిశాం ఆడవాళ్ళూ బాగా కలిసిపోయారు వాళ్ళందరికీ సెవంటీ యం యం ఎసి సినిమా హాల్లో ఆడుతున్న తెలుగు సినిమా చూపించాను

రెండు రోజులుండి వాళ్ళు తిరిగి ప్రయాణానికి సిద్ధపడ్డారు ఇంకో రెండు రోజు లుండమని ఎంత బతిమిలాడినా వినలేదు ఆడవాళ్ళందరికీ జాకెట్లు ముక్కలూ, పసుపు కుంకుమలూ, పూలూ, పండ్లూ ఇచ్చాం రైల్వేస్టేషనుకు పోయి అందరికీ వీడ్కోలు చెప్పాను

నన్ను వాళ్ల ఊరు రమ్మని మరీమరీ చెప్పి, కళ్ళు తుడుచుకుంటూ రైలెక్కారు వాళ్ళు

తొందర లోనే వాళ్ల వూరికి పోయే అవకాశం వచ్చింది నాకు

సమ్మె!

అధ్యాపకులు తమ ముప్పయ్యేడు కోరికలను తీర్చాలిసిందేనని సమ్మె మొదలు పెట్టారు పబ్లిక్ పరీక్షల ముందు సమ్మె చేస్తే ప్రభుత్వం చచ్చినట్లు లొంగిపోయి కాళ్ళ బేరానికి వస్తుందని మా నాయకుల నమ్మకం.

మల్లాయపాలెం పోయి రావడానికి ఇదే మంచి సమయం సెలవు పెట్ట నవసరం లేకుండానే ఇష్ట మొచ్చినన్ని రోజులు గడపవచ్చు అదేమంటే సమ్మెలో ఉన్నామనవచ్చు

కొంత దూరం రైలు ప్రయాణం మరికొంత దూరం బస్సులో నాలుగైదు మైళ్ళు కాలినడక చివరకు ఎలాగో మల్లాయపాలెం చేరుకున్నా

ఇప్పుడే ఆ ఊరికి చేరడం ఇంత కష్టంగా ఉందే! మరి మా తాతయ్య ఎంత కష్టపడి ఆ రోజుల్లో ఈ ఊరికి చేరేవాడో! ఆ నాటి ఆత్మీయతలు అటువంటివి

పట్నవాసపు మురికి జీవితంతో విసిగి పోయిన నేను ఈ పల్లెలో ప్రశాంతంగా పది రోజులు గడపాలని నిశ్చయించుకున్నాను

నేను వెళ్లేసరికి బసవయ్య వాళ్ల ఇంట్లో ఎవరో ముసలమ్మ ఉంది

నాపేరూ ఊరూ చెప్పాను

ఆమె యెంతో సంబరపడి కాళ్లకు నీళ్ళిచ్చింది నులక మంచం వాల్చి, దుప్పటి వేసి కూర్చో బెట్టింది ఆమె బసవయ్య చిన్నమ్మ అని మాటల సందర్భంలో తెలిసింది

'ఎక్కడకు వెళ్లారు వీళ్లంతా? అన్నాను ఆమె కాసేపు తటపటాయించి, చివరకు చెప్పింది

ఆ వూరికి పన్నెండు మైళ్ల దూరంలో నల్లమల అడవి వుంది. ఇంట్లో వాళ్లందరూ అడవిలో ఆకులు తేవడానికి పోయారు ఆ ఆకులతో




## నిర్ణయం

విస్తరాకులు కుడతారు వంద విస్తరాకులకు మూడు రూపాయ లిచ్చి దళారీలు ఇక్కడ నుండి వాటిని తీసుకొని పోతారు

నాలుగేళ్ల నుండీ ఆ ప్రక్క వర్షాలు లేవు చేయడానికి పనులు లేవు మేతలేక గొడ్లు వట్టిపోయాయి, ఇంటిల్లిపాదీ ఈ విస్తరాకుల పని మీద ఉంటేగానీ ఇల్లు గడవదు.

వాళ్ల దుర్భర పరిస్థితి వింటుంటే నాకు వణుకు పుట్టింది

నెలకు మూడు వేల రూపాయలు జీతం వస్తుంటే అవి చాలవని పది పెంచండీ, పరక పెంచండీ అని మేము ఆమరణ నిరాహార దీక్షలు చేస్తున్నాం

మరి వీళ్ళు ఎవరిమీద సమ్మె చేయాలి? ఒక్క రోజు అడవికి పోకపోతే అంతా మలమలమాడి పోతారు

ఇటువంటి దుర్భర స్థితిలో ఉండి గూడా వాళ్లే మా వూరు వచ్చి నన్ను చూచి వెళ్లారు అన్నీ ఉండి కూడా నేను నా కుటుంబం సంగతే తప్ప ఈ బంధువుల సంగతే పట్టించుకో లేదు

ఏమిటి చదువు వలన ప్రయోజనం? తెలివిగా తమ వాదాలను సమర్థించు కోవడానికి, ఎక్కువ డబ్బు సంపాదించు కోవడానికి, ఇతరులను మోసం చేయడానికి పనికి వస్తుందే తప్ప పొరుగు వాడికి తోడు పడటానికి ఏమైనా పనికి వస్తుందా?

మేధావులను బజారున పడవేయ వద్దు అని మా నాయకులు రోజూ ఉపన్యాసా లిస్తున్నారు సాటి మనుషులు కరువుతో అల్లాడి పోతుంటే, మూడు వేలు జీతం చాలదని సమ్మె చేయడమేనా మేధావి తనం?

నాకు సిగ్గు వేసింది

వీళ్ల కోసం నేనేం చేయగలను . .

"ఈ పాటికి తిరిగి బయలుదేరే వుంటారు!" ముసలమ్మ అన్నది

వెచ్చగా గాలి వీస్తోంది వడగాలి ఇక్కడ చాలా ఎక్కువగా వుంది అది పూరిల్లు గాబట్టి సరిపోయింది టైం చూశాను. రెండయింది

ఇంత మండు టెండలో పన్నెండు మైళ్ళు నడిచి రావాలా వాళ్ళు?

రెండు మైళ్ల దూరంలో ఉన్న కాలేజీకి పోవడానికి కారు లేదే అని బాధపడిన నాకూ, కాలే కడుపులతో మండు టెండలో మైళ్లకొలదీ నడిచే వీళ్లకూ ఎంత వ్యత్యాసం!

మాకు వానొస్తే సెలవు ఎండ ఎక్కువగా ఉన్నా సెలవే! ఛస్తే సెలవు పుడితే సెలవు

మరి వీళ్లకి?

ఏ లేబర్‌యాక్ట్ వీళ్లని రక్షిస్తుంది?

ఒక్క రోజు సెలవు తీసుకుంటే ఏ యూనియన్ వీళ్లకి అన్నం పెడుతుంది

ఇలాంటి ఆలోచనలతో నే సాయంత్రం అయింది

మా వాళ్లంతా నెత్తి మీద మూటలతో ఇంటికి వచ్చారు

నన్ను చూచి బసవయ్య పరమానందభరితు డయ్యాడు

ఎప్పుడో తెల్లవారు జామున వెళ్ళిన మనిషి అందులోనూ ముసలివాడు తన కష్టమంతా క్షణంలో మరచిపోయి నన్ను ఆప్యాయంగా కుశల ప్రశ్నలు అడుగు తున్నాడు

బసవయ్య భార్య కొడుకును వెంట బెట్టుకొని పోయి, ఊరవతల ఉన్న బావి నుండి గబగబా నీరు తెచ్చి గాబునిండా పోసింది అడవి పుల్లలతో నీళ్లు కాగబెట్టి, నన్ను స్నానానికి పిలిచారు

నా వలన ఇవాళ వీళ్లకు అదనపు శ్రమ కలుగుతున్నందుకు నొచ్చుకుంటూ స్నానం ముగించాను

నా కోసం వరి అన్నం వండారు వాళ్ళు రోజూ తినే జొన్న సంగటే నాకు కూడా పెట్టమంటే బసవయ్య భార్య అందుకు ఒప్పుకోలేదు

మెట్ట పంట అవడం వలన వరి అన్నం సువాసన వేస్తోంది పప్పుచారు కలుపుకొని అమృతోపమానంగా భోజనం చేశాను చేయి కడుక్కున్న తరువాత వద్దన్నా వినకుండా బసవయ్య కండువాతో నా చేతిని తుడిచాడు

నా కళ్ళు చెమ్మగిల్లాయి

వాళ్ల ఆదరణ నన్ను వివశుణ్ణి గావించింది

ఏమిటి మన నాగరికత? ఇంటికి వచ్చిన వాళ్లను దొంగలని అనుమానించామే!

మరి ఇక్కడ? ఈ మారు మూల గ్రామంలో నిరక్షరాస్యుల్లో ఉన్న సంస్కారం, ప్రేమాభిమానాలూ హృదయాన్ని ఆర్ద్రం చేస్తున్నాయి.

మరునటి రోజు వాళ్ళు ఆకులు తేవడానికి అడవికి పోలేదు.

రెక్కాడనిదే డొక్కాడని పేదలు వీళ్ళు!

# సినిమా రంజని

మీయింటిల్లపాదికీ
నవరసాల విందు!



ఆంధ్రుల అభిమాన సంస్థ

ఆంధ్రపత్రిక నుంచి

వారం! వారం!! సుమచిత్రహారం సినిమా రంజని!!

వీళ్లకి కాజువల్ లీవులు లేవు! మెడికల్ లీవులు ఉండవు! ఎరన్ లీవ్, స్పెషల్ లీవ్, పబ్లిక్ హాలిడేస్, నెగోషియబుల్ హాలిడేస్ , ఏ లీవులూ లేవు

ఇవన్నీ వున్న వాళ్లకే, సెలవులు, సమ్మెలు!

నా పరిస్థితి గుర్తుకువచ్చింది

ఆనందంగా పది రోజులు ప్రశాంత ప్రకృతిలో గడపాలనే నా ఆశ వెనుక ఎంత మోసం ఉంది?

నా కోసం వీళ్ళు చేస్తున్న త్యాగం డబ్బుతో కొలవలేనిది

వీళ్ల రుణం తీర్చుకోవడం ఎలా?

నేనిక్కడ ఉంటే వీళ్లను మరింత ఇబ్బంది పెట్టడమే అవుతుంది

తెల్లవారగానే వెళ్ళి పోవాలని వెంటనే నిర్ణయించు కున్నాను

నులక మంచాలు బయట వేశారు అంతా హాయిగా అరు బయట పండుకున్నాం

పున్నమి వెన్నెల దిగంతాల దాకా వ్యాపించి వుంది

పగలంతా వాతావరణం మండి పోతూ ఉన్నా, సాయంకాలానికి చల్లబడి పోయింది

బసవయ్య కాసేపు తన బాల్య స్మృతులను వర్ణించాడు

" . నా కొక్కటే దిగులుందయ్యా!ఒక్కగా నొక్క కొడుకు నాకు! వాడికి ఆరోగ్యం బాగుండదు ఇక్కడ మంచి డాక్టర్లు గూడా లేరు. చదువూ అబ్బటం లేదు ఎంత ఖర్చయినా, ఎంత కష్టమైనా ఫరవా

# నిర్ణయం

లేదు వాణ్ణి కాలేజీ చదువు చదివించాలి! మన యింటి పేరిట వాళ్ళు ఇక్క డెవరూ లేరు నా తరవాత వాడికి ఇక్కడ ఏక్కూ మొక్కూ ఉండదేమో !"

బసవయ్య గొంతు గాద్గదికమైంది

నేను పలక లేదు

'నిద్రపో! ప్రయాణం చేసి వచ్చావేమో పాపం అలవాటు లేని వాడివి నడవటం కష్టమే! ఈసారి వచ్చేటప్పుడు ముందు ఓ కార్డుముక్క రాస్తే ఎడ్లబండి కట్టుకొని బస్టాండుకు వస్తాం "

అనురాగ సూచకంగా ఇలాంటి మాటలు మాట్లాడుతూ బసవయ్య నిద్రలో కి జారుకున్నాడు

నాకు మాత్రం చాలా సేపు నిద్ర పట్టలేదు

దేశంలో, ఇలాంటి కష్టజీవులంతా పిల్లలమీద ఎన్ని ఆశలు పెట్టుకొని జీవిస్తున్నారో కాయకష్టం చేసి పిల్లలను వీళ్ళు చదివిస్తున్నారు

మరి మేము? పరీక్షల ముందు సమ్మెలు చేస్తున్నాం. విద్యార్థుల జీవితాలతో ఆటలాడు తున్నాం.

తెలియని వాళ్ల సంగతి సరే! ఈ పరిస్థితులన్నీ ప్రత్యక్షంగా చూచిన తరువాత గూడా నేను సమ్మెలో పాల్గొనడం న్యాయమా? పాల్గొన గూడదు!

పొద్దున్నే బసవయ్య కొడుకు ఒక మంచి లేత వేపపుల్ల తెచ్చాడు నేను చేతితో అందుకోబోతే, ఒడి పట్టండి!" అని నా ఒడిలో వేపపుల్ల వేసి పోయాడు

అవును మన అచార వ్యవహారాలు నాకంటే ఈ పిల్లాడికే బాగా తెలుసు.

"బాగా నిద్ర పట్టిందా?" అంటూ బసవయ్య పళ్ళు తోముకుంటూ వచ్చి ప్రశ్నించాడు

నేను ఆ ప్రశ్నకు బదులు చెప్పకుండా, "నేను ఊరికి వెళుతున్నాను!' అన్నాను

బసవయ్య ఆశ్చర్యపడ్డాడు, బాధ పడ్డాడు. 'పేదవాళ్లం నీకు తగిన మర్యాదలు చేయలేం" అన్నాడు

"ఛఛ! అదేం కాదు! సెలవల్లోవు ఈసారి వచ్చినప్పుడు పది రోజులుంటా!" అన్నాను

బసవయ్య ఏం మాట్లాడలేదు

నేను ఒక నిర్ణయానికి వచ్చాను

మీ అబ్బాయిని నా వెంట పంపండి మా యింట్లోనే ఉంచి చదివిస్తా!' అన్నాను.

బసవయ్య ఆనందాతిశయంతో తల మునక లవుతూ ఆర్ద్ర నేత్రాలతో నా వైపు చూశాడు

"అరేయ్! బాబూ! బట్టలు సర్దుకో వెళదాం!' అన్నాన్నేను

ఆ పిల్లాడి కన్నుల్లో వెల్లివిరిసిన కాంతిని చూచి చెప్పలేని ఆనందానుభూతితో నా మనసు నిండిపోయింది □



"చాణక్య శపథం" లో చిరంజీవి, విజయశాంతి

## తెలుగు సినీ కళాకారుల సంఘం అధ్యక్షులుగా కృష్ణంరాజు

నవంబర్ 9 న జరిగిన తెలుగు సినీ కళాకారుల సంఘం సర్వసభ్య సమావేశంలో ఈ ఏడు కూడా కృష్ణంరాజు అధ్యక్షులుగా ఏకగ్రీవంగా ఎన్నికయ్యారు. ఉపాధ్యక్షులు: డాక్టర్ ఎం. ప్రభాకర రెడ్డి, కార్యదర్శి: రాళ్ళబండి కామేశ్వరరావు. కోశాధికారి: మురళీమోహన్. కార్యవర్గ సభ్యులు: మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి, సారథి, జగ్గారావు, ఆనంద మోహన్, అశోక్ కుమార్, వీరభద్రరావు, మల్లికార్జునరావు, శ్యాంకుమార్, పాలారావు, రమేష్ నాయుడు, జయశీల.

## డిసెంబర్ 18న "చాణక్య శపథం"

కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో కస్టమ్స్ ఆఫీసర్ చాణక్యగా చిరంజీవి, ఎర్ హోస్టెస్‌గా విజయశాంతి, 'రాణా'గా ఒక విశిష్టమైన పాత్రలో రావుగోపాలరావు, రిటైర్డ్ మేజర్‌గా సత్యనారాయణ, ఇంకా రంగనాథ్, వేలు, చలపతిరావు, సుధా, ఈశ్వరరావు, చిట్టిబాబు, అప్పారావు, అన్నపూర్ణ, రాజ్యలక్ష్మి, వై. విజయ మున్నగు వారు నటించిన టి. వి. ఎస్. ప్రొడక్షన్స్ వారి ఈ భారీ చిత్రం డిసెంబర్ 18న విడుదలవుతుంది. పరుచూరి సోదరులు కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలు, చక్రవర్తి సంగీతం, కె. ఎస్. ప్రకాష్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, విజయన్ పోరాటాలు, సలీం నృత్యాలు, ఆనందకుమార్ సంయుక్త దర్శకత్వం, గోపాలకృష్ణ – రామారావు ప్రొడక్షన్‌తో టి. వి. వి. రాజు, టి. వి. కె. రాజు సహ నిర్మాతలు. టి. వి. ఎస్. రాజు నిర్మాత.

## "జైలుపక్షి"లో వసపిట్ట

"అత్తయ్యా!" అని దుర్గ (రాధిక) పలకరించేసరికి తులసమ్మ (నిర్మల) తృళ్ళిపడింది. "నువ్వా! ఈ వరసేంటి? సంబంధంలేని ఆ వరసేంటి?" అంది.

"వరసల్లో పలవకపోతే మనకి నోరు తిరగదు. జడ్జిగారిని బాబాయిగారూ – అని పిలుస్తాను. సి. ఐ. గార్ని అన్నయ్యా – అని పిలుస్తాను. జైలర్‌ని మరిదిగారూ – అని పిలుస్తాను. కానిస్టేబుల్స్



సినిమా

అందరూ మా సోదరులు." అంది దుర్గ.

పక్కనే ఉన్న భవాని (బేబీ శాలిని) "మరి ... మా డాడీని ఏమని పిలుస్తావ్?" అంది.

"బావగారూ అని పిలుస్తాను." అని దుర్గ చెప్పేసరికి తులసమ్మకు కోపం ఆగిందికాదు. "ఛీ! సిగ్గుమాలినదానా! రోజుకోసారి జైలుకెళ్ళొచ్చే నువ్వు నా కొడుకుని బావా అని పిలుస్తావా?" అని గద్దించింది.

దాంతో దుర్గ వసపిట్టలా వాగడం మొదలెట్టింది. "అన్నారా? అన్నారా? అదే - నేను ముందే చెప్పాను – నేను మీ ఇంటికి రాను; మీ ఇంట్లో వాళ్ళు నా వాలకం వాగుడు తట్టుకోలేరు. మన వరస లేపో బయట చూసుకుందాం అన్నాను. విన్నారా? లేదు... జైల్లాంటి జైలునుంచి తీసుకొచ్చి, జైలులాంటి



# ...విశేషాలు

-జి. వి. జి.

ఇంట్లో పడేశారు. అంతే... చూడండి. అత్తయ్యగారూ! అదే – అదే... అత్తయ్యంటే మీకు కోప మొస్తుంది. నా గురించి మీరేమి ఆలోచించ నవసరంలేదు; మీ గురించి నేను ఆలోచించ నవసరంలేదు; నాగురించి మీరు బాధపడనక్కర లేదు. మీ గురించి నేను బాధపడనక్కరలేదు... నేను మిమ్మల్ని అత్తయ్యా – అదే – అత్తయ్యా అంటే మళ్ళీ మీకు కోపమొస్తుంది. మిమ్మల్ని అత్తయ్యా అని పిలిచే అవసరం కూడా ఉండదు... వస్తా!" అంటూ కదిలింది.

శోభన్‌బాబు హీరో. కోడి రామకృష్ణ స్క్రీన్‌ప్లే దర్శకత్వంలో పి. శశిభూషన్ ఎం. కా. నిర్మించిన శ్రీ సారథి స్టూడియోస్ వారి "జైలుపక్షి" చిత్రానికి పరుచూరి సోదరులు సంభాషణల కర్తలు. ఎస్. గోపాలరెడ్డి, ఛాయ, కె. వి. మహదేవన్ సంగీత దర్శకత్వం నిర్వహించారు.



"బ్రహ్మరాత"లో శత్రుఘ్నసిన్హా, శుభాకర్



"భార్గవరాముడు"లో బాలకృష్ణ, మందాకిని

## "బ్రహ్మరాత"లో శత్రుఘ్నసిన్హా

"సుప్రసిద్ధ హిందీ విలక్షణ నటుడు శత్రుఘ్నసిన్హా హీరోగా నటిస్తున్న తొలిచిత్రమిదే." అన్నారు శుభాకర్. ఈయన నటిస్తూ, కథ, స్క్రీన్‌ప్లే, మాటలు, దర్శకత్వ భారాలు కూడా వహించే వి. ఆర్. ఎం. క్రియేషన్స్ వారిది 70 ఎం. ఎం. స్టీరియో ఫోనిక్ సౌండ్ చిత్రంలో మయూరి సుధ, పరమేశ్, గిరిబాబు, సుస్మిత, పద్మనాభం, లక్ష్మి, ఒక ఆఫ్ఘన్ ఆర్టిస్టు కూడా పాల్గొంటున్నారు. వేటూరి పాటలు, బప్పీ సంగీతం, ధర్మా ఛాయతో వి. ఆర్. మోహన్‌రాం, ఎస్. రామచంద్రనాయుడు నిర్మాతలు.

## డైరెక్టర్ కోదండరామిరెడ్డి కొత్త చిత్రాలు

శ్రీదేవి సొంత చిత్రం డిసెంబర్‌లో సెట్స్‌కు వెళ్తుంది. దీనికి పంజా అరుణాచలం కథకుడు. ఈ నెలలోనే పట్టి సుబ్బారావు ప్రారంభించే చిత్రంలో కృష్ణంరాజు హీరో. జనవరి నుంచి అల్లు అరవింద్ నిర్మించే చిత్రంలో చిరంజీవి సరసన శ్రీదేవి నాయిక. ఫిబ్రవరిలో క్రాంతి సత్యనారాయణ మొదలెట్టే చిత్రంలో కృష్ణ హీరో. ఏప్రిల్‌లో రోజామూవీస్ అర్జునరాజు నిర్మించే చిత్రంలో చిరంజీవి హీరో. ఈ హీరో తోనే టి. త్రివిక్రమరావు జూన్‌లో మొదలెట్టే చిత్రం "దొంగమొగుడు". జూన్ చివరలో డి. వి. ఎస్. రాజు ప్రారంభించే చిత్రంలో బాలకృష్ణ హీరో. బాలకృష్ణతోనే అక్టోబర్‌లో నెల్లూరీయుల చిత్రానికి అంకురార్పణ జరుగుతుంది. 1987 చివరన బాలకృష్ణ సొంత చిత్రం కాక వెంకటేశ్, నాగార్జున, కమలహాసన్‌లతో చిత్రాలు కూడా ఉంటాయి.



"పూజకు పనికిరాని పువ్వు"లో కె. కె. శర్మ, తులసి, కాశీ విశ్వనాధ్

## 'పూజకు పనికిరాని పువ్వు'లో తాడుతెగిన గాలిపటం

జీవితం తెగిన గాలిపటం అయిపోయిన తర్వాత గాలి ఎటు తోస్తే అటుపోక తప్పదు. శ్రీదేవి పనికూడా అంతే అయింది. తన యిష్టాయిష్టాల ప్రమేయం లేకుండానే యమకూపంలాంటి గఫూర్ కంపెంలో చిక్కుకుపోయి అంగడి సరుకులాగా మారిపోయింది. తన దగ్గరకు వచ్చే కస్టమర్స్‌ని

ంతోష పెట్టడమేగాక, కస్టమర్స్ వున్నచోటికి వెళ్లక తప్పటం లేదా అభాగ్యురాలికి.

ఎమర్జన్సీ టైములో కొంతకాలం నాలుగు సినిమా హాళ్ళు చెప్పిన వ్యభిచారం సాగించిన చక్రవర్తులు. ఒక్కో రోజుకు నాలుగాటలు (ప్రొప్రయిటరు) అయిన వరహాల్రాజుగారికోసం. రిక్షావాడు శ్రీదేవిని తీసుకొచ్చి గెస్టుహౌస్‌లో దింపాడు. శ్రీదేవిని చూడగానే వరహాల్రాజు గుమ్మయిపోయాడు – రెండువందల ఖరీదుచేసే విస్కీ సీసాలో లేని నిషా, నీ రెండు కళ్లలోనూ పెట్టేశాడా భగవంతుడు! –" అంటూ ఓ గ్లాసులో విస్కీపోసి సోడాకలిపి శ్రీదేవికి అందిస్తే "వద్దండు..." అంది.

చూడు – సిగ్గు అనే పదార్థం మీ బాడీలకి సూటవదుగాని నామాట విని మందేస్కో –" అంటూ శ్రీదేవిచేత బలవంతంగా తాగిస్తాడు. తర్వాత – "ప్పుడు చూడు నీ వొళ్ళు రైలు ఇంజన్‌లాగా కీజాట ఎలా హీట్ అవుతుందో –" అంటూ అమెను దగ్గరకు తీసుకున్నాడు.

## సినిమా

ఇంత జరుగుతున్నా యిన్ని చేదు అనుభవాలు ఎదురవుతున్నా మనుషులపై ఇంకా నమ్మకం తగ్గని శ్రీదేవి – "నేనంటే మీకు అంత యిష్టమైనపుడు నాకూ యీ జీవితం యిష్టం లేదు – నన్ను మీ మనిషిగా, కనీసం మీ పనిమనిషిగానైనా మీ యింట్లో వుండనివ్వరాదూ –" అని అడుగుతుంది. ఆ మాటలకు వరహాల్రాజు –" అహహ –" అంటూ నవ్వుతూ –" నా మనసు సినిమా హాలు తెరలాంటిది – దానిమీద అనేకమైన ఆడబొమ్మలు వచ్చి ఆడిపోతుంటాయి. ఏ బొమ్మా యీ తెరమీద పర్మినెంటుగా వుండిపోకూడదే – తప్పుకదూ యింకెప్పుడూ అలా అడక్కమ్మా –" అంటూ ఓ గొప్ప జీవిత సత్యాన్ని శ్రీదేవికి బోధిస్తాడు. శ్రీదేవి అతనివంక నిరాశగా, నిర్లిప్తతగా చూస్తుంది.

ఆ తర్వాత శ్రీదేవి జీవితం ఎన్ని మలుపులు తిరిగింది? – తాడుతెగిన గాలిపటం యింకా ఏ ముళ్ల కంపలో చిక్కుకుంటుంది వగైరా వివరాలన్ని "పూజకు పనికిరాని పువ్వు" చిత్రంలో తెలుస్తాయి ఉషాకిరణ్ మూవీస్‌వారి సరికొత్త చిత్రం "పూజకు పనికిరాని పువ్వు" త్వరలోనే ఆంధ్ర దేశమంతటా విడుదల కానున్నది.

తులసి, శేఖర్ సుమన్ (ఉత్సవ్ ఫేం), కోట శ్రీనివాసరావు, చలపతిరావు, హరిప్రసాద్, బాలాజీ, కె కె. శర్మ, మాడా, రాజ్యలక్ష్మి, ప్రమీల, వై. విజయ ముఖ్య తారాగణం నటించే ఈ చిత్రంలో వేలు రాళ్లపల్లి, వీరభద్రరావు, కాశీ విశ్వనాధ్ అతిథి పాత్రల్లో నటిస్తున్నారు.

కథ, మాటలు: కాశీ విశ్వనాధ్, పాటలు: వేటూరి సంగీతం: చక్రవర్తి, కళ: భాస్కరరాజు. కూర్పు గౌతంరాజు, నిర్మాణ నిర్వహణ: అట్లూరి రామారావు, నిర్మాత: రామోజీరావు.

నీ హాస్య నవల సినిమా తియ్యాలా?
ఏం, నేనంటే నవ్వులాటగా వుందా??



రాజలక్ష్మీ మూవీస్

# శాంతినివాసం

స్క్రీన్ ప్లే దర్శకత్వం జి.రామ్మోహనరావు

నిర్మాత అంగర సత్యం

Bhaskar

కో-ప్రొడ్యూసర్ అంగర విజయకుమార్

శ్రీ వెంకట లక్ష్మి ఫిలింస్

PP

కథ భీశెట్టి మాటలు సత్యానంద్ సంగీతం చక్రవర్తి ఫొటోగ్రఫీ వియస్ ఆర్.స్వామి కూర్పు ఓ.వెంకటరత్నం కళ బి.చలం ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ దండమూడి కోటేశ్వరరావు

నైజాం శ్రీ కృష్ణా ఎంటర్ ప్రైజెస్, సీడెడ్ R M కంబైన్స్



"జైలు పక్షి"లో వేలు, నూతన్ ప్రసాద్

## దాసరి, నాగార్జునల "మజ్ను" డిసెంబర్ 25న

"ప్రేమలో జరిగిన చిన్న పొరబాటు, ప్రేమికుల హృదయాలలో రేగిన చిన్న అపార్థం ఎంతటి విషమ పరిస్థితులకు దారి తీస్తుందో తెలియజేసే మంజుల, మనోహర ప్రణయకావ్యం. ప్రేమ అజరామరమైనది. దానికి బలి కారణం కారాదు- అనే ఈ సంగీత ప్రధానమైన ఇతివృత్తం నా 94వ చిత్రం. మా తారక ప్రభు ఫిలిమ్స్ 9వ చిత్రం. లక్ష్మీకాంత్ ప్యారేలాల్ సంగీతం ఈ చిత్రానికి మరొక ఎస్సెట్. డిసెంబర్ 25న రిలీజ్," అన్నారు కళా ప్రపూర్ణ దాసరి నారాయణరావు. ఈయన రచన, దర్శకత్వంలో దాసరి పద్మ సమర్పించే "మజ్ను"లో అక్కినేని నాగార్జున, రజని, మున్‌మున్‌సేన్, సత్యనారాయణ, గొల్లపూడి మారుతీరావు, గుమ్మడి, నాగేష్, వేలు, కె. ఆర్. విజయ, షావుకారు జానకి, రమాప్రభ పాత్ర ధారులు. శరత్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, సూరపనేని రాధాకృష్ణ సంయుక్త దర్శకత్వం, తార నృత్యాలు, కృష్ణంరాజు కూర్పు తెర వెనుక హంగులు.

## మద్రాసులో ఎస్. కె. పి. డి. ఆధ్వర్యంలో అఖిలభారత తెలుగు నాటికల పోటీలు

మద్రాసులోని ప్రవాసాంధ్రులకు తెలుగువారి సంస్కృతి పట్ల అభిమానాన్ని పెంపొందింప జేయడానికి ప్రొఫెసర్ డాక్టర్ ఆట్ల సాంబశివయ్య ఏటేటా తెలుగు సాంస్కృతిక వారోత్సవాలను శ్రీ కన్యకా పరమేశ్వరీ దేవస్థానం చారిటీస్ ప్రోత్సాహంతో భారీ ఎత్తున నిర్వహిస్తున్నారు. ఈ మారు 1987 జనవరి 7 నుండి 12 వరకు జరిపే ఈ వారోత్సవాలలో కూచిపూడి నాట్యాలు, జానపద నృత్యాలు,



"శాంతినివాసం"లో సుహాసిని

హరికథలు, బుర్రకథలు, అష్టావధానం, కవి సమ్మేళనం వంటి చక్కని కార్యక్రమాలను, అఖిలభారత స్థాయిలో తెలుగు నాటికల పోటీలను కూడా ఈ సందర్భంగా నిర్వహిస్తారు. వివరాలకు 107 గోవిందప్ప నాయకన్ వీధి, మద్రాసు-1లోని ఎస్. కె. పి. డి. పాఠశాలల సాంస్కృతిక సంఘం విలాసానికి రాయవలసిందిగా అధ్యక్షులు తెలియజేశారు

"డబ్బెవరికి చేదు" లో సీత, పద్మనాభం, రాజేంద్రప్రసాద్



# కళాప్రపూర్ణకి కళాబంధుతో బంధం



విశాఖ కళాభిమానులు కళాప్రపూర్ణ శ్రీ దాసరి నారాయణరావు, కళాబంధు శ్రీ టి. సుబ్బరామి రెడ్డిలను ఒకే పూలహారంతో బంధించారు. దానికి కారణం వుంది. కళాబంధు నిర్మాతగా, కళాప్రపూర్ణ దర్శకుడుగా త్వరలోనే ఒక చిత్రం నిర్మించబోతున్నారు. ఈ చిత్రంలో మరొక కళాప్రపూర్ణుడు శ్రీ అక్కినేని నాగేశ్వరరావు ప్రధాన పాత్ర వహించబోతున్నారు.

దర్శక బ్రహ్మ శ్రీ దాసరి నారాయణరావుకి ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు "కళా ప్రపూర్ణ" గౌరవ బిరుదు ప్రధానం చేసిన సందర్భంగా విశాఖలో కళాభిమానులంతా ఆయన్ని ఘనంగా సన్మానించారు. కళాబంధు శ్రీ సుబ్బరామిరెడ్డి ఈ సన్మాన సభకి సారధ్యం వహించారు.

దర్శక బ్రహ్మ ఈ సభలో ప్రసంగిస్తూ, తనకు విశాఖపట్నానికి విడదీయలేని బంధం ఏర్పడి పోయింది అన్నారు. కారణం– "నా తొలి చిత్రం గోరింటాకు విశాఖపట్నంలో వుండి నిర్మించాను. అది ఎంతో విజయవంతం అయింది. ప్రస్తుతం విజయభేరీ మ్రోగిస్తున్న "తాండ్ర పాపారాయుడు" విశాఖపట్నంలో వుండే నిర్మించాను. నా సేవలు గుర్తించి "కళా ప్రపూర్ణ" బిరుదు నాకు ఈయడం కూడా విశాఖపట్నంలోనే జరిగింది. కనుక నాకు విశాఖపట్నంతో విడదీయలేని బంధం ఏర్పడి పోయింది" అని శ్రీ దాసరి నారాయణరావు అన్నారు. □

"అమెరికా అబ్బాయి" లో చరణ్‌రాజ్, రాధిక



"అజేయుడు" లో వెంకటేష్



# అభిమాన తారలపై అభిప్రాయం

చలన చిత్ర చరిత్రలో తనకంటు ఒక ప్రత్యేక స్థానాన్ని సాధించి, ఆరు సంవత్సరాల బాల బాలికల నుండి అరవై సంవత్సరాల వృద్ధుల వరకు అందరి హృదయాలలో తన నటనతో చెరగని ముద్ర వేసిన నటుడు మా "విజేత" చిరంజీవి. స్టెప్స్‌లోను, ఫైట్స్ లోను మరే నటుడు నిలుపుకోని ప్రత్యేకతను సాధించుకున్న "రాక్షసుడు" మా చిరు.



"ఖైదీ", "దొంగ", "రాక్షసుడు" చిత్రాలలో అతి కష్టమైన "ఫైట్స్" చేసి, "గూండా" చిత్రంలో "ట్రైన్" క్రింది బాంబులు తీసి విసిరే సీన్‌లో "డూప్" లేకుండా ఆయన నటించిన నటన "డేరింగ్ హీరో" అంటే ఇలా ఉండాలి అని "తెలుగు చలన చిత్ర లోకానికి" చాటి చెప్పిన హీరో మా సుప్రీమ్. చివరగా ఆయన అభిమానిగా కోరేది ఏమిటంటే మంచి కథా బలం ఉన్న చిత్రాలలో నటించాలని.

-వెంపాడు సత్తిరెడ్డి, ఇన్నీస్‌పేట, రాజమండ్రి

* * *

నా అభిమాన నటుడు "ముద్దుల కృష్ణుడు" "కలియుగ కృష్ణుడు" అయిన "యువ కిశోరం" నందమూరి బాలకృష్ణ.

తండ్రిగారైన శ్రీ రామారావుగారితో కలిసి "తాతమ్మ కల" నుండి "సింహం నవ్వింది" చిత్రం వరకు చిన్న చిన్న పాత్రలు ధరించి "డిస్కో కింగ్" చిత్రం ద్వారా "కథా నాయకుడు"గా పరిచయం అయి, ఇప్పుడు సూపర్ హిట్ చిత్రాల నటుడు, ఆరు కోట్ల ఆంధ్రుల



అభిమాన అందాల నటుడు మన బాలకృష్ణుడే.

మన బాలకృష్ణ దిన దిన ప్రవర్ధమానంగా వెలుగొందుతూ నందమూరి తారక రామారావుగారి స్థానానికి రావాలని ఆయన అభిమానిగా ఆకాంక్షిస్తున్నాను.

-ఎ. ఎన్. వి. ఆర్. ఆర్. కృష్ణారావు, శ్రీకాకుళం

సుమధుర మందహాసిని "సుహాసిని" అతి తక్కువ చిత్రాల్లోనే నటించినా తన "నటనా" వైదుష్యంతో జాతీయ అవార్డు నందుకోగల్గింది. ఆమె అందం అంతా ఆమె మృదు మధురంగా చేసే ఆ మందహాసం లోనే వుంది. ఆమె ట్రాజిడి సీన్స్ కన్నా చిలిపిగా అల్లరిగా నటిస్తేనే బాగుంటుంది అనే నా అభిప్రాయాన్ని "శిక్ష" చిత్రంలో ఆమె 'నటన' మార్చి వేసింది. నా అభిమాన నటుడు కమల్, అభిమాన నటి సుహాసిని కల్సి అన్నా చెల్లెళ్ళుగా నటిస్తే చూడాలని నా చిరు కోరిక. ఆమెకు నేనిచ్చే చిన్న సలహా ఏమిటంటే "సుహాసిని" మందహాసినే కాదు మృదు మధుర భాషిణి అని అన్పించుకునేట్లు తన సొంత వాయిస్‌తో మాట్లాడి తన అభిమానుల్ని



ఆనందింప చేయాలని నా అభిలాష.

-సి. హెచ్. అనిత, రామిరెడ్డి పేట, నర్సరావ్ పేట

* * *

"సితార" చిత్రం చూసి నేను భానుప్రియ అభిమానిని అయ్యాను. "అమెరికా అల్లుడు",



"అన్వేషణ", "అనాదిగా ఆడది", "ఆలాపన" లలో ఆమెనటన అద్భుతంగా ఉంది. అనతి కాలం లోనే నటనలోను, నాట్యంలోను తన కంటూ ఒక స్థానాన్ని ఏర్పరచుకున్న నటి భానుప్రియ. నృత్యాలలో తనకు సాటి మరెవ్వరూ రారని నా అభిప్రాయము. విశాలమైన తన నయనాలద్వారానే నటనా చాతుర్యాన్ని ప్రదర్శించ గల ఏకైక నటిమణి భానుప్రియ. స్త్రీ సమస్యలు ఇతివృత్తంగా కల కథా చిత్రాలలో భానుప్రియ ఎక్కువగా నటించాలి. భానుప్రియ అభిమానిగా నావిన్నప మేమిటంటే హిందీ చిత్రాలలో నటించినా ఈ తెలుగు అభిమానులను నిరుత్సాహ పరచకుండా ఎక్కువగా తెలుగు చిత్రాలలో నే నటించాలని.

-బి. శరశ్చంద్రిక, టి. నగర్, తిరుపతి

నా అభిమాన తార హీరో "కృష్ణ". ఆయన నటించిన "అల్లూరి సీతా రామరాజు" నన్ను బాగా ఆకర్షించింది. ఆయన నటన అసమానం. ఎటువంటి పాత్రనైనా తొణక్కుండా నటించగల నటుడు. ఈమధ్య నటించిన "పల్నాటి సింహం, అగ్ని పర్వతం, ఖైదీ రుద్రయ్య" చిత్రాలు ఆయన అద్భుత నటనకు నిదర్శనాలు.



ఈమధ్యనే ఆయన తొలిసారి దర్శకత్వం వహించి, నిర్మించిన "సింహాసనం" చిత్రం సినిమా చరిత్రలో నే ఒక నూతన అధ్యాయం సృష్టించింది. అన్నింటిని మించి ఆయన విశిష్ట వ్యక్తిత్వం కొనియాడదగ్గింది.

అటువంటి హీరో నా అభిమాన తార అని చెప్పడానికి నేను గర్వపడుతున్నాను.

-గుత్తుల సుభాష్, బియ్యంపేట, ద్రాక్షారామం

* * *

నా అభిమాన నటి రాధిక . న్యాయం కావాలి చిత్రంలో తెలుగు చిత్రరంగంలో ప్రవేశించి తన పాత్రకు న్యాయం చేకూర్చి తెలుగు ప్రేక్షకుల హృదయంలో 'మాకు ఈ నటి కావాలి' అనిపించుకో గలిగింది. ఆటు తర్వాత అంచెలంచెలుగా "కిరాయి రౌడీలు, అభిలాష, యుద్ధం, త్రిశూలం" వంటి కమర్షియల్, కథాబలం గల చిత్రాలలో తన అందం, గ్లామర్ నటనా పటిమను ప్రదర్శించి 'శభాష్ రాధిక' అని మెప్పుదలను పొందింది. స్వాతిముత్యంలో తన అసమాన నటనను చూపించి తారాహారంలో తానొక



మేలిముత్యమని నిరూపించి తారాపథాన్ని చేరుకున్న మా రాధిక, గ్లామర్‌తో బాటు ఎక్కువగా సీరియస్ పాత్రలలో నటిస్తే బాగుంటుందని నా భావన. 'ఓ ప్రేమకథ', ఆణిముత్యాలు" ఇత్యాది రాబోవు చిత్రాలు నావంటి అభిమానులకు ఆశాజనకాలు.

-ఎం. అనురాధ, ఖమ్మం

నా అభిమాన నటి సూపర్ హీరోయిన్ కుమారి విజయశాంతి. ఆమెనటన అంటే నాకు మరి మరి ఇష్టం. అనతికాలంలోనె నటనలోను వెరైటీ డ్యాన్సుల లోను విజయం సాధించింది. బాధాకర సన్నివేశాలలో నటించింది అంటే ఎంతటి కఠిన హృదయులైనా కంట తడి పెట్టక మానరు. ఓర్పుతో నేర్పుగా నవరసాలను ఒలికిస్తుంది. తన నటనా కౌశలంతో ఎంతటి విభిన్న పాత్ర నైనా అవలీలగా



నటించి పాత్రకు జీవం పో[illegible]న్యాయం చేకూరుస్తుంది. గ్లామర్ + నటన కలబోసిన ఆణిముత్యం. ముగ్ధమనోహర సౌందర్య తార, ఇక ముందు కూడ మంచి కథా బలమున్న చిత్రాలలోనే నటించి, ప్రేక్షకులందరి హృదయాలలో చిరకాలంగా నిలిచి పోవాలని, అందరి అభిమాన నటిగా ఇంకా ఎంతో మంచి పేరు సంపాదించి సినీ వినీలాకాశంలో ధృవతారగా వెలుగొందాలని ఆమె అభిమానిగా నేను కోరుకుంటున్నాను.

—పత్తి వెంకటేశ్వరరావు,
హెచ్. ముత్యాలంపాడు

★ ★ ★

"నాలుగు స్తంభాలాట" చిత్రం ద్వారా పరిచయం చేయబడ్డ సుత్తి వేలు గారు నా అభిమాన నటుడు. మొదటి చిత్రంలోనే వెరైటి కంఠధ్వనితో నన్నెంతో ఆకట్టుకొని, రెండు జెళ్ళ సీత, బాబాయ్ అబ్బాయ్, రెండు రెళ్ళు ఆరు, మొగుడు పెళ్ళాలు మొదలైన చిత్రాలలో తన నటనతో నన్ను మరింత ఆకట్టుకొన్నాడు.

తరువాత విడుదలై ఆంధ్రదేశంలో చరిత్ర సృష్టించిన "ప్రతిఘటన" చిత్రంలో పిచ్చాడి పాత్ర ద్వారా నటనలో శిఖరాగ్రానికి చేరుకున్న ఏహాస్యన[illegible]



నటుల్లో ఆయన ఒకరని ఘంటాపథంగా చెప్పవచ్చు. రేలంగి తరువాత హాస్యంలో మనకున్న ఏకైక నటుడు సుత్తివేలుగారు అని బాలుగారన్నదంలో వింతేమిలేదు. కాని ఈ మధ్య విడుదలైన చంటబ్బాయ్ చిత్రంలో ఆయన పాత్ర నాకు నిరాశ కలిగించింది. అలాంటి పాత్రలు వేయవద్దని ఓ అభిమానిగా నా రిక్వెస్టు.

—కె. సత్యనారాయణ, గుంతకల్

శ్రీలక్ష్మి నా అభిమాన నటి. మానవ జీవితంలో ఎన్నో సమస్యలు, చికాకులు ఉంటాయి. వాటిని తాత్కాలికంగా మరచి, కొద్ది సేపైనా ఆనందాన్ని, సంతోషాన్ని కలిగించే వరం, అందరికీ అందుబాటులో! ఉండే సాధనం 'సినిమాలు'. కాని నేటి సినిమాలు స్టంటు, క్రైం, సెక్స్ దృశ్యాలతో నిండి సంతోషానికి బదులుగా మరి కాస్త విసుగుని కలిగిస్తున్నాయి. ఇటువంటి వాతావరణంలో హాస్య నటి శ్రీలక్ష్మి "సినీ రంగ ప్రవేశం తొలకరిజల్లులా హాయి. "శ్రీవారికి ప్రేమ లేఖ", 'ఆనందభైరవి', 'చంటబ్బాయ్' చిత్రాలలో ఆమె నటనకు ఆమే సాటి. అలనాటి హాస్య బ్రహ్మ 'రేలంగి' తర్వాత స్థానం, నేటి హాస్య నటి శ్రీలక్ష్మిదే అని చెప్పవచ్చును. అయితే ఆమెకు నే నిచ్చే సలహా ఏమిటంటే, ఆమె ఎప్పుడూ నిండుగా చీరలోనే ఉండాలనీ, మోడరన్ డ్రెస్సుల జోలికి పోవద్దని, దుష్ట పాత్రలు వేయవద్దని, ఎప్పటికి హాస్య



పాత్రలోనే జీవించమని ఆమె అభిమానిగా నా సలహా పాటిస్తారని ఆశిస్తున్నాను.

-అధరాపురపు రాజ రాజేశ్వరి,
కొత్తగూడెం

★ ★ ★

నా అభిమాన హీరో శోభన్‌బాబు. సరస సంభాషణుడు. అంతకు మించి తన వ్యక్తిత్వాన్ని ఛాల పదిలంగా కాపాడుకునే సెన్సిటివ్. వయసు



పెరుగుతున్నా, ఆయన అందానికి మెరుగులు తగ్గవు. యీ మధ్య విడుదలైన "ధర్మ పీఠం దద్దరిల్లింది" చిత్రంలో తండ్రిగా నటించి, ఆయన నట జీవితంలో తన విశ్వ రూపాన్ని ప్రదర్శించారు.

నవలా కథానాయకుడుగా, తన నటనా వైదుష్యాన్ని ప్రదర్శించి, ఎన్నో చిత్రాలకు విజయం చేకూర్చిన నటుడు శోభన్. ఆయన బాణీ ఆయనది. ఆయన నటన ఆయనది.

నా అభిమాన నటుడు శోభన్ బాబు ఇంకెన్నో వెరైటీ పాత్రలు పోషించాలని ఆశిస్తున్నాను, పౌరాణిక చిత్రాల్లో నటిస్తే చూడాలని నా కోర్కిక.

—జిట్టా రమణి మోహన్, గాంధీనగర్,
కడప

విక్రమ్ చిత్రం సంచలనాత్మక విజయంతో తెలుగు వెండి తెరకు వెలుగునిచ్చి విక్రమ్ చిత్రంలో ఆమెకు తెలుగులోనే అనుభవం లేకపోయిన అనుభవం ఉన్న తారామణిలా నటించిన 'శోభన' నా అభిమాన తార. ఆమె మాతృభాష మళయాళంలో ఉత్తమ నటిగా గ్లామర్ తారగా విశేషమైన పేరును తెచ్చుకుంది. 1984 'కామయరెద్' అన్న మళయాళ చిత్రం ద్వారా ఆ సంవత్సరానికి ఉత్తమ కొత్త నటిగా రాష్ట్ర



ప్రభుత్వ అవార్డునందుకుంది. శోభన, ఏ భాషలో నటిస్తుంటే ఆ భాషను గొప్పగా చెబుతూ నటిస్తారు. ఇక తెలుగులో కూడ ఉత్తమ నటి అవార్డులు అందుకోవాలని, పాత్ర పాత్రకు వెరయిటీ వుండేటట్లుగా ఏ తరహా పాత్రకు అయినా శోభన సరిపోగలదని అనిపించేలా అన్ని రకాల పాత్రల్లో నటించి ప్రెక్షకులను రంజింప చేయగలరని అభిమానిగా నా కోరిక.

-ఎన్. వీరభద్రయ్య శ్రీ వేంకటేశ్వరపురం,
అనంతపురం

★ ★ ★

సాహస సామ్రాట్ కృష్ణ నా అభిమాన నటుడు అని చెప్పటానికి నేనెంతో గర్వపడుతున్నాను. ధైర్య సాహసాలు ఆయన ఊపిరి ఐతే ఆయనే నా సరస్వం నా ప్రాణం. అయిన సినిమా చూస్తున్నంతసేపు నన్ను నేను మర్చిపోతాను. ఆ సినిమా వచ్చిన రోజే మాకు నిజమైన పండుగ. రెండు రోజులకొకటైనా కృష్ణగారి చిత్రము చూడకపోతే ఏదోలా వుంటుంది. ఆనాడు ద్వాపర యుగంలో శ్రీకృష్ణుడు ఉన్నాడో లేదో నాకు తెలియదు. కానీ ఈ కళియుగంలో ఈ కృష్ణుడ్ని చూశాక ఆ ద్వాపర యుగంలో కృష్ణుడు



వున్నాడు, ఆ కృష్ణుడే ఈ కలియుగంలో అవతారం ఎత్తాడనిపిస్తుంది. "ఆపదలో వున్నా అన్నయ్యా" అంటే వెంటనే ఆదుకొనే ఆపద్బాంధవుడు నా అభిమాన నటుడు. ఇంతెందుకు నేను తిండి లేకుండా బ్రతగ్గలను కాని కృష్ణగారి చిత్రము చూడకుండా వుండలేను.

-చంద్రశేఖర్‌బాబు, ద్రాక్షారామ □



(గత సంచిక తరువాయి)

గురువుగారు వీణని కూడా అతిసున్నితంగా చూసేవారు ఇంక ఎదుట ఉన్నది ఆడపిల్ల ఎక్కడ నొచ్చుకుంటుందో అన్నంతగా లాలించి చెప్పేవారు

ఇతడి గొంతులో అజ్ఞాపనే గాని ఎదుటి వారితో ఏకీభావం లేదు. జంకు అంతకంటి లేదు వాతాపి కీర్తన మొదలెట్టింది

పల్లవి పాడగానే "నీకు వీణపై నున్న శ్రద్ధ గాత్రంపై లేదు అంత చక్కని కంఠస్వరం ఉంది ఏం ప్రయోజనం? మనసు దానిపై అంటే పాటపై ఎంతమాత్రం లగ్నం చేయడం లేదు నేను చెప్తాను, మళ్ళీ నువ్వు అదేవిధంగా పాడు"

అని అతడు పాడి ఆమెచే పాడించాడు ముందు కొద్దిగా భయపడినా శృతపక్వమైన అతని గొంతులో సంగతుల స్పష్టత విని బాగానే పాడింది ఇలా గంట వరకూ ఆమెకు గాత్ర సంగీతంలోని మెళకువలు చెప్పి లేచాడు వెళుతూ

"రేపు నీకు కొత్త పాఠం చెప్తాను కానీ రోజూ పాతవి కూడా చూస్తాను ఈ రోజు లాగ నువ్వు రోజు భయపడితే నేనురాను

అని మంగకి కూడా చెప్పి మరీ వెళ్ళాడు

అబ్బ! వర్షం వచ్చి వెలిసినట్లుంది అతడు వెళ్ళినా ఆ పాట చెవిలో మోగుతోంది. వర్షం వెలిసిన తర్వాతి చల్లదనంలా అతడి గాత్ర మాధుర్యం ఇంకా ఇల్లంతా అవరించుకునే ఉంది " అనుకుంది

'కల్యాణీ' భోజనానికిరా' గురువుగార్లు రావడం మానేసిన రోజు నుండి ఒకటే దిగులు. ఈ రోజు శుభ్రంగా తిను'

**జరిగిన కథ – 3:** వసంత తన భర్త బానుమూర్తి ప్రోత్సాహంతో గురుకుల వాస పద్ధతిన ప్రారంభించిన స్కూలులో వీణ కచేరి చేయడానికై తన స్నేహితురాలు లలితను ఆహ్వానిస్తుంది లలిత వీణ కచేరి విన్నవారంతా ఆమెను ప్రశంసిస్తారు వసంత లలితకు కళ్యాణి కథను చెప్పడం ప్రారంభిస్తుంది. అక్షరాభ్యాసం రోజున సరస్వతీ దేవిని పూజిస్తున్న కళ్యాణి దృష్టి దేవి చేతిలోని వీణపై పడుతుంది అప్పటి నుండి ఆ అమ్మాయికి తనూ వీణ నేర్చుకోవాలనే కోరిక బలపడుతుంది ఆమె తల్లిదండ్రులు ఆమెకు వీణ నేర్పించడానికి అంగీకరించడమే కాక ఓ గురువు గారిని కూడా కుదుర్చుతారు పట్టుదలతో సాధన చేస్తూ కళ్యాణి వీణలో నైపుణ్యం సాధిస్తుంది యుక్త వయస్కురాలవుతుంది గురువు గారు వృద్ధాప్యం లోకి చేరి తీవ్రంగా జబ్బు పడతారు గురువుగారు కూర్మయ్య అనే వ్యక్తిని తన స్థానంలో పంపుతారు మొరటుగా కనబడుతూ, మొరటుగా మాట్లాడే కూర్మయ్య శ్రావ్యంగా పాడుతాడు

అని పిలిచింది తల్లి

భోజనం నిజంగానే శుభ్రంగా తిన్నది లేచి చెయ్యి తుడుచుకుంటూంటే తల్లి మళ్ళీ అన్నది–

"కల్యాణీ' చూడటానికెంత సాదాగా ఉన్నాడు అయినా ఎంతో చక్కగా పాడాడు మేము నీకు చిన్నప్పుడు చెప్పించడానికి వెనుకాడాం ఇప్పుడా అబ్బాయి పాట వింటుంటే చిన్నప్పుడే చెప్పించాల్సిందే అన్పిస్తోంది నువ్వు కూడా అలా పాడటం నేర్చుకో" అన్నది.

"అది సహజ సిద్ధంగా అబ్బవలసిందమ్మా' అతని కంఠం శ్రావ్యమైనది మనిషి కూడా కచ్చితమైన వాడు గురువుగారిలా నిదానంకాదు

"మీ గురువుగారు చాలా ఉత్తములు ఈ అబ్బాయికి విద్య నేర్పడంలోనే అతని ఔన్నత్యం తెలుస్తోంది

"అమ్మా' ఇంక నేను సాధన చేయాలి ముచ్చట్లకి పిలవకు అతనితో గెలవలేం కుండ బ్రద్దలు కొట్టినట్లు ముఖం మీదే అనేస్తాడు

మర్నాడు అతడు వచ్చేసరికి కల్యాణి సిద్ధంగా కూర్చుంది

అతడు రాగానే మంగకి వినయంగా నమస్కరించాడు కల్యాణి వంక చూసి, "నీకేం కీర్తనలు వచ్చును నోట్సు చూపించు నీకు రానివి కొత్తవి చెబుతాను" అన్నాడు

'గురువుగారు చాలా కీర్తనలు చెప్పారు నేను నాకు తోచినట్లు రాగం వాయిస్తుంటే వినేవారు ఇంక కీర్తనలు అవి అష్టపది, తరంగం, పదం, జావళి, తిల్లాన వరుసగా చెబుతానన్నారు నేను వాటిలో మీరేది చెబితే అదే నేర్చుకుంటాను. అని అతి నెమ్మదిగా చెప్పింది

"సరే' ముందు అష్టపది చెబుతాను ముందుగా మోహనరాగంలోని అష్టపది చెబుతాను నాకు మోహనరాగంలోని రసపుష్టి ఏమాత్రం తగ్గినా కోపం వస్తుంది, ముందే చెబుతున్నాను. ఇంకొకటి నేను పెద్ద విద్వాంసుడ్ని కాను అందులో గురువు గారు నన్నేనాడు ఒక పద్ధతిలో ఇరికించ లేదు ఆ స్వేచ్ఛ నాకిచ్చారు. అందుకే నాకు తోచిన విధంగా చెబుతాను నేర్చుకుంటావా?" అని అతడి దోరణిలోనే అడిగాడు

సరేనన్నట్లు నిశ్శబ్దంగా తల ఊపింది

ముందుగా జయదేవుడి గురించి క్లుప్తంగా చెబుతాను. మహానుభావులు ఈ గాన కళకు ఎంతగా అంకితమయారో తెలుస్తుంది పాడే పాట యందు శ్రద్ధ కలుగుతుంది విను' అని ఆమె వింటోందో లేదో నని ముఖంలోకి చూశాడు

ఆమె వినడానికి సిద్ధపడినట్లుగా స్థిరంగా కూర్చుంది

చూడు శ్రీ జయదేవులవారు పన్నెండవ శతాబ్దంలో పుట్టారు. ఒరిస్సా

రాష్ట్రంలో బిందుబిల్వం అనే ఊరు ఈయన స్వగ్రామం ఈయన తల్లి రమాదేవి, తండ్రి భోజదేవుడు పద్మావతి వీరి భార్య ఏం అలా చూస్తావు ఈ వివరాలన్ని ఎందుకనా? ఆగి ప్రశ్నించాడు

లేదు –లేదు తడబాటుగా అన్నది

నీకు ముందే నోట్సులా చెప్తే అసలు చదవవు అందుకే ఇలా కథగా చెప్తున్నాను కాలం వృధా అని అనుకోకు

సరేలెండి ' అన్నది

విను! శ్రీకృష్ణుడి ప్రేమతత్వం ఎంతో గొప్పది దానిని గానం చేయడానికి పురుషోత్తముడైన వాసుదేవుడు జయదేవుడిగా అవతరించాడంటారు ఈయన వ్రాసనవి ఇరవయి నాలుగు అష్టపదులు అందులో పంతొమ్మిదవ అష్టపదిని వర్ణనాష్టపది అనీ, సంజీవనీ అష్టపది అనీ అంటారు వదసియతి కించిదపి దంత రుచి కౌముదీ అని పాడే ఈ అష్టపదిలో పదవసర్గ వ్రాసేప్పుడు ఒక అపురూప సంఘటన జరిగిందంటారు జయదేవుడు ఎంతో భక్తి భావంతో ఉత్సాహంగా రాధాకృష్ణుల ప్రేమతత్వాన్ని కనుల ముందుంచుకొని వ్రాసేవారు ఆ సర్గ వ్రాసేప్పుడు ఆయన భావనా వీదిలో విచిత్రమైన దృశ్యం కన్పించిందట ప్రణయం పరాకాష్ట దశలో కృష్ణుడికి రాద పాదంఆయన శిరస్సుపై ఉంచుకోవాలన్పించిందట దానికి విశ్లేషణ కృష్ణుడు ఇలా ఇచ్చాడుట–

రాధా! కోమలమైన నీ పాద పద్మములు సోకితేనైనా నా శిరస్సు వరకూ ప్రాకిన ప్రేమమైకం దిగుతుందేమో? ఏదీ ఒక్కసారి నీ పాదము నా తలపై ఉంచి నన్నీమోహం నుండి విముక్తుడ్ని చేయి అన్నాడుట

ఆ కమనీయ దృశ్యాన్ని జయదేవులవారు సంస్కృతంలో ఇలా వ్రాశారుట

స్మరగరళ ఖండనం, మమ శిరసి మండనం, దేహిపద పల్లవ ముదారం అని

అంతగా లీనమయి వ్రాసిన జయదేవులే మరల తాను వ్రాసనది చదువుకొని



## రసరాగ వాహిని

నిశ్చేర పోయాడుట

'ఏమి! శ్రీకృష్ణ పరమాత్మ తలపైన పాదం పెట్టడమా? ఎంత ఘోరంగా వ్రాశాను ఎంతటి ప్రేమ మైకమైనాది అసహజం" అని ఆ పంక్తులు కొట్టివేసి అభ్యంగన స్నానానికి వెళ్ళారుట వింటున్నావా కల్యాణీ? విసుగ్గా ఉందా?'

'లేదు – లేదన్నట్లు తలూపిందామె మళ్ళీ అతడు చెప్పడం ప్రారంభించాడు

కొంత సేపటికి తిరిగి వచ్చి పద్మావతిని వ్రాతప్రతి తెమ్మన్నారుట తీసుకొని కొట్టివేసిన పంక్తులనే తిరిగి వ్రాసి వెళ్ళిపోయారుట తలంటుకొని వచ్చిన జయదేవకవి కొట్టేసిన పంక్తులు తిరిగి వ్రాసుండటం చూసి 'ఈ పంక్తులు తిరిగి ఎవరు వ్రాశారు పద్మావతీ? అని అడిగారట

అదేమిటి! మీరేకద ఇంతకు ముందు వ్రాసి వెళ్ళారు అనందట ఆమె

ఆహా! పద్మావతీ ఎంతటి పుణ్యం నీది చూశావా ఈ తాళపత్రాలపైన నూనెబొట్లు వచ్చినది ఎవరో కాదు సాక్షాత్తూ వాసుదేవుడే! ఆ పంక్తులు కొట్టివేయడం ఆయనకిష్టం లేదు అందుకే ఈ అష్టపది నా అష్టపదులన్నిటి-లోకీ సజీవమైనది దర్శనాష్టపది" అని దానికి పేరు పెడ్తాను ఆఖరి చరణం చూడు ఇలా వ్రాస్తున్నాను 'జయతు పద్మావతీ రమణ జయదేవ కవి భారతీ ఫణితమితి గీతం' అని ఆమె పేరు కూడా కలిసొచ్చేట్టు పెట్టారుట ఈ రోజుకింక ఆపనా? పూర్తిగా చెప్పనా?' అన్నాడు

తన్మయత్వంతో వింటున్న కల్యాణి,

'లేదండీ మీకు చెప్పడానికి ఓపిక, సమయం ఉండాలికానీ వినడానికి నాకేం బాధలేదు అయితే ఒకటి మీరొక్కసారి ఆ అష్టపదిని పాడివినిపించండి" అన్నది

'అలాగే ఈ అష్టపదినే సంజీవినీ అష్టపది అని ఎందుకన్నారంటే ఈయన రచించిన ప్రతీ అష్టపదిని పద్మావతి మనోహరంగా అబినయించి నృత్యం చేసేదిట అలా వారిరువురూ అన్యోన్యానురాగంతో ఉండేవారట అతని కావ్యానికి రససిద్ధి కలిగించిన ఆమెంటే రాజైన లక్షణ సేనుడికి అపరిమితమైన గౌరవం ఉండేదట ఇది చూసి రాణికి స్త్రీ సహజమైన ఈర్ష్య ఉండేదట ఒకరోజు జయదేవుడూ, రాజూ కలిసి వేటకు వెళ్ళారుట ఏదో విదంగా పద్మావతి పైన అక్కసు తీర్చుకోడానికి సమయం కొరకు వేచి ఉంది రాణి ఈ అదను చూసుకొని,

'చూడమ్మా, పద్మావతీ! ఈ విషయం విని ఎలా తట్టుకుంటావో? అయినా చెప్పక తప్పదు విధివైపరీత్యము వలన, వేటలో నీ భర్త మరణించాడు

ఆ! అని పద్మావతి దుఃఖ సముద్రంలో మునిగిందట ఆమె స్పృహలోకి రాకుండానే ప్రాణం విడిచిందట అది చూసి రాణి పశ్చాత్తాపం చెంది-




'అయ్యో! యధాలాపంగా అన్ని మాటలకు ఇంత విపరీతం జరుగుతుం-దనుకో లేదు' అని భయంతో వణక సాగింది

రాజు, జయదేవుల వారు వేట నుండి తిరిగివచ్చి ఈ దృశ్యం చూసి మ్రాన్పడి పోయారుట జయదేవులవారు భార్యపై ప్రేమ ఉప్పొంగగా,

"ప్రియే చారుశీలే, వదసియతి కించిదపి దంతరుచి కౌముదీ " అని పంథొమ్మిదవ అష్టపది పాడారుట. అది పాడిన మహిమవల్లనో , లేక పరమాత్ముడు వ్రాసిన పంక్తులుండటం చేతనో ఆమె నిద్రలేచినట్లే లేచిందట అందుకే ఆ అష్టపదికి సంజీవినీ అష్టపది అనేపేరు ఇప్పటికీ పండరిపురంలో జయదేవులు కూర్చుని వ్రాస్తుండే, పద్మావతి నృత్యం చేసే చోటును యాత్రీకులకు చూపుతారట ఎంతో పవిత్ర స్థలంగా భావిస్తారుట ఈనాటికీ అన్ని వేళలా, అన్ని చోట్లా పాడే ఈ అష్టపదులు జీవ ప్రబంధాలు

కల్యాణి ముఖంలో ఉత్సాహం కొట్టొచ్చినట్లు కన్పడింది

సరే! మంచి హుషారుగా ఉన్నావు ఆ అష్టపది నేను పాడతానులే! నీకు మోహనరాగంలో నిది చెప్తాను నాకు మోహనరాగం ఇష్టం మొదటిగా నీకు అందులో నే పాఠం చెప్తాను

అలా అతడు ప్రియే చారుశీలే" పాడాడు తర్వాత ఆమెకు చెప్పవలసిన అష్టపది మొదలు పెట్టాడు అతని శ్రావ్యకంఠం ఆ ఇంటినంతా తన గాన మాధుర్యంతో ముంచెత్తింది

విరచిత చాటు వచన రచనం
చరణే రచిత ప్రణిపాతం
సంప్రతి మంజుల వంజుళసీమ
నికేశ శయన మనుయాతమ్
ముగ్ధే మధు మధనం!
అనుగత మనుసర రాధే!"

అంటూ చక్కని శృతిలో వీనుల విందుగా పాడాడు

ఆమె కూడా అతడు చెప్పినది వెంటనే అందుకుని పాడింది అతడు ఇంకోసారి ఇలా హెచ్చరించాడు

'చూడు! నేనింతవరకూ చెప్పినది పాఠంలా పాడడం కాదు స్త్రీ కంఠస్వరం కోమలంగా, మృదువుగా ఉంటుంది నేను నీకు జయదేవుని కథ చెప్పింది ఎందుకు? అష్టపది యొక్క భావ విశిష్టతను గ్రహించాలనీ గ్రహించి నీ గొంతులో పొందు పరచాలి చూడు! ఇంకోసారి పాడతాను విను!

మళ్ళీ మళ్ళీ నాలుగైదుసార్లు పాడాడు

ఆమెకు మొదటి సారి ఉన్న తడబాటు పోయింది ఈసారి భావోద్వేగంతో పాడింది అతడూ వెంటనే మిగతా చరణాలు పాడాడు

ఘన జఘనాస్తన భారభరే
దర మందర చరణ విహారం
ముఖరిత మణి మంజీర
ముపేహి విదేహి మరాళనికారం
ముగ్ధే! మధు మధనం
అనుగతమనుసర రాధే!"

అంటూ పాడి ఆమెచే మళ్ళీ మళ్ళీ పాడించి, తరువాతి చరణం అందుకున్నాడు

శృణు రమణీయతరం
తరుణీ జనమోహన
మధురిపు రావం
కుసుమ శరానన శాసన
వందిని నికనికరే బజబావమ్
ముగ్ధే! మధు మధనం!
అను గత మనుసర రాధే!

అనిల తరళ కిసలయ
నికరేణ కరేణ లతానికురుంబం
ప్రేరణ మెవకర భో రుకరోతి

# కోటయ్య అనుభవం- కోటయ్య నోటనే విందాం



కోటయ్యా సూరయ్యా ఇరుగు పొరుగు ఊళ్ళ రైతులు.
ఎన్నాళ్లనుంచో మిత్రులు. ఒకసారి అనుకోకుండా కలిశారు...




























పూర్తి వివరాలకై మీకు దగ్గరలోని న్యూ ఇండియా కార్యాలయానికి విచ్చేయండి.
లేదా ఏజెంటును కలవండి.



న్యూ ఇండియా ఎష్యురెన్స్

(జనరల్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా అనుబంధ సంస్థ)

నష్టాలలో మీకు నమ్మకమైన ఆధారం — భీమా !

# రసరాగ వాహిని

గతిం ప్రతిముంచ విళంబం!
ముగ్ధే! మధు మధనం!
అనుగత మనుసర రాధే!

ఇలా పై మూడు చరణాలు చక్కగా అతను ఆమె కర్ధమయ్యేట్టు పాడాడు ఆమెచే కూడా సంతృప్తిగా వచ్చిన వరకూ పాడించాడు

చూడు! ఆఖరిది జయదేవుల వారి స్వనామ ముద్రతో ఉంటుంది అది కూడా ఈరోజే నేర్చేసుకో

శ్రీజయ దేవ బణిత
మధురాకృత హార, ముదాసిత
వామం హరి వినిహిత మనసా
మధి తిష్టతు, కంఠ తటీమ విరామం
ముగ్ధే! మధు మధనం!
అనుగతమనుసర రాధే!'

అష్టపది అయేసరికి తల ఎత్తి చూసిన కల్యాణికి గుమ్మంలో తల్లి కన్పించింది ఏం కావాలన్నట్టు ప్రశ్నార్ధకంగా చూసింది

ఆ అబ్బాయికి భోజనం వేళ అని కూడా ఆలోచించలేదు నువ్వు పాఠం మొదలెట్టి చాలా సేపైంది" అన్నది

అప్పుడతడే కలుగ జేసుకున్నాడు

'లేదండీ! నాకు మా గురువుగారి లాగ చెప్పడం చాతకాదు ఏదో చెప్పకు పోతున్నాను తను వింటోంది ఇంకా వీణ ప్రారంభించలేదు అని జవాబు చెప్పాడు

ముందు భోజనానికి లేబాబూ! ఇందాకటి నుండీ మంచినీళ్ళు కూడా అడగకుండా పాడుతున్నావు'

వద్దండీ! మీలాంటి పెద్దవాళ్ళ ఇళ్ళలో తినదగ్గ వాడిని కాను

మా అమ్మాయికి గురువు స్థానంలో ఉన్నావు. మేం పెట్టింది, ఇచ్చినది స్వీకరించ దగ్గవాడివే! నువ్వెలాంటి సందేహాలు పెట్టుకోకు "

అతడు వెళ్ళి నూతి పళ్ళెం దగ్గర కాళ్ళు కడుక్కున్నాడు వరండాలో ఒక వారగా కూర్చున్నాడు మంగ అతనికి విస్తట్లో అన్నీ పెట్టింది తినేసి ఆకు పారేసి ఎంగిలి ఎత్తాడు పై దృశ్యం చూసి నిశ్చేష్టురాలైంది కల్యాణి

నోరు విప్పితే అతడు అపర సరస్వతి! ప్రవర్తన ఇంత వెనుకబడి ఉంది

అతడు వెళ్ళిన తర్వాత తల్లితో అన్నది-

అమ్మా! గురువుగారికి చేసినట్టు ఇతడికి నువ్వు చేయలేవు ఒక వేళ నువ్వు చేసినా అతడు చేయించుకోడు కష్టపడి చెబుతున్నాడని అబిమానముంటే అతనికి తగినట్టు ముట్టజెప్పు బాగుంటుంది పనిమనిషికి పెట్టినట్టు అలా అన్నం పెట్టడం అతడు పెట్టించు కోడం నాకు నచ్చలేదు'

వింటున్న రమణ మూర్తి గారు-







ఏం జరిగిందమ్మా? అన్నారు.

చూడండి నాన్నగారూ! అతను గురువు పంపారని ఊరుకుంటున్నాను సంగీతంలో గొప్పవాడు అతనికి నమస్కరించాలి ప్రవర్తన ఎంత చిన్నతనంగా ఉంటుందో చెప్పలేం. నన్నేమో చిన్న పిల్లను చూసినట్టు చూస్తాడు. కల్యాణంటే! నువ్వేనా అని గద్దించినట్టు అడగడం అమ్మ దగ్గర మాత్రం బోల్డంత వినయం ఇంక ఈవిడ అతని గానానికి పరవశించడం ఇంతా అంతా కాదనుకోండి అంది కాస్త కోపంగా

అయితే నాకు నచ్చలేదమ్మా? ఇంకెవరినైనా పంపమని గురువుగారికి కబురు చెయ్యనా అన్నారాయన

'చాల్లెండి! ఆయన ఏం తెలివి తక్కువ వారు కారు తక్కువ స్థితి లోంచి వచ్చిన పిల్లాడు వేష బాషలు నాగరికంగా ఎలా ఉంటాయి పాఠం ఎంత చక్కగా చెప్పాడు నాకే విన బుద్ధయింది

అని కసిరింది ఇద్దరినీ మంగ

'సరేలే! రేపు వీణ చెప్పక పోవాలి అతని పని పట్టాలి అతడు వీణ పాఠం చెప్పే వరకూ నువురాకు ఆ తరువాత అతిథి మర్యాదలు చేద్దువులే నేనే లోపలికి వస్తాను

సరేలేవే, నీలా నేను విద్యావంతురాల్ని కాను జీవితంలో సగం కాలం వంటింట్లోనే గడుస్తుంది కడుపుకింత పెట్టడమే చాతవును అదీ శక్తి ఉన్నంత వరకే ముసలిదాన్నయాక ఒకరు పెడ్తే తినడమే మంగ ఇంకా ఏదో అనబోయే లోపల కల్యాణి ఏదో కూనిరాగం తీస్తోంది

సంబాషణ అంతటితో ఆగింది

మర్నాడు అతడు అదే అష్టపదిని వీణపై వాయించి చూపాడు అప్పటి వరకూ అతడి గాత్ర మాదుర్యం విన్నది కల్యాణి అతడి వీణా వాయిద్య నిపుణత చూసింది అంతే! నోటమాట రాలేదు

ఏం కూర్చున్నావు? వీణతియ్యి నీకు చూపించడానికి మాత్రం వాయించాను ఇంక నీకు చెప్తాను

మీలా నేను వాయించలేను మనస్ఫూర్తిగా ఓటమిని అంగీకరించింది

అప్పటి వరకూ అతని ఆజ్ఞలను మాత్రమే ఆమె శిరసావహించింది అతడు మాత్రం నవ్వుతూ ఆమె వైపు చూసి,

ఎలా ఉంది నేను వాయించడం గురువుగారిది ఇన్నాళ్ళు చూశావు నేర్చుకున్నావు సముద్రం ముందు నీటి బిందువుల వంటివారం మనమేపాటి మనవిద్య ఏపాటి అన్నాడు

మీతో నన్ను పోల్చకండి అని నెమ్మదిగా అన్నది

సరే! పొగడ్తలతో పాఠం రాదు..వాయించు

మోహనరాగంలో ఉన్న సొంపంతా ప్రతి పలించేట్టు వాయింపించాడు

చూడు! అదే రాగంలో కొన్ని స్వరాలను నేను పాడతాను నాగొంతులో పలికిన స్వరాలు, గమకాలు నువ్వు గ్రహించి వాయించాలి

'సాదపదసరిగా– గరిగా– దపగ రిసా– రిసరిసా– రిసదపసరిగా – పదసరిగా– గపదపగరిసా – సరిగరిగపగపద పదస సరిగపదసరిగసా–

ఇలా ఆశువుగా మోహనరాగం అతడి గొంతులో ఆమె చేతులలో అతి మోహనంగా వివిధ సంగతులతో పలికింది అతనిగానం ఆగగానే కల్యాణి లో పలికి వెళ్ళింది

మంగకి మనసులో అపరాహ్ణం వేళ అతడిని ఆకలితో సాగనంపడం ఇష్టం లేదు అయినా కల్యాణికి బయపడింది ఆశ చంపుకో లేక-

కల్యాణీ! ఈ ఒక్కరోజు అతడ్ని భోజనానికి ఉండమనవే" అన్నది

ఆ! ఉండమంటాను నువ్వేమో అతడికి భోజనం పెడ్తావు అతను అంటరాని వాడిలా అరుగు చివర కూర్చుని తన విస్తరి తనే ఎత్తుకోడం. అది చూస్తే నీకెలా ఉంటుందో నాకు తెలియదు నాకైతే కంపరంగా ఉంటుంది సర్లే! నీఇష్టం మళ్ళీ నేనేందుకు? నువ్వే వెళ్ళి పిలువు,' అన్నది

మంగ అభ్యర్ధన విని అతడు-

రోజూ మీకు శ్రమ ఇవ్వడం నాకిష్టం లేదు నేను వెళతాను నాకేం కష్టం లేదు గురువుగారు పాఠం చెప్పమన్నారు వస్తున్నాను అంతే అని నమస్కరించి బండెక్కాడు

(ఇంకా ఉంది)

# అందాలు చిందే ఫ్రెస్కా.
# సుగంధాలు చిమ్మే ఫ్రెస్కా.




గోద్రెజ్ సమర్పణ—

అద్భుతమైన లగ్జరీ సబ్బు.

ఫ్రెస్కా. విలాసవంతమైన, విలువైన సుగంధ పరిమళ భరితమైన సబ్బు.

ఎంతో నురుగు—పాల మీగడ తరగలా. త్వరగా తరగనిది. అరగనిది ఫ్రెస్కా.

లగ్జరీ సబ్బు. మీకు నచ్చే, మిమ్మల్ని ఆశ్చర్య పరిచే తక్కువ ధరలో.

"సుబ్బీ సారగం ఏడనో నేదే. సారగం అంటే ఇదేనే."

ఈరిగాడి మాటలకి చిన్నగా నవ్వొచ్చింది, సుబ్బులుకి. కాపురాని కొచ్చిన రెండు నెలలలో వాడు ఆ మాట చెప్పడం ఎన్నోసారో, స్వర్గ్ అంటే ఏమిటో ఎరగని సుబ్బులుకి తెలియదు. కానీ, ఒక్కటి మాత్రం తెలుసు - వాడు ఆ మాట అనని రోజులు మాత్రం వేళ్ళమీద లెక్క పెట్టవచ్చు!

ఈరిగాడు ఆ మాట అనడానికి చాలా కారణా లున్నాయి. అప్పటివరకు ఒంటరిగ ఉండేవాడికి పెళ్లాం ఇచ్చిన అనందం మొదటి కారణం అయితే సుబ్బులు కొత్త కాపురానికి 'కట్నంగ' తెచ్చిన పురాతనమైన పెద్ద మంచం ఇచ్చిన 'సుఖం' రెండో కారణం.

"సుబ్బీ" జరగవే. కొద్దిగా.... అటింపు జరుగు" ఈరిగాడి మాటలకి చిరాకొచ్చింది సుబ్బికి. విసుగుతో, "ఏడకి జరగను. ఇప్పటికే మంచం కోడుమీద తొంగున్నా. ఇంకా జరిగితే ఏకంగ.... నేల తల్లి మీద పడటమే" అంది.

"సర్లే. నువు జరగమాక. నేనే జరుగుతాంత" అంటూ ఈరిగాడు తన శరీరం సగ భాగం పైగా తనమీద వెయ్యడంతో అసలే చిర్రు బుర్రు లాడుతున్న సుబ్బికి మండిపోయింది!

ఒక్క ఉదుటున మంచం మీద నుంచి లేచి మూలగా ఉన్న చిరుగుల చాప నందుకొని, పరుచుకొని పడుకొంది. సుబ్బులిక్కి కోపం వచ్చిందని ఈరిగాడికి తెలిసింది - వాళ్ల మధ్య మామూలుగా జరిగే జగడమే అది!

అయిదు నిమిషాలు ఊరుకొని, ఈరిగాడు మెల్లిగ, "సుబ్బీ..." అని పిలిచాడు. సుబ్బులు ఒక్కసారి కదిలి, మళ్ళీ పడుకుంది.

ఈరిగాడి బుర్ర వేగంగ ఆలోచిస్తోంది. దీని కోపం ఎలా పోగొట్టాలి? రెండు నిమిషాలు ఆలోచించి అడిగాడు.

"సుబ్బీ, ఏటే? అయ్యగోరి లోగిల్లో ఏదో సిత్రం జరిగిందట గందా. కోటయ్య బావ సెప్పాడు." నిజానికి జరిగిన 'సిత్రం' ఈరిగాడికి తెలుసు. ఊరంతా గుప్పుమన్న విషయం అది. ఆ మాటకి సుబ్బులులో వాడూహించిన మార్పు వచ్చింది!

దొంగ నిద్ర నుంచి లేచి, చాపమీద కూర్చొని చెప్పింది.

"ఏటీ. నువ్వెరగవా... ఊరంతా తెగ సెప్పుకుంటున్నారుగందా. మరి.... ముందే సెప్తే, సెప్పేదానినిగందా. సర్లే ఇను. మన సిన్న అమ్మాయిగోరు లేరూ...."

"ఎవరూ. కిందటేడు మనువు జరిగింది. ఆరేనా."

తను శ్రద్ధగా వింటున్నట్టు అడిగాడు ఈరిగాడు.

"ఆ. ఆరే. మొన్న.... రాతిరికాడ ఆరూ, అబ్బాయిగోరూ మనూరొద్దామని సిన్న కార్లో బయల్దేరినారంట...."

"అంత రాతిరికాడ.... ఎందుకంట్ల? ఏటి అంత యమరిజెంట్."

సుబ్బులు దగ్గిర ఇంగ్లీషు మాటలు




మాట్లాడటమంటే, ఈరిగాడికి చాలా ఇష్టం!

"ఎదవమొహంకి ఆమాత్రం తెలీదా? అమ్మాయిగోరి కడుపున కాయ కాసిందని డాట్టరమ్మ ఆ రాతిరికాడ సెప్పిందంట. అంతే. అమ్మాయిగోరికి అమ్మగోర్ని సూడాలని, రాతిరికి రాతిరే పెయానం పెట్టేశారంట. అబ్బాయిగోరి క్కూడా ఆ మర్నాడు సెలవంట...."

"ఏటేటి? అబ్బాయిగోరి కంత బద్దకమేంటే.... అదే నేనయితేనా.... సూడు.... ఇంకో నెలాళ్లలో నీ కడుపున కాయ అడకపోతే" సుబ్బులు మాటలని మధ్యలో ఆపుతూ, తన ప్రతాపాన్ని గర్వంగ చెప్పాడు ఈరిగాడు.

"సాల్లే సంబడం. నీ కయితే ఎప్పుడూ అదే గోల! పెద్దోళ్లకి ఎన్ని పన్లుంటాయి. అయినా, అందరూ నీలాగ ఇంటిలో పెళ్లాం కొంగట్టుకుని కూకుంటారేంటి.... నువు మద్దిలో అడ్డొత్తే నే సెప్పను. బుద్ధిగ ఇనుకో. రాతిరికాడ.... బయల్దేరారా. అమాస్య సీకటంట. అసలు రోడ్మీద ఎవరూ లేరంట. అద్దరాతిరి ఎవడుంటాడు. అబ్బాయిగోరు మాంచి ఊపుతో బండి జాగరతగానే తోలుతున్నారంట." ఊపిరి తీసుకునేందుకు సుబ్బులు ఆగింది.

"తర్వాత ఏటైంది?" ఆతృత ఆపుకోలేనట్టుగ అడిగాడు ఈరిగాడు. అప్పటికే మంచంమీద నుంచి చాపమీద కొచ్చిన వాడి ధ్యాసే లేకుండా, కోపం మరచి ఉత్సాహంతో సుబ్బులు చెప్పసాగింది.

"కొద్ది దూరం వచ్చేసరికి.... రోడ్ కడ్డంగ పెద్ద బండ రాళ్ళున్నాయంట. అబ్బాయిగోరు, అమ్మాయిగోరు ఇసుమంత బయపడుతూనే బండి దిగేసరికి, దొంగ సచ్చినోళ్లు అబ్బాయిగారి నెత్తిమీదొక్కటేసి, అమ్మాయిగోర్ని ఎట్టుకెళ్ళి పోయారంట. అమ్మాయిగోరు బంగార్బొమ్మ కదంట్రా. మా తల్లి ఎంత మంచి గుండేదో.... పెతీ పండక్కి నాకు సీరిచ్చేది. ఎదవలు! దొంగ ఎదవలు! అళ్లకి సేతు లెట్టా వచ్చాయో.... అమ్మాయిగోరి జీయితం బుగ్గిపాలు సేసేసినారు. ఎంగిలి ఇత్తరాకులాగున్న అమ్మాయిగోర్ని.... పోలీసు మామలు సూసి మనూరికి అట్టుకొచ్చేశారంట! ఎట్టాంటి అమ్మాయిగోరు, ఎట్టా అయిపోయినా రనుకున్నావు."

"ఎట్టాగున్నారేంటి?" సుబ్బులు ఆవిధంగ చెప్పిన తర్వాత, ఇలాగ అడగకపోతే, ఏం జరుగుతుందో ఈరిగాడికి బాగా తెలుసు!

"సెప్తా. కానీ... ఎవర్తోటన్న ఈ ఇసయం అనేవు! పెద్దోళ్ల గొడవలు మన కెందుకు. నువ్వు సెప్పేవని తెలిస్తే కొంప లంటుకుంటాయి."

"స. నాకామాతరం తెల్దేంటే. ఎవర్తోటి అననులే గాని.... సెప్పు."

ఇప్పుడు ఈరిగాడికి సుబ్బులుకి మధ్య నున్న దూరం 'అడుగు'కి తగ్గిపోయింది!

"పనసపండు రంగులో మిసమిసలాడే అమ్మాయిగోరు వడలిపోయిన తోటకూర కాడలాగయి పోయినారు. అమ్మాయిగోరి వంటి నిండా.... ఎదవసచ్చినోళ్ళు!.... గాట్లే."

"ఏటి? పంటి గాట్లా?"

"ఆ. అయ్యో - ఎదవనా కొడుకులు. దేవతనాటి అమ్మాయిగోర్ని అట్టా సెయ్యడానికి మనసెట్టా ఒప్పిందో?... సర్లే గాని మన కెందుకు - అళ్ల గొడవలు! ఇంక.... తొంగో."

"ఆ. అట్టాగే! నువు సెప్పినట్టు మన కెందుకు?"

ఇంక మాటలతో సమయం వృధా చేయడం వాడి కిష్టం లేదు!

"ఒరేయ్ ఈరిగోయ్" అన్న కేకకి, తలుపులు దబ దబ బాదుతున్న చప్పుడుకి వాడి ఆనందం పాల పొంగులా చప్పున ఆరిపోయింది.

"కోటిగాడికి బుద్ధుండక్కర్లా. అద్ద రాతిరికాడ రాకూడదన్న గ్నానం లేదు. ఎదవకి...." అని గొణుక్కుంటూ, సుబ్బి మీదనుంచి లేచి వెళ్ళి తలుపు తీసాడు.

"ఏట్రా, కోటిగా. పట్టాసైన నిదర సెడగొట్టినావు గదరా. ఏటి అరిజెంట్."

తలుపుతీసి కోపమంతా కోటిగాడిమీద చూపెట్టాడు.

"ఏటి, సెల్లమ్మా! మా వాడింత గట్టిగ కలవరిత్తుంటే ఎట్టా ఏగుతున్నావు ఈడితో." బట్టలు సరిచేసుకొని బయటికి వచ్చిన సుబ్బిని అడిగాడు కోటిగాడు.

"కలెమరింతలా?" సుబ్బులు తెల్ల మొహం వేసింది.

"అదేనమ్మా, పట్టాసైన నిదరలో ఉన్నానంటున్నాడు... మరేమో.... అడి మాటలు, నీ మాటలు ఇనపడుతున్నాయి."

కోటిగాడికి 'విషయం' అర్థమయిందని తెలియగానే, ఆ దంపతులు సిగ్గుతో తలలు దించేసుకున్నారు.

"ఆ సర్లెండి. ఇంతకీ నే నొచ్చిన విసయమేటంటే.... సూడమ్మా! పొద్దు పొడవకముందే అమ్మగోరు నిన్ను పన్లోకి రమ్మని సెప్పారు."

"ఎందుకంట" అడిగింది సుబ్బులు.

"పిండి వంటలేవో సెయ్యాలంట. ఒరేయ్ ఈరిగా. రేపు మద్దినాళ అయ్యగోరు, అల్లుడు గోరి దగ్గర కెల్తున్నారంట. నిన్ను కూడా తీసుకెళ్తారంట. రెడీగ

ఉండమని సెప్పమన్నారు "

'అంతేనా ఇంకేటి నేదుకదా ఈరిగాడు ఆతృతగా అడిగాడు

"ఆ మరిసిపోయినాన్రోయ్ - నిన్నీ రాతిరి 'కుప్ప'కాడ పడుకోమని సెప్పారు మతాబులా వెలుగుతున్న ఈరిగాడి మొహం అరిపోయింది, ఆ మాటలకి

మాడిపోయిన వాళ్ళ మొహాలు చూసి, నిజం చెప్పకుండా ఉండలేకపోయాడు కోటిగాడు

'వంటిగాణ్ణి నేను అడుక్కుంటానండి అని సెప్పి అయ్యగోరితో సెప్పా లేరా. బాధ పడమాక అయినా రత్తి లేని ఇంటిలో నిద్ర రట్టటం లేదురా' కొద్దిగ బాధ పడుతూ చెప్పాడు కోటిగాడు 'రత్తి' గురుతుకు రావడం వల్ల వాడి కంఠం మూగబోయింది

సూర్రా, బావా బాధపడమాక కట్టాలు మనకి రాక మానులుకి వత్తాయంట్రా రత్తిని దేముడు వచ్చెయ్యమన్నాడు

ఎల్లిపోయింది' ఊరడించే ప్రయత్నం చేసాడు ఈరిగాడు

"దేముడు' ఎక్కడున్నాడ్రా? ఆడికి నేనే మన్నాయం సేసానని నా రత్తిని నా నుండి తీసుకుపోయాడ్రా? గుళ్లో బత్తులు వేసే దచ్చినలుతో పెద్ద మేడ కట్టిన పంతులుగోరిని ఆ దేముడు ఏమి సెయ్యడేంద్రా? బియ్యంలో రాళ్ళు కలిపే చెట్టిగోర్ని ఏమి సెయ్యడేంద్రా? నమస్కారాలు ఎట్టేటోళ్ల కొంపలకూల్సే ఇనాయకరావుగోర్ని ఏమి సెయ్యడేంద్రా? సర్లెండి నా ఎదవ గోల ఎప్పుడు ఉండేదే ఇంక పడుకోండి

కోటిగాడు వెళ్ళిపోయాడు దాని కోసమే ఎదురు చూస్తున్న ఈరిగాడు వెంటనే తలుపు గడియ పెట్టాడు! •

* * * * * * * * *

'అయ్యగోరు' అని అందరిచేత అనిపించుకునే 'సీతా.రామరాజు' గారి వయస్సు సుమారు అరవై సంవత్సరాలు ఉంటుంది 'పిల్లలు' అందరూ వాళ్ళ జీవితాలలో సెటిల్ అయ్యిపోయారని ఆయన బావించే సమయంలో వచ్చి పడింది - ఈ ఆపద' ఈ సమస్య!!

ఈరిగాడితో మధ్యాహ్నం అల్లుడు దగ్గరికి బయల్దేరారు రెండు అరటి బొంత పళ్ల గెలలు, రెండు బిందెల స్వీట్సు, ఒక బస్తా బియ్యం ఇవన్నీ చూసిన తర్వాత ఈరిగాడికి, తన్నని ఊరు ఎందుకు తీసుకెల్తున్నారో అర్థమైంది!

ఆ ఊరు నించి 'తణుకు పంథ కిలో మీటర్లకన్నా దగ్గరలో ఉన్నా ప్రయాణం మాత్రం చాలా సమయం తీసుకుంటుంది రాజోలు వరకు ఒక బస్సు అక్కడ్నుంచి సఖినేటిపల్లి వరకు వేరొకటి, రేవు దాటి నర్సాపురంలో తణుకు బసెక్కి వాళ్ళు 'తణుకు' చేరుకునేసరికి రాత్రి ఎనిమిది అయింది'

'అయ్యగారి' పక్కన రిక్షాలో కూర్చోవాలంటే (ఆయన కాళ్ళ దగ్గర అయినా సరే) ఈరిగాడికి చాలా బయంగా ఉంది కానీ కూర్చోక తప్పలేదు రిక్షా



వెంట పరిగెడ్తానంటే అయ్యగారు ఒప్పుకోలేదు' అని ఈరిగాడికి చాలా బాధగ ఉంది! రిక్షాలో చాలా సేపట్నుంచి ఆలోచిస్తున్న సీతా రామరాజుగారు ఈరిగాడికి చెప్పారు

"ఒరేయ్, ఈరిగా! నిన్ను కళ్ళు తెరిచినప్పట్నుంచి నేనే పెంచాను మీ అమ్మ చచ్చిపోయినపుడు మీ నాన్నకి 'దినం' ఖర్చులుకి నేనే డబ్బిచ్చాను మీ నాన్న పోయినపుడు నీకిచ్చాను ఆనాటినుంచి నిన్ను నా పొలంమీద పాలేరుగా పెట్టుకున్నాను "

అయ్యగార్లు ఆ విషయం అంతా ఎందుకు చెపుతున్నారో ఈరిగాడికి అర్థం కాలేదు కొద్ది సేపటికి ఆయనే చెప్పారు - ' ఈరిగా!అల్లుడుగారు ఏదన్నా అంటే నీలోనే దాచుకో మనూళ్లో ఎవరితోటి అనకు ఇప్పటికే నలుగురూ ఏదో అనుకుంటున్నారు" ఆయన చెప్పింది శ్రద్ధగా విన్నాడు ఈరిగాడు!

ఆయన ఊహ అబద్ధం కాలేదు ఎప్పుడు ఆయనొచ్చినా ఆహ్వానించే అల్లుడు, ఆయనకేసే చూడలేదు! 'ఎప్పుడొచ్చారు' అని అల్లుడు అడిగితే, సంభాషణ ప్రారంభించొచ్చు అనుకున్న ఆయనకి ఆశాభంగమే ఎదురైంది!!

ఆడపిల్ల తండ్రిగా ఆయనే మొదట కదిపారు

"బాగున్నావా బాబూ!"

"ఆ బాగానే ఉన్నాను. కనపడట్లేదా?

అవుననుకో నేను వస్తుంటే అమ్మాయి నాతో వస్తానని ఒకటే గోల నేనే హెల్త్ బాగుపడ్డాక వెళ్ళుగానిలే అని సర్ది చెప్పాను

'అదా? ఇక్కడికా? ఎందుకు?

"అదేంటి బాబూ! అట్లా అంటావు భార్య భర్త దగ్గర ఉండక ఇంకెక్కడుంటుంది

"చూడండి! మీ అమ్మాయికి జరిగిన అన్యాయం మీరు మర్చిపోయినా నేను మరచిపోలేదు అందుకే దానికి, నాకు ఏం సంబంధం లేదు '

'అట్లాగంటే ఎట్లా నాయనా! జరిగిన అన్యాయం ఎలాగా జరిగి పోయింది ఆ సబ్ ఇన్స్పెక్టర్ నాకు తెలిసినవాడే అమ్మాయిని గుర్తు పట్టి, కేసు పెట్టకుండా ఇంటికి తీసుకొచ్చాడు ఎవరికీ తెలియనివ్వలేదనుకో "

మామగారూ! కేసు లేదా? ఎవరికీ చెప్పలేదా? ఆల్‌రైట్! మీ అమ్మాయికి జరిగిన విషయం వీటితో పోతుందా? అందుకని, నేను ఎవరో ఎంగిలి చేసిన భోజనం రోజూ తింటూ కూర్చోవాలా? సారీ! ఐ యామ్ ఎక్స్‌ట్రీమ్లీ సారీ నేను డైవోర్సుకి అప్లయి చేస్తున్నాను '

అదికాదు బాబూ! జరిగిన దాంట్లో దాని తప్పేముంది నువ్వే చెప్పు

అయ్యగారు సింహంలా గర్జిస్తూ తిరిగే అయ్యగారు అల్లుడిని బ్రతిమాలుతుంటే ఈరిగాడికి 'వింత'గ ఉంది!

'వట్టి మనిషి కాదు బాబూ' అన్నా రాయన! 'చదువుకున్నవాడివి ఇవాళో, రేపో విదేశాలు వెళ్తున్నావు' అని సర్ది చెప్పబోయారు! 'మగాడివి,

## తగదు తగదు

పెద్దవారితో పేదవానికి స్నేహం
తగదు తగదు మరియు
సబబు కాదు
కాఫీలతో - తేనీళ్లతో
అది సాగి పోదు
ఫలరసాలతో, విందు
భోజనాలతో ఆగిపోదు
నీకు అలవాటు లేని
ఆటలు, పాటలు
ఆడించి, పాడించి
పాన శాలలకు, మద్య
కేంద్రాలకు ప్రాకుతుంది
పేకాటతో పోదు,
గుఱ్ఱముల పరుగులపై
మోజు కలిగించు
ఇంటిపై విసుగు
మద్రాసు, ఊటీ,
బెంగుళూరు పట్నాలు
వైపు తీయిస్తుంది పరుగు
పెద్ద వాళ్లతో పేదవానికి
స్నేహం తగదు తగదు

—ఎం.ఎస్.ఎం.

## సొరగం

నువ్వే ఆ ముగ్గుర్ని ఏం చెయ్యలేకపోతే, అమ్మాయి ఏం చెయ్యగలదు బాబూ ఆలోచించు' అని బతిమాలారు. 'బాబూ! ఆడదాని ఉసురు ఊరికే పోదు' అని బెదిరించారు!

అన్నిటికీ అల్లుడు సమాధానం ఒక్కటే!

చివర్లో, చిన్నగా చెప్పాడు - 'మీ అమ్మాయికి జరిగిందానికి నేను బాధ పడ్తున్నాను కానీ ఇంత జరిగాక ఆమెతో కాపురం చేసే పెద్ద మనస్సు నాకు లేదు నేను మంచివాడిని కనక మీ రిచ్చిన కట్నం ఇచ్చేస్తాను అదివ్వకపోయినా మీరు చెయ్యగలిగేది ఏమీ లేదు! ఈ విషయం అమ్మకి, నాన్నకి నేను ఇంకా చెప్పలేదు మీరు ఆ ఊరు వెళ్ళి వాళ్ళని బాధ పెట్టకండి. మీరే కాదు ఎవరెన్ని చెప్పినా నేను వినదల్చుకోలేదు ఎలాగు వచ్చారు కనుక, ఈ రాత్రికి ఉండి వెళ్లండి గుడ్‌నైట్!

'అల్లుడుగోరు' అని ఆగిపోయాడు కానీ, ఈరిగాడు అతని చెంప పగల గొట్టేవాడే అంత కోపం వచ్చింది వాడికి!

అయ్యగారికి, వాడికి ఆ రాత్రి అక్కడ ఉండటం ఇష్టం లేకపోయినా, ఉండక తప్పలేదు! అప్పటికే రాత్రి పది అవటంచేత బస్సులు ఉండవని!!

* * * * * * *

సుబ్బులుకి పట్నం నుంచి 'పువ్వులైనా' తేలేకపోయానన్న బాధతో చిన్నగా అడుగులు వేస్తూ నడుస్తున్నాడు ఈరిగాడు! దూరంగ తన గుడిశె దగ్గర కనబడిన జనాన్ని చూడగానే వాడి మనస్సు 'కీడు' శంకించింది వేగం పెంచి రెండు క్షణాల్లో గుడిశె దగ్గరికి చేరుకున్నాడు

అప్పటివరకు గుస గుసలు చెప్పుకుంటున్న వారందరూ ఈరిగాణ్ణి చూసి నిశ్శబ్దంగ నిలబడి పోయారు! ఈరిగాడు కంగారుగా అడిగాడు "ఏటైంది? మీరంతా ఇక్కడేం సేత్తున్నారు సుబ్బేది?

జరిగింది అంతా ఎవరికి తోచినట్టు వాళ్ళు చెప్పారు విషయం తెలిసిన ఈరిగాడు స్థాణువై పోయాడు!

పక్క గుడిశె మామ్మ వాడిని ఓదారుస్తూ చెప్పింది - "సూద్రా, అబ్బీ! ఆడదాని మనస్సు లక్ష్మితో సేసిన గుడి నాటిదిరా ఏ ఆడదాని గుడిలో నైనా, ఉండే దేముడు - బరతరా ఈ ఇసయం తెలీని మగాడు దాన్ని కట్టాల మంటలకి గురిసేస్తే జరిగేది - గుడి, లక్ష్మ గుడి కాలిపోద్దిరా!"

ఓ గూడెం పెద్ద ముందుకు వచ్చి చెప్పాడు - 'ఒరేయ్, ఈరిగా! నీ కట్టాలన్నిటిలోను పాలు పంచుకోడానికి వచ్చిన పెళ్లం కట్టంలో పాలు పంచుకోపోతే నీకు, గొడ్డుకు ఏందిరా తేడా! ఎల్లి దాన్ని ఓదార్చు - రాతిరి కాడ్నుంచి ఏడ్చింది ఏడ్చినట్టుంది తలుపు తియ్యమంటే తియ్యటం నేదు! ఎల్లి ఆ బిడ్డని ఓదార్చరా పో!'

కొద్ది క్షణాలు ఆలోచించి చెప్పాడు ఈరిగాడు - 'అట్టాగే - మీరంతా ఎల్లి మీ పన్లు సూసుకోండి! నేను ఇసయం కనుక్కొంటాను

అందరూ వెళ్ళిపోయాక, చిన్నగ తలుపు తట్టి సెప్పాడు

సుబ్బీ! నువు తలుపు తీస్తావా? నన్ను బద్దల కొట్టమంటావా?

'మామ' అన్నంత పని చెయ్యగలడని తెలిసిన సుబ్బులు ఏడుపు ఆపి తలుపు తీసింది! ఈరిగాడు గుమ్మం దాటి లోపలికి వచ్చి, తలుపు గడియ వేసాడు!

మామా! ' అంటూ సుబ్బి వాడి కాళ్లకి చుట్టుకుని వలవలా ఏడ్వడం మొదలెట్టింది! మామా! సూడు ఎట్టాంటి గోరం జరిగిపోనాదో

సన ఏటే ఊరుకోవే ఏటి జరిగిందిప్పుడు ఊరుకో!"

"ఏటి జరిగిందా? ఆడదానికి జరగకూడంది జరిగింది! నా బతుకు బుగ్గిపాలైందిరా మామా!

"ఇన్నానే ఊరుకోయే ఏం సేత్తాం సెప్పు ఇంతకీ ఏం జరిగిందో ఇవరంగ సెప్పు 'ఎవడాడు? ఎవడే-ఆ దొంగ నా కొడుకు అనునయంగా అడిగిన వాడి మాటలకి సుబ్బులు కరిగి పోయింది!

"రాతిరి నువ్వెట్టాగ పట్నం నుంచి రావు గందా అని తొలి ఆట సినిమా కెళ్లాను సినిమా నుంచి వత్తుంటే ' జరిగిన విషయం గుర్తుకు రావడంవల్ల ఆమె కంఠం గద్గదమైంది! మోకాలుమీద తల పెట్టుకొని ఏడుస్తూ కూర్చుంది! ఈరిగాడు మౌనంగా నిలబడ్డాడు ఆ సమయంలో ఏడుపుకి మించిన ఓదార్పు ఉండదని, ఆ చిన్న బుర్రకి తెలుసు!

"వత్తుంటే కుప్పకాడ కోటన్నయ్య పాట పాడుతున్నాడు కూకొని'

'రత్తీ! నా రత్తే. ' అని పాటిన పడితే ఏటో సూద్దామని పొలంలో కెల్లా నన్ను సూడగానే, 'రత్తీ! వచ్చావా. ' అంటా కోటన'య్య నన్నట్టుకొని.. నేలమీద పడేసి . నా జీయితం అన్యాయం సెసేసినాడ్రా, మామా!"

ఏటి? కోటయ్య బావా!?. ఉండు అది పన్సెప్తా ."

కోటిగాడు ఆ పని చేసాడని తెలియగానే ఈరిగాడిలో ఆవేశం, ఆవాదనంలా పొంగింది! వాడి కంటి దగ్గర కండరం అదిరింది! తలుపుకేసి తిరిగినవాడ్ని చూస్తూ సుబ్బి చెప్పింది

"మామా!' నే సెప్పేది పూరితిగ ఇనుకో కోటన్నయ్య ఆ ఎదవ పని చేసేటప్పుడు అదు మనలో లేడు పుల్గ సారా తాగేసి ఉండాడు

ఈరిగాడు చల్లబడ్డాడు - పూర్తిగా తెలియగానే!

వాడి కన్నుల ముందు 'అల్లుడుగారు' కనపడ్డారు! అయ్యగోరు బ్రతిమాలుడుతున్న దృశ్యం కనబడింది!! చెంప పగలుకొట్టాలని ఆ సమయాన తన కొచ్చిన కోపం గుర్తొచ్చింది!!

మెల్లిగ సుబ్బి కేసి నడిచి, ఆమె తలమీద చెయ్యి వేసి ఊరుకో అన్నట్టుగా మెల్లిగ చెప్పాడు 'సుబ్బీ' నీవు ఏం సేత్తావు, సెప్పు. ఇందులో నీ తప్పేం లేదు. అది తప్పున్నట్టు నా కనపడటం లేదు!ఆడకూతురు పోయి నెల కూడా కాలేదు! అదు మాత్రం ... ఎంత బాధ పడ్డాడు నీకే తెలియదా? తాగేసుండడంవల్ల అదికి ఏం సేతున్నాడో తెలిసుండదు! నిన్ను చూడగానే రత్తి గురుతు కొచ్చి అదికి ఆ ఆలోచనొచ్చిందేమో!"

"నిజమే మామా! .. అది తప్పు నేదు! నా బతుకు అన్యాయం జరిగి పోయింది. నేను మైల పడిపోయాను. నన్నట్టుకోకు నా దగ్గరకి రామాకు .." తన దగ్గిర కొస్తున్న ఈరిగాడికి

## దయామృతం

చకోరంపై జాలితో ...
జాబిలి వెన్నెల వెదజల్లుతోంది
చాతకాన్ని కరుణించి
నీరదం వర్షిస్తోంది.
చంద్రుని కంటి చల్లని
మొయిలు కంటి మెత్తని
నీ హృదయమింకా నాకు
దయామృతం ప్రసాదించదే ప్రభూ!

-గోవిందరాజు రామకృష్ణరావు

## సారగం

దూరంగా జరుగుతూ చెప్పింది సుబ్బులు!

దానికి ఎలా సర్ది చెప్పాలో ఈరిగాడికి తెలియటం లేదు! రెండు నిమిషాలు ఆలోచించి, దీర్ఘంగా నిట్టూర్చి చెప్పాడు

"సుబ్బీ పట్నం నుంచి వత్తే, ఇసేసాలు అడక్కుండా ఏడుత్తు కూకున్నా వేంటే? పట్నంలో ఏం జరిగిందనుకున్నావు!?.. నేనూ, అయ్యగోరూ అల్లుడుగోరి.. ఛత్! ఆ ఎదవని అల్లుడుగోరు అనడమేంటి? కాడకి వెళ్లామా! అయ్యగోరు ఎంత సెప్పినా ఆ ఎదవ సచ్చినోడు ఇంతేనా?. ఆడకూతురని జాలైనా నేదు కసాయి ఎదవకి తన పెతి రూపాన్ని మోత్తున్న అమ్మాయిగోర్ని ఒగ్గేస్తాడుట! సదివాడు -డాట్టరీ, ఎందుకు? గ్నానం నేదు రేపో, మాపో. ఇదేసాలు ఎల్తాడంట - ఇంకా సదవడానికి! ఇట్టాంటి ఎదవలందరూ పరాయి దేసాలకెళ్తే, మన దేసం పరువు కూడా పోద్ది!! అసలు ఈ ఎదవని ఎట్టాగెళ్ళనిస్తున్నారో?. తాడిసెట్టుకి వచ్చాయి, ఈడికీ వచ్చాయి - ఏళ్ళు! ఎందుకు? ఎదవకి బుద్ధి నేదు ఆలోస నసలే నేదు కట్టుకున్న పెళ్లాన్ని రచ్చించుకోలేని ఎదవ ఆళ్ళు ఓ దెబ్బ కొట్టగానే పడి పోయిన ఎదవ ఎన్ని ఎదవ ఊసులాడాడని! అందుకే అన్నారు - సెప్పేవన్నీ సీరంగనీతులూను, దూరేవన్ని దొమ్మరి గుడిశెల్లూనని! ఇట్టాంటి దొంగనాయాళ్ళు. ఉండబట్టే ఆడకూతుల్లు బతుకులు ఇలా ఏడ్సాయి ఈడి మొహానికి మళ్ళీ పెళ్ళి కూడానంట

కొద్ది క్షణాలు ఆపి, తన వంక శ్రద్ధగా చూస్తున్న సుబ్బి వంక చూసి, నవ్వి కొనసాగించాడు సుబ్బీ .

నేనట్టాంటి ఎదవని కానే నన్నట్టాంటి ఎదవలా సెయ్యకే నీ తప్పు లేనేపుడు శిచ్చ నీ కెందు కెయ్యాలే? ఇంకోడెవడైనా అయితే అణ్ణి సంపేసేవోణ్ణి! కోటిగాడి బాధ తెలుసు గాబట్టి. అదు తాగేసున్నాడని తెల్సింది కనక బతికిపోయాడు

జరిగినదాంట్లో ఆ 'సారాదే తప్పంటా' అవునే ఆ సారాదే! ఇంకా సెప్పాలంటే. సారా అమ్మేవాళ్లదే, పెబుత్వానిదే! అదు సారా తాక్కుండా ఉంటే. ఇలా సేత్తాడంటావా? 'సెల్లీ' అని నిన్నెంత పేమగా సూసేవాడో నువ్వెరగవా? సుబ్బీ నిన్నటి రాతిరిని మరిసిపో! నీ టయిమ్ బాలేదని సర్ది సెప్పుకోవే సుబ్బీ' మనస్సు సెడిపోయినోళ్లకన్నా. నువ సాలా బెట్టే (బెస్టయే!) అందుకే మనిద్దరం 'నిన్నని' మరిసిపోదాం

ఈరిగాడి మాటలకి సుబ్బి కన్నులు మిల మిలా మెరిసాయి. ఆనందంతో చెప్పింది - "మామా! నువ్వు దేముడివి సీరాముడికన్నా గొప్ప దేముడివి!'

సుబ్బులు మాటలకి చిన్నగా నవ్వి, దాన్ని తన కౌగిలిలోకి తీసుకుని చెప్పాడు - "అవునే! దేముణ్ణే సారగంలో దేముణ్ణి!!'

సుబ్బులు 'తనంతట తానుగా', ఆ పూట వాడికి నిజమైన స్వర్గాన్ని.. కాదు, 'సారగాన్ని' అందించింది □








# దూరదర్శనం

లత

శనివారం 15.11.86 ఘర్ బాహర్- వ్రాయటం శుద్ధ అనవసరం. అనంతరం యువజన కార్యక్రమం గురించి - అనగా యువమంచ్.

క్యా భారతీయ నారీ - ఇది విషయం. భారతీయ నారి వివాహ జీవితం బంధంలోనే ఉంటుంది. పితా-పతీ-పుత్ర ఈ ముగ్గురి చేతిలోనే ఉంది అంటూ ఈ కార్యక్రమం ప్రారంభమయింది. ఇద్దరు యవ్వనం దాటినవారు, ముగ్గురు యువతులు ఇందులో పాల్గొన్నారు. ప్రమీలాటేక్ అనే అమ్మాయి యువతి. స్త్రీల మధ్య కూర్చున్న ఇద్దరు పురుషులూ పాపం బిక్కుబిక్కుమంటూ కూర్చున్నారు. స్త్రీ స్వాతంత్ర్యాన్ని గురించి ఎలా మాట్లాడినా ప్రమాదమే పురుషుడికి- స్త్రీకి శాసనరీత్యా కూడా స్వతంత్రం లేదు - యత్ర నార్యస్తు పూజ్యంతే ... అక్కడ దేవతలు ఉంటారు అంది సుశీల అనే ఆవిడ.

ఒక యువతి మాత్రం స్త్రీ బంధ విముక్తురాలు కావాలని చెప్పింది- దైనిక జీవితంలో - బైట జీవితంలో స్వతంత్రం కావాలని ఒక బిక్కుమనే మగవాడు సెలవిచ్చాడు. ఇంకో యువతి కుటుంబంలో తల్లి ప్రాధాన్యత చెప్తూ మగపిల్లవాడికున్న ప్రాధాన్యత కన్యకి లేదని చెప్పింది. ఇక ఈ యువమంచ్ జీళ్ల పాకంలా సాగుతోంది. వదిలి వేద్దాం. పాత ఆకాశవాణి ప్రోగ్రాంలు తిరిగి దృశ్యం చేస్తున్నారు.15 ఏళ్లనాటి ఆకాశవాణి జీవితంలో ఇలాటి జిడ్డు ప్రసంగాలే ఎక్కువ. కాని ప్రభుత్వం గుర్రంపందాలు మానిపించకపోవటం వలన స్త్రీ ఎలా రోదిస్తుందో, సారాయి అమ్మించటం వలన ఎలా దుఃఖిస్తుందో ప్రసారం చేయదు. వాటివల్ల పన్ను రూపేణా డబ్బు వస్తుందిగనక. ఇక మరీ కట్నాలూ కిరసనాయిలు చావులూ, స్త్రీ స్వతంత్ర వ్యక్తి కానందువల్ల ... అని అంటూ ఉంటుంది- ఇందులో సిగరెట్లు- వ్యభిచారం కూడా ఉన్నాయి. బొంబేలో మాత్రం పూర్వంలాగా వ్యభిచారానికి లైసెన్సులిచ్చింది. వాటిని గురించి యువమంచ్ చర్చించదు. అది మన దురదృష్టం- ఆ పురుషుడు అప్నేపతీ అంటున్నాడు. అంటే మన భర్త అనా? దేవుడా రక్షించు నా దేశాన్ని ఈ అజ్ఞానాన్నుంచి - దురలవాట్లపాలైన యువకులనించి- యువమంచ్ నించి.

హరిజనులకూ, ఆడవాళ్లకూ స్వతంత్రం ఇచ్చి నా దేశాన్ని రక్షించు. క్లోజింగ్‌లో నారీ ఔర్ పురుష్ అన్నది ఎనౌన్సరు. ఇది యువమంచ్‌లో భాగమా? తప్పు ఎనౌన్స్‌మెంటా? ఇప్పుడు ఖరీ ఖరీ సీరియల్ నాటిక : బావమరిది వస్తే రామదీన్ అనే సేవకుడు ఎవరో అనుకుని అవమానకరంగా ప్రవర్తిస్తాడు. రామదీన్ కొంచెం పెద్దమనిషి. మాట్లాడితే ఏడిపించే భర్తని చీపురు కట్ట పట్టుకుంటుంది ఒక స్త్రీ- బ్రతుకు నకిలీ, బ్రతకటం నకిలీ అంటాడు రామదీన్. ఇందులో హీరో సేవకుడైన రామదీన్- బావమరిది రామదీన్‌ని బూట్లు పాలిష్ చేయమంటాడు- అవమానం ఫీలయిన రామదీన్‌ని యజమానురాలు కోప్పడి సోదరుడిని బూట్లు పాలిష్ చేయమనాలా? తప్పుకాదా అంటుంది - రామదీన్ యజమాని దగ్గరకు వెళ్లి నౌకరీ చేయనంటాడు. వచ్చిన బావ వల్లనా? అని సర్దుతాడు యజమాని. కాని బావమరిది రామదీన్ మీద దొంగతనం కట్టి పెట్టి తీసి చూస్తాడు.

ఇది నా ఇల్లు. నీవు అలా మాట్లాడకు. నీ సొమ్ము పోతే పోలీసుల్ని పిలుస్తాను అంటాడు యజమాని- ఇంతలో పోయిన గడియారం నాదగ్గరుందని ఫ్రెండ్ ఫోను చేస్తుంది. యజమానురాలు రామదీన్‌ని క్షమించమంటుంది, సోదరుడిని పొమ్మంటుంది. రామదీన్ యజమానికీ నౌకరుకీ ఉండే భేదం చెప్పి గ్రామానికి వెళ్లిపోతాడు. ఎన్నో సమస్యల్ని ఆ ఇంట్లో ఉండి పరిష్కరించిన రామదీన్ ఇంట్లో సభ్యుడు కాదు నౌకరు మాత్రమే. రాజేంద్రభాటియా ఇచ్చిన సీరియల్ బాగుంది.

## మర్చంట్ ఆఫ్ వెనిస్ :-

పోర్షియా స్వయంవరం - అంటే మగవాళ్లే పోర్షియాని వరించాలి. బంగారు, వెండి, సీసం పెట్టెలుంటాయి. ఒక సుల్తాను బంగారు పెట్టె తీస్తాడు. అందులో ఒక పుర్రె, కొవ్వొత్తి ఉంటాయి. బంగారు పెట్టె కావలసినదానికన్నా ఎక్కువిస్తుంది కనుక మిగిలింది వేదాంతం షేక్స్‌పియర్ కవితను గురించి చెప్పాలా? కావాల్సినంత ఇస్తుంది వెండి.

సీసం పెట్టెలో పోర్షియా ఫోటో ఉంది. సరే ఈ కథ అంతా వ్రాయనక్కరలేదు. ఇంగ్లీషు రానివాళ్లకు ఇది అక్కరలేదు. ఇంగ్లీషు వచ్చినవాళ్లు షేక్స్‌పియర్ 47 నాటకాలూ చదివే ఉంటారు. విలియం షేక్స్‌పియర్ 16వ శతాబ్దంలో పుట్టాడు. నాలో ఉన్న నాటక రచయిత్రి కొద్దిగా అయినా చెప్పమంటున్నది. ఆనాడు యూదుల్ని క్రిస్టియన్లు విపరీతంగా ద్వేషించేవారు- అలాగే షైలాక్ కూడా ద్వేషింపబడ్డాడు. డకెట్స్ బదులు మాంసం అడగటంలో ఆశ్చర్యంలేదు. కెంజెన్స్‌వేరాని. అందుకే అలా ప్రవర్తించాడు షైలాక్ - అంతరాంతరాల్లో షేక్స్‌పియర్ సానుభూతి ఉన్నట్లు తోస్తున్నది. కాని రాజకీయ పరిస్థితివల్లా మొదటి జేమ్స్ పరిపాలనలో ఉన్న కఠిన నిబంధనల వల్లా యూదులు మరింత ద్వేషంపబడ్డారు. మహా నాటక కర్త షేక్స్‌పియర్ ఎవరికీ అర్థం కాకుండా పోర్షియా ఆంటోనియో- బెసానియో- షైలాక్ పాత్రల్ని ఉత్తమంగా క్రిస్టియానిటీకి అనుకూలంగా చిత్రిస్తూనే షైలాక్‌కీ యూదు వర్గానికీ సానుభూతి ఇచ్చాడేమో అని నా అభిప్రాయం.

సాయంత్రం ప్రసారంలో పప్పెట్ షో బాగున్నది.

హిమాచల దర్శనం- ఆ జలధార కవితా వాల్మీకి ధార. వ్యాసవైయ్యాకరణి ధార. గర్వకట్టిన కాళిదాస కవితా వాహక ధార. వృద్ధ పరమేశ్వర అర్ధపలిన దివ్యధార అది హిమాచలం- మహా నదుల జన్మస్థలం మంచు మార్గం స్వర్గ మార్గంలా ఉంది. ఏకేశ్వరో పాసనతో చిన్న గుడి ఉంది. గంగ మహా వేగంతో దూకుతున్నది. మన పురాణాల్లో శివుడి శిరస్సున దూకటం అంటే సింబాలిక్‌గా ఇదేనేమో? గంగ వంతెన పునర్నిర్మిస్తున్నారు. ఆడపిల్లలు అందునా విదేశీయులు హిమాలయాల్ని చూస్తున్నారు. అది హిమాలయం అక్కడ మేథస్సూ సైన్సూ, కలిసి ఉంటుంది. □

"అప్నా ఉత్సవ్"లో ఒక దృశ్యం.



# ‘‘మహోజ్వల క్షేత్ర కూటమి మహేంద్రగిరి

నాడు ‘అశోకునిలో’ ధర్మచింతనకు, నేడు ‘శ్రీకృష్ణ చైతన్యుని’తో భావోద్రేకానికి దోహదకారియైన పవిత్ర దేశం ‘కళింగ దేశం’ నేటికీ ఈ ప్రాంతం మారుమూల పల్లెలోగల ‘బౌద్ధ విహారాలు, జైన మందిరాలు, దేవాలయాలు నాటి పవిత్రతకు ప్రతిబింబాలై ప్రకాశిస్తున్నాయి అట్టివానిలో మేటి ‘శ్రీ మహేంద్రగిరి క్షేత్రం’ దక్షిణాదిలో, తూర్పు పర్వతాలలో అత్యంత ఎత్తయినన పర్వతం, మహేంద్రగిరిపై వెలసిన, ‘శ్రీ గోకర్ణేశ్వరాలయం, తదితర ఆలయాలు’, ఇతిహాసపూర్వకంగా, చారిత్రాత్మకంగా ప్రసిద్ధి పొందినవి

శారీరక శ్రమలలో పర్వతారోహణకు మించినది లేదు సముద్ర మట్టానికి సుమారు 5000 అడుగుల ఎత్తునగల ఈ వనమూలికా ఔషధ కల్ప తరువు ‘మహేంద్రగిరి’ని సంవత్సరమున కొకసారియైనా అదిరోహిస్తే, మనిషి పరిపూర్ణ ఆరోగ్యవంతుడవడానికి అవకాశముంది అందుకే కొన్ని శతాబ్దాల క్రితం నిర్మింపబడిన ఈ దేవాలయాలు, నేటికినీ ప్రజాదరణ పొందుతున్నాయి

## నాటి కథ

మహేంద్రగిరిపై వెలసిన ఈ దేవాలయాలు నాటి పాండవులచే నిర్మింపబడినవని, ఈ క్షేత్ర పురాణం వెల్లడిస్తోంది

‘మనో జవగతి ర్భూత్వాయోగ యుక్తో యిధ’ విల:॥

హిమవంతమతి క్రమ్య గంధ మాదన మేవచ

ఇంద్రకీలం సమా సాధ్యతతో తిష్ఠద్ధనం జయః

-వాయుదేవుని వలె యోగ యుక్తుడగు అర్జునుడు మనో వేగముకలవాడై హిమవంతుని గంధమాదనమును దాటి, ఇంద్రకీల పర్వతము చేరి నిలిచెను (నేటి విజయవాడలోని ‘ఇంద్రకీలాద్రి అయి వుండవచ్చు)

ఇంద్ర కీలాద్రిపై ‘ఇంద్రుని’ సాక్షాత్కారము పొందిన ‘ఇంద్రతనయుడు’, ‘శచి ప్రియుని’ సూచనతో సర్వేశ్వర సాక్షాత్కారానికై

‘‘సోతీత్య వన దుర్గాణి సన్నికర్షం మహాగిరేః

శుశుభే హిమ వత్పృష్ఠేవ సమానోర్జునస్తదా!’’

-వన దుర్గములన్నింటిని దాటి ‘మహాగిరి’ సమీపమున హిమ వచ్చి భారమున నివసించుచు ప్రకాశించెను

పై ఘట్టంలోని ‘మహాగిరే’ నేటి ‘మహేంద్రగిరి’ అని భక్తుల నమ్మకం

అర్జునుడు పితృ కార్యనిర్వహణకై వేటాడు సమయాన, గ్రహపాటున కపిల గోవు చావుకు కారకుడయ్యెను గోవుచనిపోయిన తావులో, ‘కోటిలింగాలు’ వెలసి, కోటి లింగేశ్వరాలయం నిర్మితమయింది (బారువా గ్రామం). గోవు మృతదేహాన్ని మహేంద్రగిరిపై నివాసమునకు తీసుకు వెళ్ళునప్పుడు, గోవు గర్భమునగల ‘పొత్తు’ (ప్రేగులు) జారిపడిన ప్రదేశంలో ‘పొత్తీశ్వరుడు’

శ్రీ పొత్తీశ్వరాలయం – పొత్తంగి



శ్రీ పొత్తీశ్వరుడు – పొత్తంగి





కుంతీ ఆలయం – మహేంద్రగిరి

వెలిసి, పాతీ్తశ్వరాలయం నిర్మితమయింది. (పాత్తంగి గ్రామం) మహేంద్రగిరి చేరునప్పటికీ, 'గోకర్ణములు' జారిపడగా, ఆ తావులో, 'గోకర్ణేశ్వరుడు' వెలసి, గోకర్ణేశ్వరస్వామి ఆలయం నిర్మింపబడినది.

శ్రీకృష్ణునిచే ప్రబోధితులైన పాండవులు,గోహత్య దోష నివారణకై, కుంతీ సమేతులై 'ఆరు' ఈశ్వర లింగాలను ప్రతిష్ఠించి, ఆలయాలు నిర్మించేరని, అవియే నేటికినీ మహేంద్రగిరిపై ప్రకాశిస్తున్నాయని, భక్తుల విశ్వాసం. నేటికినీ 'కుంతీ ఆలయం, ధర్మరాజు ఆలయం, భీమాలయం' చెక్కు చెదరక నిలిచి, భక్తుల నమ్మకాలను నిలబెడుతున్నాయి. అర్జున, నకుల, సహదేవుల ఆలయాలు చిన్నచిన్న రాళ్ళతో నిలబెట్టబడి వున్నవి.

## నేటి కథ

ద్వాపర యుగానివని చెప్పబడుతున్న ఈ దేవాలయాలు అతి పురాతనమయినవని చెప్పడానికి, సాక్ష్యాధారాలున్నవి.

ప్రస్తుతం మహేంద్రగిరిపై నిలిచి వున్న మూడు దేవాలయాల నిర్మాణ శైలినిబట్టి, ఈ పర్వతం మూడు రాజ వంశాల మూల పుటమ్మగా అభివర్ణించవచ్చును.

'హస్తి వర్మ ఉర్లాం శాసనం'లో (క్రీ. శకం. 577) గోకర్ణేశ్వరస్వామి ప్రసక్తి వుంది. అంటే ఈ క్షేత్రం. క్రీ. శకం 6వ శతాబ్ది ముందే వెలుగులోనికి వచ్చినదన్నది నిర్వివాదాంశము.

కళింగ రాజ్యాన్ని పరిపాలించిన వారిలో 'గంగ వంశ రాజులు' ముఖ్యులు. వీరు గోకర్ణేశ్వరుని భక్తులు. మహేంద్రగిరిపైయున్న 'ధర్మజుని గుడి' నిర్మాణ శైలికి, 'శ్రీ ముఖలింగం ఆలయాలకు' కడు సారూప్యమున్నది, కనుక క్రీ. శకం. 8వ శతాబ్దిలో గంగ వంశరాజులచే, ధర్మజుని గుడి నిర్మింపబడి వుండవచ్చు.

మూడేసి రాళ్ళు సమంగా చెక్కి, మోపు చేసి, సున్నము లేకుండా కట్టు నిర్మాణశైలి, క్రీ. శకం 10-12 శతాబ్దంలో తూర్పు చాళుక్యుల కాలంలో వెలుగొందింది. మహేంద్రగిరిపైనున్న 'భీమాలయం', ఆ తీరుగనే నిర్మింపబడియుండుట చేతను, చాళుక్యులచే నిర్మింపబడిన 'బిక్కవోలు ఆలయాలను పోలి వుండుట చేతనూ, భీమాలయం చాళుక్యులచే నిర్మింపబడినదని భావింపవచ్చు.

క్రీ. శకం. 1455లో కటకమును పాలించిన 'గజపతు'ల కాలంలో 'ఓఢ్ర శిల్పం (ఉత్కళ) అభివృద్ధి పొందినది. పాతే్తశ్వరాలయం వీరిచే నిర్మింపబడినట్లు అక్కడగల శిలా శాసనం వెల్లడిస్తోంది. మహేంద్రగిరిపై "కుంతీ ఆలయం" కూడా ఓఢ్ర శిల్పమే కనుక, వీరిచే నిర్మింపబడియుండవచ్చు.

వివిధ రాజ వంశీయుల కళా, నిర్మాణ శైలులకు కూటమియై నిలిచిన మహేంద్రగిరి నిర్మాణాలు, నాటి మయుని జ్ఞప్తికి తెస్తాయి.

## నాటికీ; నేటికీ విశేషాలు

కీకారణ్యంలో భయంకరమయిన లోయలతో, అందమయిన ప్రకృతి శోభతో భయానందాలు కల్గించే ఈ మహేంద్రగిరి యాత్ర, జీవిత సమస్యలతో నిత్యం సతమతమయ్యే ప్రజావాహినికి మరపురాని మధురాను భూతులనిస్తుందన్నది అక్షర సత్యం. క్రూర మృగాలు సంచరించే అరణ్యంలో శివ రాత్రి మూడు రోజులూ యాత్రకు వచ్చే అశేష భక్తవాహినికి, చీమైనా కుట్టకపోవడం "శివునాజ్ఞ లేనిదే చీమైనా" కుట్టదన్న ఆర్యోక్తికి ప్రబల నిదర్శనం. ఆస్తిక నాస్తిక తారతమ్యాలు లేకుండా, లక్షలాది ప్రజలు, శివరాత్రికి జరిగే మూడు రోజుల ఉత్సవంలో పాల్గొంటారు. నిర్మానుష్యమైన ఈ అరణ్యత్రోవలో, సాధారణ రోజులలో పయనించడానికి ఎవ్వరూ సాహసించరు.

మహేంద్రగిరిలో దేవాలయాలను దర్శించుకుని, పాత్తంగిలోని పాతీ్తశ్వరుని పూజించి, బారువాలోని కోటి లింగేశ్వరుని కరుణా కటాక్షాలు పొంది, సముద్ర స్నానం చేసుకుని యాత్రను పూర్తి చేస్తారు భక్తులు.

ధర్మజుని గుడి – మహేంద్రగిరి





భీమ ఆలయం – మహేంద్రగిరి

భ్రమణమారి, ఎఱ్ఱ వ్రేళ్ళు, పురుషపతంగి, పాతాళగరిడి మున్నగు అరుదైన వన మూలికలు ఈ మహేంద్రగిరిపై లభించడం కూడా విశేషమే.

మహేంద్రగిరి కొండల మీదుగా ఉరకలు వేసే 'మహేంద్రతనయ' నది కూడా పుణ్య పాతీ్తశ్వర స్వామి ఆలయం ప్రక్క నుండి ప్రవహించి, కోటి లింగేశ్వరుని సమక్షంలో సముద్రంలో ఐక్యత నొందుతుంది. వర్షాధారంతోనే వ్యవసాయం చేసుకునే ఈ తావు కర్షకుల పాలిటి కల్ప తరువు ఈ 'మహేంద్రతనయ".

అత్యంత ఎత్తయిన శిఖరాన 'కుంతీ ఆలయం' చెంత బావి వుండడం, లక్షలాది యాత్రికుల స్నానాది కార్యక్రమములకు వినియోగింపబడడం కూడా విశేషమే.

## రవాణా సౌకర్యాలు

శ్రీకాకుళం జిల్లా, మందసా మండలానికి, సమారు 30 కి.మీ. దూరంలో నెలకొనియున్న ఈ క్షేత్ర దర్శనానికి, 25 కి.మీ. పాద యాత్రే గతి. రానూ, పోనూ 50 కి.మీ. నడిచిననూ, త్రోవలో కనిపించే సుందర ప్రకృతీ దృశ్యాలు శ్రమాధిక్యతను తెలియనివ్వవు.

## ఉపశ్రుతి :

ఆంధ్రా ఒరిస్సా పాలకులు, ఈ గిరి శిఖరం వరకూ రవాణా సౌకర్యాలు కలుగచేస్తే, మహేంద్రగిరి, పాత్తంగి బారువా (సముద్ర తీరం) మనోహరమైన క్షేత్ర కూటమియై ఆంధ్రా ఒరిస్సాలలో అందమయిన పర్యాటక కేంద్రముగా అలరారుతుందనుటలో అతిశయోక్తి లేదు.

వ్యాసం : నిడమర్తి ఆదిలక్ష్మీ ప్రసాద్
ఫొటోలు : ప్రసాద్, యుగంధర్

# ‘‘మహోజ్వల క్షేత్ర కూటమి మహేంద్రగిరి

నాడు ‘అశోకునిలో’ ధర్మచింతనకు, నేడు ‘శ్రీకృష్ణ చైతన్యుని’లో భావోద్రేకానికి దోహదకారియైన పవిత్ర దేశం ‘కళింగ దేశం’. నేటికీ ఈ ప్రాంతం మారుమూల పల్లెలోగల ‘బౌద్ధ విహారాలు, జైన మందిరాలు, దేవాలయాలు నాటి పవిత్రతకు ప్రతిబింబాలై ప్రకాశిస్తున్నాయి. అట్టివానిలో మేటి ‘శ్రీ మహేంద్రగిరి క్షేత్రం’. దక్షిణాదిలో, తూర్పు పర్వతాలలో అత్యంత ఎత్తయినన పర్వతం, మహేంద్రగిరిపై వెలసిన, ‘శ్రీ గోకర్ణేశ్వరాలయం, తదితర ఆలయాలు’, ఇతిహాసపూర్వకంగా, చారిత్రాత్మకంగా ప్రసిద్ధి పొందినవి.

శారీరక శ్రమలలో పర్వతారోహణకు మించినది లేదు. సముద్ర మట్టానికి సుమారు 5000 అడుగుల ఎత్తునగల ఈ వనమూలికా ఔషధ కల్ప తరువు ‘మహేంద్రగిరి’ని సంవత్సరమున కొకసారియైనా అధిరోహిస్తే, మనిషి పరిపూర్ణ ఆరోగ్యవంతుడవడానికి అవకాశముంది. అందుకే కొన్ని శతాబ్దాల క్రితం నిర్మింపబడిన ఈ దేవాలయాలు, నేటికినీ ప్రజాదరణ పొందుతున్నాయి.

## నాటి కథ

మహేంద్రగిరిపై వెలసిన ఈ దేవాలయాలు నాటి పాండవులచే నిర్మింపబడినవని, ఈ క్షేత్ర పురాణం వెల్లడిస్తోంది.

“మనో జవగతి ర్భూ త్వాయోగ యుక్తో యిధా’ విల:!!

హిమవంతమతి క్రమ్య గంధ మాదన మేవచ
ఇంద్రకీలం సమా సాధ్యతతో తిష్ఠద్ధనం జయః

-వాయుదేవుని వలె యోగ యుక్తుడగు అర్జునుడు మనో వేగముకలవాడై హిమవంతుని గంధమాదనమును దాటి, ఇంద్రకీల పర్వతము చేరి నిలిచెను. (నేటి విజయవాడలోని ‘ఇంద్రకీలాద్రి’ అయి వుండవచ్చు)

ఇంద్ర కీలాద్రిపై ‘ఇంద్రుని’ సాక్షాత్కారము పొందిన ‘ఇంద్రతనయుడు’. ‘శచి ప్రియుని’ సూచనతో సర్వేశ్వర సాక్షాత్కారానికై

“సోతీత్య వన దుర్గాణి సన్ని కర్షం మహాగిరేః
శుశుభే హిమ వత్పృష్ఠేవ సమానోర్జునస్తదా!”

-వన దుర్గములన్నింటిని దాటి ‘మహాగిరి’ సమీపమున హిమ వచ్ఛి భారమున నివసించుచు ప్రకాశించెను.

పై ఘట్టంలోని ‘మహాగిరే’ నేటి ‘మహేంద్రగిరి’ అని భక్తుల నమ్మకం.

అర్జునుడు పితృ కార్యనిర్వహణకై వేటాడు సమయాన, గ్రహపాటున కపిల గోవు చావుకు కారకుడయ్యెను. గోవుచనిపోయిన తావులో, ‘కోటిలింగాలు’ వెలసి, కోటి లింగేశ్వరాలయం నిర్మితమయింది. (బారువా గ్రామం). గోవు మృతదేహాన్ని మహేంద్రగిరిపై నివాసమునకు తీసుకు వెళ్ళునప్పుడు, గోవు గర్భమునగల ‘పాత్తు’ (ప్రేగులు) జారిపడిన ప్రదేశంలో ‘పాత్తీశ్వరుడు’



శ్రీ పాత్తీశ్వరాలయం – పాత్తంగి



శ్రీ పాత్తీశ్వరుడు – పాత్తంగి



కుంతీ ఆలయం – మహేంద్రగిరి

వెలిసి, పాతే్శ్వరాలయం నిర్మితమయింది. (పాత్తంగి గ్రామం) మహేంద్రగిరి చేరునప్పటికీ, 'గోకర్ణములు' జారిపడగా, ఆ తావులో, 'గోకర్ణేశ్వరుడు' వెలసి, గోకర్ణేశ్వరస్వామి ఆలయం నిర్మింపబడినది.

శ్రీకృష్ణునిచే ప్రబోధితులైన పాండవులు,గోహత్య దోష నివారణకై, కుంతీ సమేతులై 'ఆరు' ఈశ్వర లింగాలను ప్రతిష్ఠించి, ఆలయాలు నిర్మించేరని, అవియే నేటికినీ మహేంద్రగిరిపై ప్రకాశిస్తున్నాయని, భక్తుల విశ్వాసం. నేటికినీ 'కుంతీ ఆలయం, ధర్మరాజు ఆలయం, భీమాలయం' చెక్కు చెదరక నిలిచి, భక్తుల నమ్మకాలను నిలబెడుతున్నాయి. అర్జున, నకుల, సహదేవుల ఆలయాలు చిన్నచిన్న రాళ్ళతో నిలబెట్టబడి వున్నవి.

## నేటి కథ

ద్వాపర యుగానివని చెప్పబడుతున్న ఈ దేవాలయాలు అతి పురాతనమయినవని చెప్ప డానికి, సాక్ష్యాధారాలున్నవి.

ప్రస్తుతం మహేంద్రగిరిపై నిలిచి వున్న మూడు దేవాలయాల నిర్మాణ శైలినిబట్టి, ఈ పర్వతం మూడు రాజ వంశాల మూల పుటమ్మగా అభివర్ణించవచ్చును.

'హస్తి వర్మ ఉర్లాం శాసనం'లో (క్రీ. శకం. 577) గోకర్ణేశ్వరస్వామి ప్రసక్తి వుంది. అంటే ఈ క్షేత్రం. క్రీ. శకం 6వ శతాబ్ది ముందే వెలుగులోనికి వచ్చినదన్నది నిర్వివాదాంశము.

కళింగ రాజ్యాన్ని పరిపాలించిన వారిలో 'గంగ వంశ రాజులు' ముఖ్యులు. వీరు గోకర్ణేశ్వరుని భక్తులు. మహేంద్రగిరిపైయున్న 'ధర్మజుని గుడి' నిర్మాణ శైలికి, 'శ్రీ ముఖలింగం ఆలయాలకు' కడు సారూప్యమున్నది. కనుక క్రీ. శకం. 8వ శతాబ్దిలో గంగ వంశరాజులచే, ధర్మజుని గుడి నిర్మింపబడి వుండవచ్చు.

మూడేసి రాళ్ళు సమంగా చెక్కి, మోపు చేసి, సున్నము లేకుండా కట్టు నిర్మాణశైలి, క్రీ: శకం 10-12 శతాబ్దంలో తూర్పు చాళుక్యుల కాలంలో వెలుగొందింది. మహేంద్రగిరిపైనున్న 'భీమాలయం', ఆ తీరుగనే నిర్మింపబడియుండుట చేతను, చాళుక్యులచే నిర్మింపబడిన 'బిక్కవోలు ఆలయాలను పోలి వుండుట చేతనూ, భీమాలయం చాళుక్యులచే నిర్మింపబడినదని భావింపవచ్చు.

క్రీ. శకం. 1455లో కటకమును పాలించిన 'గజపతు'ల కాలంలో 'ఓఢ్ర శిల్పం (ఉత్కళ) అభివృద్ధి పొందినది. పాతే్శ్వరాలయం వీరిచే నిర్మింపబడినట్లు అక్కడగల శిలా శాసనం వెల్లడిస్తోంది. మహేంద్రగిరిపై "కుంతీ ఆలయం" కూడా ఓఢ్ర శిల్పమే కనుక, వీరిచే నిర్మింపబడి యుండవచ్చు.

వివిధ రాజ వంశీయుల కళా, నిర్మాణ శైలులకు కూటమియై నిలిచిన మహేంద్రగిరి నిర్మాణాలు, నాటి మయుని జ్ఞప్తికి తెస్తాయి.

## నాటికీ; నేటికీ విశేషాలు

కీకారణ్యంలో భయంకరమయిన లోయలతో, అందమయిన ప్రకృతి శోభతో భయానందాలు కల్గించే ఈ మహేంద్రగిరి యాత్ర, జీవిత సమస్యలతో నిత్యం సతమతమయ్యే ప్రజావాహినికి మరపురాని మధురాను భూతులనిస్తుందన్నది అక్షర సత్యం. క్రూర మృగాలు సంచరించే అరణ్యంలో శివ రాత్రి మూడు రోజులూ యాత్రకు వచ్చే అశేష భక్తవాహినికి, చీమైనా కుట్టకపోవడం "శివునాజ్ఞ లేనిదే చీమైనా" కుట్టదన్న ఆర్యోక్తికి ప్రబల నిదర్శనం. ఆస్తిక నాస్తిక తారతమ్యాలు లేకుండా, లక్షలాది ప్రజలు, శివరాత్రికి జరిగే మూడు రోజుల ఉత్సవంలో పాల్గొంటారు. నిర్మానుష్యమైన ఈ అరణ్యత్రోవలో, సాధారణ రోజులలో పయనించ డానికి ఎవ్వరూ సాహసించరు.

మహేంద్రగిరిలో దేవాలయాలను దర్శించుకుని,

ధర్మజుని గుడి – మహేంద్రగిరి





భీమ ఆలయం – మహేంద్రగిరి

పాత్తంగిలోని పాతే్శ్వరుని పూజించి, బారువాలోని కోటి లింగేశ్వరుని కరుణా కటాక్షాలు పొంది, సముద్ర స్నానం చేసుకుని యాత్రను పూర్తి చేస్తారు భక్తులు.

భ్రమణమారి, ఎఱ్ఱ వ్రేళ్ళు, పురుషపతంగి, పాతాళగరిడి మున్నగు అరుదైన వన మూలికలు ఈ మహేంద్రగిరిపై లభించడం కూడా విశేషమే.

మహేంద్రగిరి కొండల మీదుగా ఉరకలు వేసే 'మహేంద్రతనయ' నది కూడా పుణ్య పాతే్శ్వర స్వామి ఆలయం ప్రక్క నుండి ప్రవహించి, కోటి లింగేశ్వరుని సమక్షంలో సముద్రంలో ఐక్యత నొందుతుంది. వర్షాధారంతోనే వ్యవసాయం చేసుకునే ఈ తావు కర్షకుల పాలిటి కల్ప తరువు ఈ 'మహేంద్రతనయ".

అత్యంత ఎత్తయిన శిఖరాన 'కుంతీ ఆలయం' చెంత బావి వుండడం, లక్షలాది యాత్రికుల స్నానాది కార్యక్రమములకు వినియోగింపబడడం కూడా విశేషమే.

## రవాణా సౌకర్యాలు

శ్రీకాకుళం జిల్లా, మందసా మండలానికి, సమారు 30 కి.మీ. దూరంలో నెలకొనియున్న ఈ క్షేత్ర దర్శనానికి, 25 కి.మీ. పాద యాత్రే గతి. రానూ, పోనూ 50 కి.మీ. నడిచిననూ, త్రోవలో కనిపించే సుందర ప్రకృతీ దృశ్యాలు శ్రమాధిక్యతను తెలియనివ్వవు.

## ఉపశ్రుతి :

ఆంధ్రా ఒరిస్సా పాలకులు, ఈ గిరి శిఖరం వరకూ రవాణా శౌకర్యాలు కలుగచేస్తే, మహేంద్రగిరి, పాత్తంగి బారువా (సముద్ర తీరం) మనోహరమైన క్షేత్ర కూటమియై ఆంధ్రా ఒరిస్సాలలో అందమయిన పర్యాటక కేంద్రముగా అలరారుతుందనుటలో అతిశయోక్తి లేదు.

వ్యాసం : నిడమర్తి ఆదిలక్ష్మీ ప్రసాద్
ఫొటోలు : ప్రసాద్, యుగంధర్

# సీరియల్
# ఒకటి ఒకటి మూడు
## తేజోవతి



(గత సంచిక తరువాయి)

విశాల స్నేహితురాలి వైపు చూసింది నవ్వుతూ

సీతా ఏమో అనుకున్నాను మా చిరునవ్వుల సీతమ్మకు కూడా యింత ఆవేశం కోపం వున్నాయంటే నమ్మబుద్ధి పుట్టటం లేదు , వుత్త పిల్లి ఎల్లవనుకున్నాను అవసరం వస్తే పులిఎల్లవు కూడా సరేగానీ నే చెప్పేది కూడా అదే కదా

భార్యకు పట్టెడన్నం పెట్టటం దండగనుకునే వాళ్ళున్నారన్నావు కదా అలాంటి పరిస్థితి ఎందుకు రావాలి ఆడదానికంటున్నాను అదే ఆడఎల్ల కూడా మగపిల్లలతో సమానంగా అన్నయిస్తే ఒకళ్ల దయాధర్మాలమీద బతకాల్సిన అవసరం వుండదు కదే

సీత నవ్వింది

రామాయణం అంతా విని అన్న సామెత గుర్తొస్తోంది విశాలా కట్నం సొంతం తేలేదనో తెచ్చింది చాలలేదనో మిషమీద కిరసనాయిలు పోసి తగలబెడుతున్నారు యింటి కోడళ్లను

ఇక ఆస్తి హక్కుయిస్తే మంచంలో వున్న తల్లిదండ్రులను కూడా బయటకు నడవమని ఆ యిల్లు అమ్మేసి భాగం తెస్తావా తేవా అని పెట్రోలు పోసి తగలబెట్టరంటావా డబ్బే ప్రధానమనుకునేవాళ్లు

ఇంకా ఆ డబ్బుపిచ్చే ముదిరితే అమాయకులైన ఆడపిల్లల్ని వల్లో వేసుకుని ఆడఎల్ల ప్రాణాలకేకాదు వాళ్ల తల్లిదండ్రులను కూడా ఏదో విధంగా కబళించాలని చూడరా? చెప్పు విశాలా

సీతా అందుకే ఆడఎల్ల చదువుకోవాలంటాను నేను అవసరం వస్తే స్వతంత్రంగా బ్రతకగలిగే ఆత్మ విశ్వాసం పెంచుకోవాలంటాను యిటు పుట్టింటి వాళ్లతో గానీ అటు అత్తింటివాళ్లతో గానీ తన హక్కులకోసం ఎదురు తిరిగి పోరాడే స్థాయికి ఎదగాలంటాను

అలా ఎదిగిన పిల్లలమీద రాళ్ళు రువ్వడం కాకుండా అభినందించే స్థాయిం యీ సమాజం కూడా చేరుకోవాలంటాను

అసలు మన ఆడఎల్లల్లోనే వుంది తప్పు అయితే అతి మంచితనం లేకుంటే అతి మెతకదనం

వీళ్ల మొదర్నిటి కట్టుబట్టల్లో చేసే ఫాషన్లలో తప్పితే ఆలోచనల్లో రావటం లేదే

విశాల చాలా ఆవేశంగా అంటుంటే సీత చప్పట్లు కొడుతూ నవ్వుతూ అన్నది

బలే భలే నువ్వు కోపంగా వుంటే భలే వుంటావే విశాలా అందుకే అటు మీ వాళ్ళు యిటు మీ మధూ వాళ్ళు నీకు కోపం తెప్పిస్తుంటారేమో

చస్ నేను చాలా సీరియస్‌గా మాట్లాడుతున్నానే నువ్వు వేళాకోళం చెయ్యకు

నేను నిజంగానే చెబుతున్నాను మన ఆడఎల్లలకు పుట్టింటి వాళ్ళు ఏం పెట్టినా పెట్టకపోయినా బోలెడు అభిమానం జాలీ, ,

మా వదిన వుంది పదివేలిచ్చిన పుట్టింటి వాళ్ల మీద బోలెడు జాలీ ప్రేమా : వాళ్ళకు ఎంత పెడుతుందో , పైగా అన్నయ్య దగ్గరనుండే డబ్బులు తీసుకెళ్లి వాళ్ళకు పెడుతూ నెలలు నెలలు అక్కడుంటుంది

యిన్ని లక్షల అన్న కొడుకులంటూ కట్నబెట్టారు మా వాళ్ళు వీళ్ల దగ్గర రెండు రోజులుండాలంటే ఎంత కష్టపడిపోతుందో

అసలు మా అమ్మా నాన్నకు అవాల్సిందే అలా! తిక్క కుదరాలి అంటున్న విశాల అకస్మాత్తుగా ఆగిపోయి అడిగింది

సీతా అన్నట్టు అడగడం మర్చిపోయ్యాను, ఆఫీసునుండి రాగానే సినిమా హడావుడి ఆ తర్వాత యీ గోల

ఇంతకూ నువ్వెళ్లిన పనేమయింది?

ప్రసాద్‌గారు ఏమన్నారు?

సీత క్షణంసేపు మాట్లాడలేదు

తలుచుకుంటే ఆ అమ్మాయి కళ్లల్లో నీళ్ళు తిరిగినయి

ఏమీ కాలేదు విశాలా

**జరిగిన కథ–4** డాక్టర్ సుధా పరిమళ దగ్గర నర్సుగా పని చేస్తుంటుంది లక్ష్మి సుధ స్నేహితుడు డాక్టర్ శ్యామసుందర్ సరదాగా గడుపుదామని అక్కడికొస్తాడు అతడు లక్ష్మిని చూసి సీతా అని పిలుస్తాడు తనపేరు సీతకాదని చెబుతుంది అనాద అయిన లక్ష్మి సుధ ఇంట్లోనే ఉంటుంటుంది ఆ ఇంట్లో పనులన్నీ ఆమె చేస్తుంటుంది డాక్టర్ సుధకు ఇంకా పెళ్ళికాలేదు శ్యామసుందర్ మొదటి భార్య ఆత్మహత్య చేసుకుంటుంది రెండో భార్య లేచిపోతుంది సుధను ఒప్పించి లక్ష్మిని తన నర్సింగ్‌హోమ్‌లో రెండు నెలలు నర్సుగా పని చేయడానికై కారులో తీసుకు వెళుతుంటాడు శ్యామసుందర్ దారిలో సీత గురించిన ఆలోచనలు అతడ్ని గతంలోకి తీసుకువెళ్తాయి తన అన్నయ్య కుదిర్చిన బ్యాంకు ఉద్యోగి ప్రసాద్‌ని అతను అడిగిన కట్నం మూలంగా చేసుకోనంటుంది సీత ఉన్న ఇల్లు తాకట్టుపెట్టి డబ్బు సంపాదించడానికి ప్రయత్నిస్తానంటాడు అన్న రంగారావు తమ పరిస్థితి ప్రసాద్‌కు స్వయంగా వివరించడానికి సీత పూనుకుంటుంది ఇద్దరూ ప్రసాద్ ఫ్రెండ్ ఫోటో స్టూడియోకు వెళ్తారు ప్రసాద్ తన చెల్లెలి పెళ్లి అవసరంకోసం కట్నం ముందే ఇవ్వాలంటాడు సీత ఆశలన్నీ కూలిపోతాయి వరకట్నపు దురాచారం గురించి సీతకూ విశాలకూ మధ్య చర్చ జరుగుతుంది

"అంటే

"ఆయన యీ కట్నం తీసి చెల్లెలు అత్తగారి కివ్వాలిట

పైగా వాళ్ళు తొందర చేస్తున్నారు కొంచెం త్వరగా అంద చెయ్యమని అడిగారు '

విషాదంగా నవ్వింది సీత

' అయ్యాం సారీ సీతా అయామ్ వెరి సారి

నీకేమో అలా అయింది నీ మనసు బాగుళ్లేదు నాకేమో మానాన్నగారు అంత డబ్బు యివ్వను వేరే సంబంధం చూస్తానని వుత్తరం రాశారు ఇవ్వాళె వచ్చింది ఆఫీసుకు

మధూ వచ్చి బిజినెస్ మొదలు పెట్టడానికి అన్నీ మాట్లాడి పెట్టానని అతడన్నాడు

ఇద్దరం రెండు రకాలుగా కలతబారి వున్నాం అందుకే అంత టగ్ ఆఫ్ వార్ జరిగింది

ఇంతకూ ప్రసాద్‌గారు లాభం లేదన్నారంటున్నావు గదా ఏం 'చెయ్యబోతున్నావ్?

కోపం తగ్గిందేమో వచ్చి సీత పక్కన పడుకుంటూ అడిగింది

ఏం చెయ్యాలో తోచకనే చస్తున్నాను. సినిమా చూస్తున్నంతసేపూ అదే ఆలోచన అందుకే మధుగార్ని అంత పరిశీలనగా చూడలేదు నిన్ను అడుగుదామంటే నువ్వేమో ఈ లోకంలోనే లేకపోతివి నవ్వుతూ అన్నది సీత

చ పో అల్లరి చెయ్యకు అంటూనే మెల్లిగా అన్నది-

"మధూ అంటే నాకు చాలా యిష్టం సీతా.. అతడ్ని తప్ప యింకెవర్నీ చేసుకోను..

ఈ విషయం మా వాళ్ళు ఎంత త్వరగా గ్రహిస్తే అంత మంచిది."

అలో విస్తున్న సీత అమాంతం లేచి కూర్చుంది .

'విశాలా నాకో సాయం చెయ్యగలవా?'

'ఏమిటది?"

ఏమీ లేదు నాకిక్కడేదన్నా బ్రతుకు తెరువు చూపించు కనీసం వంట మనిషిగానయినా సరే.

నా ఆచూకీ మా వాళ్ళకు తెలియనివ్వకు ఎట్టి పరిస్థితుల్లో కూడా సరేనా " ఆశగా రెండు చేతులూ పట్టుకుని బ్రతిమాలుతూ అన్నది

"అక్కడ మీ అన్నయ్య తలెత్తుకు తిరగలేక చావాలి అంతేనా?

"అదేమిటే?

కాకపోతే ఏం జరుగుతుందనుకుంటున్నావు నువ్వు మీ వాళ్ళకు చెప్పకుండా, తెలియ చేయకుండా వుండడానికి నీ బాషలో ఏమంటావో గానీ ప్రస్తుతం మనం వుంటున్నా సమాజం పరిభాషలో 'లేచి పోవడం' అంటారు

మరి పెళ్ళికి ముందు చెల్లెలు లేచి పోయిందంటే మీ అన్నయ్య తలెత్తుకు తిరగ్గలడనీ, నలుగురిలో పరువుగా బతకగలడనే ధైర్యం నీకుందా?'

సూటిగా అడిగింది విశాల



# ఒకటి ఒకటి మూడు

నిర్ఘాంతపోయింది సిత నోట మాట రాలేదు కాసేపు రెండు నిముషాలు ఎవ్వరూ మాట్లాడలేదు

తర్వాత విశాల అన్నది అనునయంగా,

"సీతా. పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు నీ కోసం, నువ్వు సుఖంగా వుండాలని అంత అప్పు చెయ్యడానికైనా సిద్ధపడ్డ అన్నయ్య నువ్వు ఎవరింట్లోనో వంట పనో, పాచి పనో చేసుకు బతుకుతున్నావని తెలిసినా విని సహిస్తాడేంటి

అసలు యిది మన ప్రాచీన సాంప్రదాయమే

'జామాతాయ విష్ణు రూపాయ' అంటే అల్లుడు సాక్షాత్తూ విష్ణుమూర్తిగా భావిస్తూ లక్ష్మి వంటి తన కూతుర్ని సాలంకృతంగా ధారపోస్తాడు తండ్రి .

ఇది మనదేశంలోనే కాదే చాలా దేశాల్లో చాలా జాతుల సంప్రదాయాల్లో వుందే. కూతురికి, తమ ఖుంటి ఆడబడుచుకు ఏమీ యివ్వకుండా పంపడం అవమానంగా భావించే సాంప్రదాయం . అది తమకూ తమ వంశానికీ

• 'విస్సూ చరిత్రలూ భూగోళాలూ చెప్పకే నాకు "

'చరిత్రా భూగోళం కాదు సోషియాలజీ చెబుతున్నాను సోషియాలజీ ఆ పుస్తకాల్లో వున్న వివరాలు చెబుతున్నాను. తండ్రి తర్వాత కొడుకు వారసుడవుతున్నాడు అందుకని ఆడబిడ్డకు పసుపు కుంకుమ కింద పొలమో పుట్రో , నగో నట్రో , ఏదో ఒకటి తమ తాహతుకు తగ్గట్టు పెట్టి పంపుతారు.

ఈ నాటికి కొంత మందిలో పసుపు కుంకుమ కింద కూతురికి భూములు యిచ్చేవాళ్ళున్నారు భూమి కూతురు తరపు వాళ్ళు సాగు చేసుకునే అవకాశం లేదంటే డబ్బు రూపంగా యిస్తారు

కొంత మంది ఆ కట్నంగా యిచ్చిన డబ్బంతా పిల్ల పేరు మీద బ్యాంకిలో వేసేస్తారు, ఆ పిల్లకు ఎప్పటికైనా పనికి వస్తుందని

మరికొంత మంది యిచ్చిన కట్నం మీద అంత కంటే కనీసం కొంచెమైనా ఎక్కువ విలువ గల సొమ్ము పెడతారు ఆడపిల్లకు.'

అయితే యీ రోజుల్లో లోయర్ మిడిల్ క్లాస్ వాళ్ళు అప్పు ప్రపంచంలో వుంటున్నారు కనుక ఆ అప్పులు కొంతైనా తీర్చుకోవాలని తాపత్రయ పడుతున్నారు.

అంతే సీతా.. నువ్వు అనవసరంగా ప్రసాద్‌గారి మీద అసహ్యం పెంచుకోకు. నా మాట విని అన్నయ్య నీ సుఖం కోసం ఏర్పాటు చేసిన సంబంధం చేసుకుని అన్నయ్యను సంతోష పెట్టు. పిచ్చి ఆలోచనలు పెట్టుకోకు సీతా'

విశాల కూడా మంచం మీద లేచి కూర్చుని సీత భుజం మీద చెయ్యేసి ఓదారుస్తూ అన్నది.

సీతకు తన పరిస్థితి చూస్తుంటే ఏడుపు ముంచుకొస్తోంది ఆ కళ్ళల్లో నీళ్ళు తిరుగుతుండగా అన్నది-

హెల్మెట్లు ధరించాలిటా... అంటే ప్రభుత్వానికి రోడ్లు బాగు చేసే ఆలోచన లేదన్నమాట....



"విశాలా నాకు ప్రసాద్‌గారి మీద కోపం లేదు, అసహ్యం లేదు ఆయనంటే జాలి వుంది

కానీ మేము పంచుకోడానికి అభిమానం తప్ప ఆస్తులు లేనివాళ్ళం విశాలా

యీ సమాజంలో నాలాంటి వాళ్ళే ఎక్కువ వున్నారు అందుకే యీ 'కట్నమిచ్చే సాంప్రదాయం మాలాంటి వాళ్ళకు వురి తాడవుతోంది విశాలా

అన్నయ్య నా సుఖం కోసం చేస్తున్నాడన్నావు

నిజమేనే నేను సుఖంగా వుండాలని తను యిల్లమ్మి పూరి గుడిసెలో వుండడానికి సిద్ధపడుతున్నాడు

పెళ్ళాం మెడలో సొమ్ము అమ్మడానికి సిద్ధపడుతున్నాడు.

ఈ అప్పులతో పస్తులు కూడా వుండాల్సిన పరిస్థితులకు సిద్ధపడుతున్నాడు

అలాంటి అన్నయ్య కోసం నేనేమీ ఆలోచించకూడదా

నేనేమీ చెయ్యలేనా?

చెప్పు విశాలా చెప్పు

ఇదో ఒక్కటే చెబుతున్నాను నేను ఏ బావిలోనో పడి చావనన్నా చస్తాను కానీ అన్నయ్యకు మాత్రం అలాంటి పరిస్థితి రానివ్వను గాక రానివ్వను అంతే '

విశాల నిముషం పాటు ఎరుపెక్కిన సీత కళ్ళల్లోకి చూసింది ఎర్ర కలువలా మారిన మొఖం వైపు చూసింది

'అయితే యింకేం భేషుగ్గా వుంది నన్ను సలహా అడగడం దేనికి? నువ్వు బావిలోకి దూకు మీ అన్నయ్య వురి పోసుకు ఛస్తాడు , సరిపోతుంది " ,

"విశాలా?!"

"ఏం అబద్ధమన్నాననుకుంటున్నావా?"

పెళ్ళి నిశ్చయమైన పిల్లలు బావిలో పడి ఛస్తే నువ్వంటున్న సంఘం ముఖ్యంగా మీ పల్లెటూళ్ళో ఏమంటారో తెలుసా?

పెళ్ళికి ముందు చచ్చింది,

ఇంకెవడినన్నా చేసుకోవాలనుకుందో లేక కడుపో కాలో వచ్చిందో ఆ పిల్ల చచ్చింది అంటారు

అంత మాట విన్నంటే మీ అన్నయ్య చెల్లెలు పోతేపోయింది యిల్లు మిగిలిందని సంతోషిస్తూ కూర్చుని తింటాడు కదూ!" అనేసి చప్పున మంచం మీద వాలిపోయి పక్కకు తిరిగి ముసుగు తన్ని పడుకుంది విశాల

నిర్విణ్ణురాలయింది సీత నెత్తిన పిడుగు పడ్డట్టు మంచం మీద వాలింది కానీ కంటి మీద కునుకు రాలేదు

విశాల మాటలు యింత దాకా ఆలోచించని విషయాల వైపు మనసు మళ్ళించినయి

ఏం చెయ్యాలో తెలియని పరిస్థితుల్లో యించుమించు అర్ధరాత్రి దాటే దాకా అలా ఆలోచిస్తూనే వున్నది

తెల్లవారి పనులన్నీ ముగించుకుని విశాల ఆఫీసుకు బయలుదేరే దాకా యిద్దరూ ముభావంగానే వున్నారు

ఆఫీసుకు బయలుదేరబోతూ,

'స్కార్ఫ్ ఏమో కావాలన్నావుగా బజారొస్తున్నావా?" అని అడిగింది విశాల

సీతకు యిప్పుడే బజారు వెళ్ళాలని లేదు ఆ యాభై రూపాయలు మాత్రం అనవసరంగా ఎందుకు ఖర్చు అనిపించింది.

"ఆఁ ఏదో చెప్పి వచ్చాలే ఇప్పుడేమీ కొనాలని అనిపించటం లేదు " అన్నది.

"నిజమే సీతా. పెళ్ళి బట్టలు తీసుకోడానికి మీ అన్నయ్యా వదినా వస్తారన్నావుగా ఆ చీరలు తీసుకున్న తర్వాత వాటికి మాచింగ్‌గా లోపల పావడాలు తీసుకుందాం ;

అన్నట్టు అన్నా వదినా వాళ్ళు వస్తే యిక్కడకు తీసుకురా. అందరం కలిసి వెళదాం.

లేకుంటే అన్నయ్యా సున్నయ్యా .. అంటూ ఏ యాభై రూపాయల చీరో తీసుకుంటావు నువ్వు పెళ్ళికి. .

ఎప్పుడూ యీ ముతక వాయిలు చీరలు తప్పితే మంచి చీరే కట్టవు ఈసారయినా మంచి చీర కొనిపిస్తా! చక్కటి చీర కడితే బంగారు తల్లిలా

# ఒకటి ఒకటి మూడు

వుంటావు

అసలా కొసదేలిన గడ్డం, సోగ కళ్ళూ నాకు గనుక వుంటేనా, కృష్ణుడు గోవర్ధన గిరి ఎత్తి వేలి మీద తిప్పినట్లు యీ ప్రపంచాన్నంతా నా వేలి చుట్టూ తిప్పుకుండే దాన్ని కదూ అన్నది విశాల కట్టిన చీర మడతలు సరిచేసుకుంటూ

సీత పేలవంగా నవ్వుకుంది

'అందరూ మెచ్చుకునే యీ అందం అన్నయ్యకు తన భారాన్ని ఏం తగ్గించింది?

కాకుంటే పధ్నాలుగు వేల పెళ్ళి కొడుకును పది వేలకు తగ్గించిందేమో .

హు " అనుకుని పెదివి విరిచింది సీత

రేపు వెళ్ళరాదూ వూరికి?'

కాదులే వెళ్ళిపోతా

'అయితే పద నిన్ను బస్సు స్టాండుకు రిక్షా ఎక్కించి నే వెళ్తాను ఆఫీసుకు'

ఎంత చదువుకోకపోయినా బస్సుస్టాండుకు రిక్షా మాట్లాడుకుని ఎక్కలేనా విశాలా?

'అది కాదు.. రిక్షాకు రెండు రూపాయలవుతై అని నడిచినా నడుస్తావు అదీ నాగోల స్టాండింగ్ చాలా దూరం రిక్షా చేసుకుంటావుగా '

అలాగేనని తలూపింది సీత

* * * *

రోడ్డు చాలా రద్దీగా వుంది

తెనాలి రోడ్లు ఎప్పుడూ రద్దీగా వుంటాయి. ఊళ్ళోవాళ్ళే కాదు పక్క పల్లెటూళ్ళ వాళ్ళు పనులుంటే ఎప్పుడూ వస్తూనే వుంటారు చేతి కర్రలు చేతులు వెనక్కి తిప్పి భుజాల మీద పెట్టుకుని నడుస్తుంటే రోడ్డు సగం నిండి పోతుంది

సీత రద్దీ రోడ్డు దాటి పైన తూముల దగ్గర రోడ్డు క్రాస్ చెయ్యబోతోంది

ఆలోచనలు ఎక్కడో వున్నాయి.

యాంత్రికంగా అడుగులు పడుతున్నాయి పరిసరాలతో సంబంధం లేకుండా

ఈ పెళ్ళి ఎలా ఆపాలి..

ఎలా ఆపాలి?

తెగని ఆలోచనలతో రోడ్డు క్రాస్ చేస్తున్న సీతకు వెనుక కారు హారన్ విన్పించలేదు

కొట్టిన సడన్ బ్రేకుకు గీమంటూ బండి ఆగినా అది సీతను తాకకుండా ఆగలేదు

'ఈ వూర్లో మనుషులకూ జంతువులకూ తేడా లేదు' విసుగ్గా తలుపు తీసుకు దిగాడు డ్రైవరు

'ఏమైంది?' అంటూ కంగారుగా వెనుక సీట్లో నుండి దిగింది పెద్దావిడ

ట్రాఫిక్ కానిస్టేబుల్

మూగిన జనం .

కళ్ళ ముందు కమ్మిన చీకట్లు కాస్త తొలిగి ఎవరిదో చేయూతతో లేస్తున్న సీతకు,

"పెద్దగా దెబ్బలు తగల్లేదులెండి కొద్దిగా గీరుకు పోయింది అంతే" అనడం విన్పించింది ఎక్కడో అన్నట్లు

చీర కంటిన దుమ్ము దులుపుతూ,

"డ్రైవర్, డోరు తెరిచి పట్టుకో" అంటూ కారులోకి ఎక్కించడం తీలగా తెల్సింది

"జనరల్ హాస్పిటల్‌కు తీసుకు పోదాం ఎందుకైనా మంచిది."

సీత కిప్పుడు పూర్తిగా తెలివిలోకి వచ్చినట్లయింది

"అహ అక్కర్లేదండీ . నాకేం కాలేదు బాగానే వున్నాను అన్నది కంగారుగా పక్కన కూర్చున్న పెద్దావిడతో

ఆవిడకు యాభయి అయిదేళ్ళ వయసుంటుంది కట్టిన పట్టు చీర అంతస్థు తెలియ చేస్తుంటే బొట్టు లేని నుదురు వైధవ్యాన్ని సూచిస్తోంది మెడలో రెండు పేటల గొలుసు

మనిషి మాటలో చూపులో కూడా ఒక దర్పం ఆవిడ జవాబు చెప్పకుండా ఒక్క నిముషం అలా సీత వైపు చూసింది

డ్రైవరు కారు స్టార్టు చేశాడు

"రోడ్డు దాటేటప్పుడు నాలుగు వైపులా చూసుకోకుండా అంత పరధ్యానగా వస్తున్నావు . కొద్దిలో తప్పి పోయింది గానీ లేకుంటే ఎంత ప్రమాదం జరిగేది'

ఆ మాటల్లో మందలింపు వుంది

సీత చిన్నగా నిట్టూర్చింది.

'దురదృష్టవంతులకు అంత తొందరగా మృత్యువు కూడా రాదు లెండి అన్నది సీత

"అమ్మో" ఆత్మహత్య చేసుకోవాలంటే మా కారే దొరికిందా' అనుకున్నాడు డ్రైవరు మనసులో

"ఇంత చిన్నతనంలో అంత పెద్ద మాటలు మాట్లాడుతున్నావేమిటి అమ్మాయి ... అప్పుడే వైరాగ్యమా?' అన్నదావిడ

"ఏమీ చెయ్యలేని పరిస్థితిలో మిగిలేది వేదాంతమే కదండీ అన్నది అతి మెల్లిగా సీత

ఈ లోపున డ్రైవరు అడిగాడు వెనుకకు తల తిప్పి–

జనరల్ హాస్పిటల్ వైపు పోనిమ్మంటారా?

అహ వద్దు అనవసరం యీ మాత్రానికి ఏం కాదు వీలుంటె నన్ను బస్సుస్టాండ్ దగ్గర దించండి

బస్సుస్టాండుకు వెళుతున్నావా? ఏ వూరెళ్ళాలి?

సీత వూరి పేరు చెప్పింది

'సరే అయితే జనరల్ హాస్పిటల్‌కు వద్దు గానీ నేను ఘా స్నేహితురాలింటికి తీసుకెళ్తాను . కాసేపు కూర్చుని, కాస్త కాఫీ తాగితే ఆ షాకు తగ్గుతుంది మొహం కడుక్కుని కాస్త ఆ చీరా అదీ సర్దుకున్నాక అప్పుడే బస్సుస్టాండు దగ్గర దించుతాను "

ఆవిడ మాటలు సీతకు ఎలాంటి చాయిస్ యివ్వలేదు అంతేకాదు ఆవిడ తల్చుకున్నది, చెప్పింది చెయ్యటం యితరుల బాధ్యత అన్నట్లుగా కూడా వుంది

అయితే సీత యిది గమనించలేదు ఆవిడలా అనగానే తన వొళ్ళు చూసుకుంది

నిజమే రోడ్డు మీద పడిపోయిందేమో మొఖానికి, తలకూ, చీరకూ అంతా దుమ్ము కొట్టుకు పోయి, తలంతా రేగి మోచేతులు గీరుకు పోవడం. కొద్దిగా రక్తం కారుతూ వుంది

మీది యీ వూరు కాదా? సీత అప్పుడడిగింది

కాదు మాది గుంటూరు మా అబ్బాయి అక్కడ పెద్ద డాక్టరు జాగర్లమూడి సంగమేశ్వరుడ్ని చూడ్డానికి వచ్చి యిలా మా స్నేహితురాల్ని చూసి పోదామని వస్తున్నాను

కొడుకును గురించి చెబుతున్నప్పుడు ఆవిడ స్వరంలో ధ్వనించిన గర్వం చూసి, అదృష్టవంతురాలు, బాగా ఆస్తిమంతులు కాబోలు మా లాంటి సమస్య లుండవుగా అనుకుంది

సీత మాట్లాడకుండా కారులో కూర్చుంది

కారు ఒక పెద్ద యింటి ముందు ఆగింది

ఇల్లు పెద్దది చాలా అధునాతనంగా కూడా వుంది ఇంటి ముందు గేటుకు యిరువైపులా డాక్టర్ల పేర్లు చూసి ఓహో భార్యాభర్తలు యిద్దరూ డాక్టర్లు కాబోలు అనుకుంది సీత

కారు దిగంగానే యింటి మెట్లు దిగి వస్తున్నావిడ చూసి,

'మీరా రండి అంటూ ఆహ్వానించింది చిర్నవ్వుతో

మీ అత్తగారు లేరా? '

'లేరండీ నిన్ననే మా ఆడబడుచు గారి వూరు వెళ్ళారు వారానికి గానీ

రారేమో ' అంటూనే, కారులో నుంచి దిగుతున్న సీతను చూసి,

'యీ అమ్మాయి ఎవరు? అలా వుందేమిటి? అని అడిగింది

'ఎవరిపిల్లో, రోడ్డు దాటుతూ వుంటే మా కారు కింద పడింది పెద్దగా దెబ్బలు తగల్లేదులే ఎలాగో యిక్కడ కొస్తున్నాంగా నువ్వు చూసి మందేస్తావని తీసుకొచ్చాను '

అప్పటికి ఆవిడ లేడి డాక్టరని గ్రహించి నమస్కారం చేసింది సీత .

అప్పటికప్పుడే ఎదురుగా వున్న నర్సింగ్ హోముకు తీసుకెళ్ళి దెబ్బలు కడిగి మందు వేసింది

'కృష్ణవేణమ్మ గారూ మీరు యీ అమ్మాయిని తీసుకుని యింట్లోకి వెళ్ళి కాసేపు రెస్టు తీసుకోరాదూ నేనీ పేషంట్లను చూసి పంపించేసి వస్తాను ఎలాగు వచ్చారు భోజనం చేసి వెళ్ళచ్చు డాక్టరు గారు కూడా వూళ్ళో లేరు అన్నాదావిడ

'అహఁ వద్దులెండి నే వెళ్ళి పోతాను మొహమాటంగా అన్నది సీత

'ఎక్కడి కెళ్తావు షాక్ తగ్గడానికి మందిచ్చాను కాసేపు పడుకుంటే తేలిగ్గా వుంటుంది వెళ్ళచ్చు "

కృష్ణవేణమ్మగారు సీత యిక మాట్లాడ్డానికి అవకాశం యివ్వకుండా పద అదే యిల్లు మొహం కడుక్కుందువు గాని ' అన్నది ఆ యింటి వైపు నడుస్తూ

అక్కడ పని మనిషి యిచ్చిన కాఫీ తాగి, మొహం కడుక్కుని సోఫాలో కూర్చున్న సీతకు కళ్ళు మూతలు పడిపొయ్యాయి

సీతకు మళ్ళీ మెళుకువ వచ్చేసరికి ఆ అమ్మాయి హాయిగా మంచం మీద పడుకుని వుంది . పక్కనే కృష్ణవేణమ్మ గారు ఏదో వారపత్రిక చదువుకుంటూ మరో మంచం మీద పడుకుని వున్నారు కంగారుగా లేచిన సీతతో, ఎలా వుంది వొంట్లో? అని అడిగింది

తేలిగ్గానే వుందండి అన్నది సీత, నాలుగు చూపిస్తున్న గడియారం వైపు ఆశ్చర్యంగా చూస్తూ

'అవునూ యింత చిన్నవయస్సులో ఆత్మహత్య చేసుకోవలసిన అవసరం ఏమొచ్చింది నీకు? చదువుతున్న పత్రిక మూసేసి లేచి కూర్చుంటూ అడిగింది ఆవిడ

సీత తను కూడా లేచి కూర్చుంది

'లేదండీ నేను . నేను ఆత్మహత్య చేసుకోవాలనుకోలేదు ఏదో ఆలోచిస్తూ పరధ్యాసగా వస్తున్నాను అందుకని కారు హారను వినలేదు '

అదే, నలుగురు పిల్లాజల్లా సంసారం వున్న వాళ్ళయితే యిబ్బందులూ ఆలోచనలూ, పరధ్యాస అనుకోవచ్చు నీకింకా పెళ్ళి కూడా అయినట్లు లేదు నీకేమిటమ్మాయి ఆలోచనలు?"

ఆవిడ కోప్పడినట్లే అన్నది కానీ.. ఆ అనడంలో సీత విషయం తెలుసుకోవాలనే పట్టుదల వుంది

ఆవిడను చూస్తే చాలా తెలివిగలావిడలా వుంది సీతకు చప్పున ఓ ఆలోచన వచ్చింది సీత సంకోచంగా ఆవిడను తేరిపార చూసింది తనకు, సాయం చేస్తుందని తోచింది గాబోలు

అమ్మా మీరు గొప్పవారు మిమ్మల్ని చూస్తే కుటుంబం కూడా పెద్దదయి వుంటుందనిపిస్తుంది.

మీ యింట్లో నన్ను నన్ను అట్టే పెట్టుకుంటారా? . వంట పని, యింటి పని. మీరు ఏ పని చెప్పినా చేస్తాను

ఆశ్చర్యంగా చూసిందావిడ

పాతికేళ్ళ పెళ్ళి గాని పిల్లను మా యింట్లో పనికి పెట్టుకోనా? ఏం నీ కెవ్వరూ లేరా?

ఎవ్వరూ లేరని ఎలా చెప్పగలదు మౌనంగా వుంది

'అమ్మాయి, నువ్వేదో బాధల్లో వున్నావు నా సాయం కావాలంటే నాకు వివరాలు చెప్పక పోతే ఎలా?

ఆవిడలా కోపగించుకున్న తర్వాత సీతకు తన పరిస్థితి అంతా చెప్పక తప్పలేదు, ప్రసాద్‌గారితో తను మాట్లాడిన విషయం అంతా చెప్పి,

"ఎలాగైనా నాకో దారి చూపించండి... నా కోసం మా అన్నయ్య యిబ్బందులు పడటం నా కిష్టం లేదు. జన్మజన్మలకూ మీకు ఋణపడి వుంటాను' అన్నది నీళ్ళు నిండిన కళ్ళతో

క్షణం ఆలోచించింది కృష్ణవేణమ్మగారు

'కానీ నువ్వంటే అంత అభిమాన మంటున్నావు మీ అన్నయ్యకు, పెళ్ళీడు కొచ్చిన పిల్లను పరుల యిండ్లలో వంట పనికో, పైపనికో, పెట్టడానికి వొప్పుకుంటాడంటావా?'

"అన్నయ్య వొప్పుకోడు అందుకని డాక్టరు గారి దగ్గర ఆయన ఆస్పత్రిలో ఏదో వొక వుద్యోగమని మీరు చెబితే వొప్పుకుంటాడు వొప్పిస్తాను నేను '

ఆవిడ నవ్వింది

"డాక్టరు గారి దగ్గర ఏం వుద్యోగం చేస్తావు మందు లివ్వడానికైనా, పుళ్ళు కడగడానికైనా ట్రెయినింగు కావాలి. పైగా మా అబ్బాయి సర్జను ఎక్కువ ఆపరేషను కేసులే చేస్తాడు యింకేం వుద్యోగమని చెప్పమంటావు?'

సీతకు ప్రస్తుతానికి ఆవిడ తప్ప గత్యంతరం కన్పడలేదు పైగా అన్నీ మన మంచికే అనుకోమంటారు యిదే కాబోలు కారు కింద పడడం కూడా మంచిదే అయింది అనుకుని,

అమ్మా యీ సాయం మీరు తప్ప ఎవ్వరూ చెయ్యలేరు అన్నయ్యకు చెప్పండి వుద్యోగమని. అంతే ఆయన వచ్చి చూసేది లేదు పెట్టేది లేదు అథవా వస్తే అలా అని చెప్పండి

ఇంట్లో మీరు ఏ పని చెప్పినా చేస్తాను

మీ కాళ్ళ దగ్గర పడుంటాను నాకు నిలువ నీడ యివ్వండి నేను పెద్దగా



చదువుకోలేదు ఎనిమిదో తరగతి దాకా చదివాను మీకు భారతం, భాగవతం లాంటివి చదివి విన్పించమన్నా విన్పిస్తాను

ఆవిడ కాస్సేపు ఆలోచించింది

'సరే నేనిప్పుడే ఏమీ చెప్పలేను . అబ్బాయిని అడక్కుండా చెయ్యడం నా కిష్టం లేదు నా మాట మా అబ్బాయి కాదనడు అయినా చెప్పాలిగా వాడితో

అందుకని నీ అడ్రసు చెప్పు వెళ్ళాక అబ్బాయి నడిగి వుత్తరం రాస్తాను పైగా నువ్వేదో చెప్పకూడదని కూడా షరతు పెట్టావుగా ముందుగా వాడితో మాట్లాడకపోతే నీకు మళ్ళీ చిక్కులొస్తాయి

పొంగే పాల మీద నీళ్ళు చల్లినట్లయింది సీతకు

'కానీ . ఇల్లు వచ్చే సోమవారం రిజిస్ట్రేషను. ఈలోగా ఏ విషయం తెలియకపోతే నా ప్రయత్నమంతా వృధా అవుతుంది నేను ఏమి చెప్పినా రిజిస్టరు చెయ్యడం ఆపరు "

"సరే పోనీ.. యీ వారం లోపలే తెలియచేస్తాను అడ్రసివ్వు '

"మా అన్నయ్య అడ్రసుకు వద్దు.. మా పక్కింటి వాళ్ళ అడ్రసు చెబుతాను వాళ్ళమ్మాయికీ నాకూ స్నేహం.. తను బయట పెట్టదు:

సీత పక్కింటి వాళ్ళ అడ్రసు చెప్పింది..

"సరే... నువ్వు లేచి మొహం కడుక్కో... అమ్మాయి ఆస్పత్రికి వెళ్ళినట్లుంది చెప్పేసి వెళ్ళిపోదాం... నిన్ను బస్సుస్టాండులో దించేసి వెళ్తాను."

(ఇంకా వుంది)

### ఎమ్ ఎమ్ ఆర్. కాకినాడ

★ దేనికి భయపడాలి?

● చెడు చేయడానికి బయపడితే - యింక దేనికి బయపడవలసిన అవసరం రాదు

### పి. ఆర్. బి. కోటబొమ్మాళి

★ నేటి సమాజంలో మగవారి పాత్ర ఎంతవరకు?

● పూర్తిగా వారిదే కదండీ – సమాజం!

★ నేడు స్త్రీలకు ఎటు వంటి స్వేచ్ఛ లేదంటాను మీరు ఏమంటారు?

● ఉంది- మగవాని చెప్పుచేతల్లో వుండి, అతని మాట వేదవాక్కుగా, అతని దర్శనం దివ్య దర్శనంగా బావిస్తూ – అతని పర్మిషన్ పై వూపిరి తీస్తాననీ సంపాదిస్తాననీ, మనిషిగా చూడమని కోరననీ అనడానికి –వుంది స్వేచ్ఛ చాలా మందికి

★ ప్రేమించుకునే వారికి చివరికి మిగిలేది?

● బాధ్యత

### కె బి. ఆర్, కె ఎస్ ఆర్ చింతగుట్ట

★ సృష్టిలో తీయనిది మదురమైనది ఏది?

● లోకోః బిన్నరుచి అన్నారు– ఒకరికి మదురం యింకొకరికి చేదు కావచ్చు

★ నేటి చిత్ర సీమలో స్త్రీల గురించి – అంటే మీకు అర్థం అయివుండవచ్చు– అదే రకరకాలుగా అసభ్యంగా చెప్పు కుంటున్నారు– నిజమా?

● చెప్పుకొనే మాటల్లో నిజం చాలా తక్కువే వుంటుంది అయితే స్త్రీలని కనుక మరి సులబంగా అనేస్తారు అది స్త్రీలనే కనుక మీలాంటి వారికి నమ్మాలని వుంటుంది అంతేనా?!

### ఎమ్. ఆర్. డి బళ్ళారి

★ మీ ప్రశ్నావళి పి జి ఉడ్‌హౌస్ హాస్యం లాగా ఉంటుందంటే ఏమాత్రం అతిశయోక్తి కాదు– నమ్ముతారా?

● నమ్మాలనే వుంది గాని నాకంత కామెడీ – నచ్చదు!

★ మీ కడుపుతీపి ఈ మధ్య చదివాను రెండు




మూడు చోట్ల శృంగారం పాలు ఎక్కువ అనిపించింది

● ప్రతి అక్షరం బూతు ఆనవాయితి అయిన ఈ రోజుల్లో రెండు చోట్ల శృంగారం హెచ్చనిపించిం దంటే– నవ్వొస్తోంది ముందా – పచ్చి శృంగారం రాయడమే నాకు రాదే!

★ కాలానికి వంతెన మరోజన్మ రాణీ ప్రవర్తన ఏ సైకియాట్రిస్టో ఎనలైజు చేసి రాస్తే యింకా బాగుండేది

● ఏం? ఆమెకి పిచ్చి కాదు, మానసిక వ్యాధికాదు 'డిజావూ' అందరికి సహజం అది కొందరికి ఎక్కువ అంతే గతంలో ఇటు తిరిగాం అన్న జ్ఞాపకాలు శాశ్వతం కాదని డాక్టర్లు అనేదే పిల్లలని మనం పట్టి పట్టి జ్ఞాపకం చేస్తూ వుండక పోతే– ఈ విపరీతపు జ్ఞాపకాలు అవే సమసి పోతాయి అన్నది నేను నమ్ముతాను రాణీ జ్ఞాపకాలకి ఆధారం వుందంతే– అది కాకతాళీయం ఇక అమె పూర్వజన్మ లతిక రాస్తే – యింకొనవల రాయాలి– ఇదేం సినిమా కాదు ఫ్లాష్ బాక్‌లో కద చెప్పడానికి అంచేత – నేను లాజికల్‌గా కొన్ని సత్యాలకి స్వస్తి పల్కించాను కొన్ని మీ ఊహలకి వదిలాను

### కె. ఎ. ఎమ్. చీరాల

★ ప్రయివేట్ స్కూళ్ళలోను, కాన్వెంట్ల లోను పని చేస్తున్న చిరు వుద్యోగులు, టీచర్లపై, వాటిని నడిపే యజమానులపై మీ సునిశితాబిప్రాయం?

● నాకు కాన్వెంటు చదువులపై నమ్మకం లేదు చిన్న చిన్న స్కూళ్ళు కాన్వెంటు లంటూ బయిలుదేరి– పసి వాళ్ళను కోతులను చేసి ఆడించడం మినహా వాటి వల్ల ఉపయోగం శూన్యం ఏ పర్ ఏపిల్ రెండో ఏట చెప్పడం ఘనత కాదు ఐదేళ్ళకే బాస్టర్డ్ తిట్లు రావడమూ మంచిది కాదు ఇక కుక్క గొడుగుల లాగా ఓ అదుపూ అజ్ఞా లేకుండా స్కూళ్ళు పెరగడం – అభివృద్ధికి చిహ్నం కాదు వ్యాపారాబివృద్ధికే చిహ్నం అని నా అబిప్రాయం నర్సరీలు, ప్రీ స్కూళ్ళు క్రెషూ చాలా అవసరం పిల్లల కొక రకపు క్రమ శిక్షణ, మంచి అలవాట్లకు పునాది పడేది యిక్కడే అంచేతనే – కాన్వెంటు, యింగ్లీషు మాట్లాడడం కాదు ముఖ్యం పిల్లలు పిల్లలుగా పెరుగుతూ మంచి తత్వం అలవరచు కోవడం – దీనికి దారి తల్లితండ్రులు ఆలోచించుకోవాలి బేషజాలకు పోయి పసి ప్రాయాన్ని మూడో ఏట తుంచేస్తున్నాయి– నేటి యీ పిల్ల స్కూళ్ళు వీరిడిఆటు మాంటిసోరీ కాదు, ఇటు కిండర్ గార్డెన్ కాదు– బొత్తిగా కలగాపులగం కూడా కాదు అదే నా బాధ

### పి ఎస్ బి. ఆర్ కోటబొమ్మాళి

★ వరకట్న పిశాచిని రూపు మాపడానికి ప్రభుత్వం శ్రద్ధ చూపాలా? తల్లితండ్రులా?

● కట్టుకో బోయే – అమ్మాయి – అబ్బాయి ముందు పౌరుషం నేర్చు కోవాలి

★ నేను ఎప్పటి కేనా కట్నం లేకుండా పెళ్ళి చేసుకుంటా మీ అబిప్రాయం?

● ఏముందీ – రోజూ యీ విషయం పెళ్ళానికి జ్ఞాపకం చేసి పీడించవద్దని సలహా మాత్రం యివ్వగల!

### మధు అంఋసోలి

★ ఒక ప్రముఖ రచయితగా నా పేరు పైకి వెళ్ళాలంటే?

● ఓ పత్రికేనా పెట్టు కోవాలి ఓ ఎడిటర్నేనా పట్టు కోవాలి" లేదా ప్రతిభేనా వుండాలి అది గుర్తించ బడాలి

### టి జి. కె పొందూరు

★ మీ జీవితంలో మీరు చేసిన మంచి పని ఏమిటి?

● కోరిన వాడిని కట్టుకోవడం

కోరినంత మందినే – పిల్లల్ని కనడం ఆడదానికి ఇంత కంటే మంచి ఏముంది?

### కె ఆర్ ఆర్ బొబ్బిలి

★ నేనొక అమ్మాయిని ప్రేమించాను నేను వెడుతూంటే నన్ను చాలాసార్లు చూసింది ఆమె ఎవరో తెలియక నా పక్కనున్న నా ఫ్రెండ్ కామెంట్ చేశాడు ఇప్పుడామె నాపై కోపంగా వుంది నేనేం చెయ్యాలి?

● స్నేహితుల్ని మార్చండి మనిషిని అంచనా కట్టేది – అతని చుట్టూ చేరే స్నేహితులను బట్టే □



# నీళ్ళ కావిడి



విశ్వనాథ గణపతిరావు

ఎండ నిప్పులు చేరుగుతుంది ఆ ఎండ వేడికి రోడ్డు మీద తారు మరిగి స్థానభ్రంశం చెందుతుంది

అలాగే వడగాలి వీస్తుంది ఆ గాలి వేడికి వాహనాల మీదే ఎవరూ తిరగడంలేదు ఇక కాలినడక నెవరు తిరుగుతారు?

కాని నరసింహులు మాత్రం తిరుగుతున్నాడు కావిడేసుకుని నూతినుండి నీళ్ళు తోడి, ఇంటింటికీ మోస్తున్నాడు హోటళ్ళకు మోస్తున్నాడు పెళ్ళిళ్ళ సీజను గనుక వాళ్ళకీ, మోసి నీళ్ళు పోస్తున్నాడు

మోసి మోసి, చెమటతో తడిచిపోయాడు అతనేసుకున్న గుడ్డ బనీను, పంచె తడిసిపోయాయి

ఇంటికొచ్చి అవితీసి అరబెట్టాడు అరబెట్టి ఉన్న మరో పంచను తీగె మీద నుండి తీసి కట్టుకుని, అలా చూరు క్రింద ఉన్న నులక మంచంలో నడుం వాల్చాడు

నరిసింహులిది, ఏభైఐదేళ్ళకు పైబడిన వయసు అతనికి ముగ్గురు కూతుళ్ళు ఒక కొడుకు సంతానం

ముగ్గురు కూతుళ్ళకూ మూడు ముళ్ళు వేయించేసాడు

కొడుకు చేత మూడు ముళ్ళూ వేయించి, కోడల్ని తెచ్చుకున్నాడు

ఆరోజుల్లో పెద్దకూతురికి నూటపదహార్లు కట్నం ఇచ్చి పెళ్ళి చేసాడు ఆ తరువాత నడిపి కూతురికి నాలుగొందల పదహార్లు కట్నం ఇస్తేగాని పెళ్ళి కొడుకు తల్లి ఒప్పుకుందికాదు ఇదేమిటంటే?' కాలం మారింది అన్ని రేట్లుతో పాటూ, ఈ రేటూ పెరిగిందంది మరి మూడో కూతురికి మాత్రం మూడొందలతో తేలిపోయింది

అది హోటల్లో, సర్వర్ సాంబయ్యని ప్రేమించానంది పెళ్ళి చేసుకుంటానంది సాంబయ్య సరేనన్నాడు సాంబారిడ్లిలా ఉన్న ఆ పిల్లను వదులుకోలేక, కట్నం ఎంతకావాలని అడిగితే పైసాకూడా వద్దన్నాడు మరీబాగుందదని నరిసింహులే, ఆ హోటల్ ఓనరు దగ్గర ఓ మూడొందలు అప్పుచేసి, ఆ సొమ్ము అల్లుడికిచ్చి పోలమ్మ గుళ్ళో పెళ్ళి చేసేసాడు.

ఇప్పుడు ముగ్గురు కూతుళ్ళ కాపురాలూ చల్లగున్నాయి వాళ్ళ బ్రతుకులు వాళ్ళు బతుకుతున్నారు అప్పుడప్పుడు పండగలకీ పబ్బాలకీ వచ్చి పోతున్నారు, పిల్లలతో!

ఓసారి పెద్దకూతురు ఆదిలక్ష్మి అంది

ఇంకా ఈ నీళ్ళు మొయ్యడం ఎందుకయ్యా' ఆడుకాతో కూతో జీతం తెచ్చుకుంటున్నాడు కదా' ఆ మాత్రం గెంజినీకు పొయ్యలేడా? అని

దానికి ఓ బారమైన నిట్టూర్పు విడిచి, భుజం మీద తువ్వాలుతీసి ముఖానికి పట్టిన చెమట తుడుచుకుంటూ అన్నాడు నరిసింహులు

ఆడు గెంజి పొయ్యలేడనికాదే' అలవాటై పోయిన పాణం నాది ఏ పనీ సెయ్యకండా ఉండనేను ఈ నీళ్ళు మోసే మి అందర్ని పెంచుకొచ్చాను మీకు మనువులు సేసాను అనాగే నాను బతికున్నంత కాలం ఆడిమీద ఆదారపడకూడదను

కున్నానే! రెక్కలొంగినాక నా పేనం పోకండా ఉంటే అప్పుడు ఎనాగా, అటునాకు ఆ గెంజి పొయ్యకమానడు అన్నాడు కాని ఆ మాటల్లో పూర్తిగా నిజంలేదు. కొడుకు ఉద్యోగంలో జాయి నవ్వడానికి అప్పుచేసి కట్టిన సొమ్ము ఇంకా తీరలేదు అది. ముగ్గురు కూతుళ్ళ పెళ్ళిళ్ళకైన సొమ్ము మొత్తం కన్నా ఎక్కువ ఆ బారాన్ని కొడుకు మీదవేసి. తనూ కూర్చుని తినడం ఇష్టం లేదు నరిసింహులికి ' కాస్తో కూస్తో తన ఒంట్లో సత్తువ మిగిలే ఉంది అది కాస్తా నశించిపోతే అప్పుడు ఎలాగా బారం కావాలి వాడికి' అన్నది నరిసింహులి మనసులో ఉన్న అసలు నిజం'

సరే' అయ్య నీ ఇష్టం'' అంది అప్పుడు కూతురు

ఇప్పుడు నరిసింహులు చేసిన అప్పు చాలా వరకూ తీరి పోయాయి రాములవారి వీదిలో ఉన్న శాస్త్రిగారి దగ్గర చేసిన రెండు వేలు మాత్రం మిగిలి ఉంది

అది తీరిపోతే నరిసింహులు గుండెల నిండా గాలిపీల్చుకుందామనుకుంటున్నాడు

మావ' కూడు తిందువుగానిలే'... అప్పుడే. కుంతతో నీళ్ళు నెత్తిన పెట్టుకొచ్చి దాన్ని గుమ్మంలోనే దించి, కాలుమీద మోపు మూరు సంచసించి వెళుతూ మంచంలో పడుకున్న మావని చూసిన శివాలక్ష్మి అంది

కొతలి మాట విని, బారంగా కళ్ళు తెరిచి చూసి జొరమొచ్చినట్టుందే, లచ్చిమి నాకిప్పూట కూడొద్దు' అన్నాడు నరిసింహులు

కూడుతినకపోతే మరి కాస్తా నీర్సమయి పోతావు అయినా, ఇంతెండలో నీళ్ళు మోయమని నీ కొవుళ్ళు సెప్పినారు సెప్పు! నీ కెన్నిమార్లు సెప్పినా ఎవుళ్ళు సెప్పినా ఇనిపించుకోవుకదా' .. తిని పంచన తొంగోవుంటే నీకు కట్టంగుంటాదంటే ఎనాగ మావ'.

'అదికాదే'

ఇంకేంటీ సెప్పకు నువ్వీయాల్నుంచి ఆ నీళ్ళు మొయ్యడం మానేయ్!

"అది నావల్ల కాదే' అంటూ మంచంలోంచి

## నీళ్ళ కావిడి

లేచాడు

ఇక ఈ మనిషికి సెప్పలేం' అంటూ కుండతో నీళ్ళు పట్టుకుని లోపలి కెళ్ళిపోయింది శివాలక్ష్మి'

*     *     *     *     *     *

శివాలక్ష్మి గుమ్మంకి అవతల, చూరు క్రింద పీట వేసుకుని కూర్చుని, చేటలో బియ్యం వేసుకుని ఏరుతుంది

ఇంతలో శాస్త్రిగారు వచ్చారు ఆయన్ని చూసి చేట ప్రక్కన పెట్టి, పైటను ఒంటి నిండా కప్పుకుని బయటకు. గుమ్మంలోకొచ్చి వినయంగా నిలుచుంది

నరిసింహులు లేడా! లక్ష్మీ అని అడిగారు

లేడండి'

ఎక్కడికెళ్ళాడు? మూడు రోజుల్నుండి నీళ్ళు మొయ్యడానికి రావడంలేదు ఇలాగైతే వాడు చేసిన అప్పెపుడు తీరుతుందే' కాస్త చిరాగ్గా అన్నాడు

మీ కెంతివ్వాలండి? కాస్త ఆశ్చర్యంగా అడిగింది శివాలక్ష్మి నిజానికి, ఆయనికి, మావ అప్పున్నట్టు ఆమెకు తెలియనే తెలియదు

ఇంకా రెండువేల రూపాయల వరకూ ఇవ్వాలి ఇంతకూ వాడేడి? అని అడిగారు.

సూదిమందేసుకోడానికి డాక్టేరుకాడికెళ్ళినా డండి మూడు రోజుల కాడనుంచి జొరం కాస్తంత వాడికి'

కాస్త మాత్రం, కబురు చెయ్యొచ్చుకదా' వాడు వస్తాడని ఎదురుచూసి, చివరికి మేమే మోసుకో వాల్సి వస్తుంది ఇంకెవళ్ళనైనా మాకు నీళ్ళు పొయ్యమంటే పొయ్యడం లేదు ఒకవేళ పోస్తే నరిసింహులుచేత మేము పోయించుకోకూడదట

పోనీ ఆ పనే సెయ్యండి' ఇక మా మావ నీళ్ళు మొయ్యడు మీకేకాదు ఇంకెవళ్ళకీ పొయ్యడు ఆడి ఆరోగ్యం బాగుండనేదు

ఆ మాట విని శాస్త్రిగారు ఆశ్చర్యంగా చూసారు శివాలక్ష్మివైపు!..

మరి నాకివ్వాల్సిన డబ్బు సంగతో'.

ఇచ్చేత్తాం'.

ఎప్పుడు?

'ఎప్పుడిచ్చేదీ మా మావ రేపొచ్చి సెపుతాడు మీతో'

సరే' అంటూ-వెళ్ళిపోయారు శాస్త్రిగారు

ఆయన అలా వెళ్ళగానే, ఇలా వచ్చాడు శివాలక్ష్మి మొగుడు ఆదిబాబు ఆదిబాబుతో అంతా చెప్పింది శివాలక్ష్మి'

ఇప్పుడంత తొందరగా రెండు వేల రూపాయలు ఎక్కడ నుంచి తెచ్చి తీర్సాలే?

అయితే, మీ అయ్యసేత ఇంకా ఆ గొడ్డు సాకిరి సెయ్యిత్తావేటి? కాస్త చిరాగ్గా, కోపంతో అడిగింది శివాలక్ష్మి!

మా అయ్య ఇంకా కట్టబడుతుంటే నాకు ఇట్టమనుకున్నావేటి' సరే, ఎనాగోనాగ ఆ డబ్బు సంపాదించి కట్టేద్దాం' అంటూ ఆరోజంతా ఆలోచించి తను పని చేస్తున్న కంపెనీలో లోనుకోసం అప్లికేషన్ పడేసాడు.

లోనొచ్చిన తరువాత శాస్త్రిగారికా డబ్బు ఇచ్చేసి, తండ్రి తన కోసం చేసిన అప్పు తీర్చేసాడు

దానితో తండ్రి గుండె బరువు తీరుతుందను కున్నాడు, ఆదిబాబు!

కాని తను చేసిన అప్పు కొడుకు తీర్చడమెందుకో నరిసింహులికి మనస్కరించలేదు 'తను ఏదో తప్పుచేసినట్లు మోయరాని బారాన్ని కొడుకు నెత్తిన మోపినట్లు బాదపడిపోయాడు

ఏది ఏమైనా ఇక నరిసింహులు చేత నీళ్ళు మొయ్యడం మానిపించి విశ్రాంతి తీసుకోమన్నారు కొడుకూ కోడలూను'

*     *     *     *     *     *     *

ఓ రోజు'

ఆదిబాబు పని చేస్తున్న వర్క్‌స్పాట్‌లో, పైనుండి మూవింగ్ క్రెయిన్ తాలూకా పుల్లీ ఊడి మీద పడిపోయింది

ఈ హఠాత్సంఘటనకి సూపర్‌వైజర్లు ఆఫీసర్లు, తోటి కార్మికులు– చివరికి ఎమ్. డి కూడా ఆఘ మేఘాలమీద అక్కడికి చేరుకున్నారు చేరి ఆ దృశ్యాన్ని చూసి అవాక్కయ్యారు

ఇంటికి కబురు పంపితే భార్య, తండ్రి మిగతా 'బంధువులూ గొల్లున ఏడుస్తూ వచ్చారు

ఎందరువచ్చినా హాస్పటల్‌లో చేర్చిన తరువాత డాక్టర్లు ఎంత ప్రయత్నించినా పోయే ఆదిబాబు ప్రాణాల్ని నిలుపలేకపోయారు

నరిసింహులు తలబాదుకుని ఏడుస్తూ, ఒరేయ్' నీ కప్పుడే నూరేళ్ళు నిండిపోయాయా? . ఇక నువ్వు నేకండా మమ్మల్ని ఎట్టా బతకమంటావురా ఆదిబాబు?!.. మమ్మల్ని నీతో పాటూ తీసుకు పోరా' అంటుంటే అందరూ ఓదార్చారు

శివాలక్ష్మి ఏడ్చి, ఏడ్చి స్పృహ కోల్పోయింది

ఆదిబాబు అక్కలు శోక దేవతలే అయ్యారు

*     *     *

శాస్త్రిగారు, ఇంకా తెలిసిన వాళ్ళు వచ్చి కన్నీళ్ళు పెట్టుకున్నారు.

కూపన్

### ఆంధ్ర సచిత్ర వారపత్రిక

### గర్భస్థ శిశువు చెప్పిన కథలు

కథ వ్యాసం రాసిన వారి పేరు : ______________________

______________________

పూర్తి చిరునామా ______________________

పిన్ కోడ్ : ______________________

# ధర్మపథం — ఆహారభేదాలు

శాస్త్ర దృష్టి ననుసరించి మనం భుజించే ఆహారం మూడు విధాలు. అవి సత్వ, రజ, స్తమో గుణాలను మూడింటినీ అనుసరించి ఏర్పడినవి. వీటిని గురించి కల్కి పురాణంలో ఇలా చెప్పబడింది.

"ఉచ్ఛిష్ట మవశిష్టం వా
  పథ్యం పూతమభీప్సితమ్,
భక్తానాం భోజనం విష్ణో
  ర్నైవేద్యం సాత్త్వికం మతమ్
ఇంద్రియ ప్రీతి జనకం
  శుక్ర శోణిత వర్ధనమ్,
భోజనం రాజసం శుద్ధ
  మాయు రారోగ్య వర్ధనమ్.
అతః పరం తామసానాం
  కటుం చోష్ణవిదాహితమ్.
పూతి పర్యుషితం జ్ఞేయం
  భోజనం తామస ప్రియమ్."

(కల్కి పురాణం, తృతీయాంశం. 11–వ అధ్యాయం.)

భగవంతునికి నైవేద్యం పెట్టిన ఆహారం పులుపు, కారం మున్నగు తీవ్రమైన రుచులు లేనిదిగా హితమైనదిగా, కోరదగినదిగా ఉంటుంది. అది అవశిష్టమైనదిగా ఉన్నా, ఉచ్ఛిష్టమైనదైనా భక్తులకు చాలా అభిమతంగా ఉంటుంది. అది సాత్త్వికాహారం. రజోగుణయుతమైన రాజసాహారం




రసనేంద్రియానికి ఎంతో ప్రీతిని కలిగిస్తుంది. శుక్ర శోణితాలను వృద్ధి పరుస్తుంది. పరిశుద్ధమైన ఆ భోజనం ఆయురారోగ్యాలను పెంపొదిస్తుంది. ఇది సాధారణంగా అందరికీ ఇష్టమైనదిగా ఉంటుంది. ఇక – తామసాహారం తమోగుణం గల తామసులకు మిక్కిలి యిష్టమైనది. పాచి పోయినదయినా సరే, చెడు వాసన వేస్తున్నాసరే, అది వారికి ఇష్టంగానే ఉంటుంది.

మరొక సంగతి. సాత్త్వికాహారం ఇష్టమైన వారు వన నివాసానికీ, అట్టి ప్రశాంత స్థలానికీ ఇష్టపడతారు. రాజసాహారం భుజించే వారు గ్రామాల్లో నివసిస్తూ ఉంటారు. తామసాహార ప్రియులను జూదరుల గృహాలలోనూ, మద్యం విక్రయించే చోటా చూడవచ్చును.

ఈ ఆహారాలలో సాత్త్వికాహారం మేలైనది. రాజసాహారం మధ్యరకంలోనిది. తామసాహారం అవాంఛనీయమైనది.

**బులుసు వేంకటరమణయ్య**

---

ఇంతరిని విషాద సాగరంలో ముంచి, తనొక్కడూ నిర్విచారంగా కట్టెల్లో కాలిపోయాడు ఆదిబాబు!

ఆ రోజుకి ఆదిబాబు చనిపోయి తొమ్మిది రోజులయింది

ఆ రోజే పెద్ద దినం చేయమని పంతులుగారు చెప్పారు

దినంకి కావలసినవన్నీ నరిసింహులు రప్పించాడు

బంధువులూ, తెలిసినవాళ్ళు వచ్చి, అన్ని పనుల్లో సాయం చెయ్యసాగారు

అందరి వదనాల్లో విచారం రాజ్యం చేస్తుంది

శివాలక్ష్మి, కళ్ళలో ఊరే కన్నీటికి ఎవరూ అనకట్ట వెయ్యలేక పోతున్నారు.

నరిసింహులు పూర్తిగా డీలాపడిపోయాడు.

మధ్యాహ్నం పన్నెండవుతుండగా దినవారం భోజనాలు పెట్టారు, వచ్చిన వాళ్ళందరికీ!

తలా కాస్త తింటూ, బయటకు వచ్చి చేతులు కడుక్కుని వెళ్ళిపోతున్నారు.

కొంతసేపటికి నీళ్ళయిపోయాయి.

భోజనంచేసి ఎంగిలి చేతులతో వచ్చి బయట నిలుచుండి పోయారు కొందరు.

నీళ్ళయి పోయాయి

నీళ్ళయిపోయాయి

అంటున్నారందరూ!

ఆ మాటలు నరిసింహులుని చెవినబడ్డాయి ద్వారంకి ఇవతల గోడకు చేరబడి కూర్చున్న నరిసింహులు కళ్ళలో సుడులు తిరుగుతున్న కన్నీళ్ళను తువ్వాలుతో తుడుచుకుని, చుట్టూ చూసాడు.

కూతుళ్ళు ఓ మూల, కోడలు మరో మూల కూర్చుని ఏడుస్తున్నారు కూతురు తరుపువాళ్ళు, కోడలి అమ్మ, అయ్య కూడా శోక సముద్రంలో ఉన్నారు.

నరిసింహులు మెల్లగా నడుం పట్టుకుని లేచాడు

అడుగులో అడుగేసుకుంటూ మెల్లగా బయట కొచ్చాడు అక్కడంతా వెతికాడు,

కుండలు కనిపించాయి

ఉట్టిలు కనిపించాయి.

ఇంకా వెతుకుతున్నాడు.

"ఏంటి తాత! ఎతుకుతున్నావు?" అంటూ అడిగాడు, వంటపొయ్యిల దగ్గర నిలుచున్న ఓ కుర్రోడు

ఏం నేదురా! నీళ్ళయిపోయాయట! ఓ కావెడు నీళ్ళు తెద్దావని సూతున్నాను కుండలూ, ఉట్టిలూ ఉన్నాయిగాని! కావిడిబద్ద కనపడ్లేదురా! అన్నాడు నరిసింహులు అని మరలా వెతకసాగాడు వెతుకుతూ యదాలాపంగా ఆ కుర్రోడివైపు చూసాడు

వాడు బిగుసుకు పోయినట్టు నిలుచుండి పోయి, కళ్ళు తేలవేసి చూస్తున్నాడు

ఏట్రా సిమ్మాద్రి అట్టా సూతున్నావు? దాన్నెవుళ్ళయినా తీసికెళ్ళారేట్రా

అదికాదు తాత!" నీళ్ళు నమిలాడు ఆ కుర్రోడు.

సెప్పరా!

మద్దికి సిట్లిపోయిన కావిడిబద్దె కదాని ఇరిసి పొయ్యిలో పెట్టేసాను

ఆ మాట వినగానే నరిసింహులి గుండె కలుక్కుమంది నిలువునా వణికి పోతూ పొయ్యివైపు చూసాడు.

చెట్టంత కొడుకును కాల్చుకు తినేసిన మంటలు, ముక్కలైన కావిడిబద్దను కూడా కాల్చి బూడిద చేసేస్తున్నాయి □

## హైదరాబాద్ నోట్‌బుక్

### వరకట్నం ఆత్మహత్య :-

వరకట్నాలు ఎంతటి దారుణాలకు కారణమవుతున్నాయో నవంబర్ 17న ఐదుగురు తోబుట్టువులు చార్‌మినార్ నుంచి కిందికి దూకి ఆత్మహత్య చేసుకొన్న దుర్ఘటన చాటుతుంది. ఈ ఐదుగురిలో నలుగురు అక్క చెల్లెళ్ళు, ఒకరు సోదరుడు. సోదరుని పేరు సుబ్రహ్మణ్యం (28). సూర్యకుమారి(35), పద్మజ (18), జ్యోతి (16), ముద్దని(8) సోదరీమణులు. సుబ్రహ్మణ్యం కోరమండల్ ఫెర్టిలైజర్స్‌లో ఉద్యోగి. తను అక్కకు వివాహం చేయలేక పోయాననే ఆవేదనతో సుబ్రహ్మణ్యం, తక్కిన వారూ ఈ ఘాతుకానికి పాల్పడ్డారని పోలీసులు తెలిపారు. వీరి తండ్రి నెల్లూరులో వుంటున్నాడు. తల్లి రెండేళ్ళ క్రితం మరణించింది. తమ అక్కకు 35 సంవత్సరాలైనా పెళ్ళి కాలేదని ఎంత ఆవేదన పడ్డారో పాపం! కట్నాల నిప్పు ఈ విధంగా అమాయకులను కాల్చి వేస్తూంది. కట్నం చిన్నా పెద్దా అందరినీ పిశాచిలాగ పట్టుకుంది. చదువుకున్న వాడూ, చదువుకోని వాడూ, వివేకి, మూఢుడూ అంతా ఈ కట్న స్వామికి దాసోహమంటున్నారు. వికసించి, సంఘానికి ఎంతో కీర్తి తేవలసిన అమాయకులు ఈ విధంగా మొగ్గలోనే బుగ్గి అయిపోతున్నారు. కట్నాలు అడిగేవారికి పూర్వం ఒక మానదండం వుండేది. కట్నమనేది చదువుకు, సౌందర్యానికి ప్రత్యామ్నాయంగా వుండేది. ఇప్పుడు అలాకాదు. చదువు- పోస్టు గ్రాడ్యుయేటయి వుండాలి. సౌందర్యం- ఓ చిన్న తరహా సినీతార అయివుండాలి. ఉద్యోగం - ఒక చిన్న ఆఫీసరయినా, ఆ స్థాయికి తగిన మరేదయినా వుండాలి. కట్నమూ కావాలి. ఇంట్లో అన్ని పనులూ చేయాలి. ఈ అర్హతలన్నీ కలిగి ఇంటికి వచ్చిన పడుచు తెల్లవారు జామున లేచి వంట పనులన్నీ చేసి, ఉద్యోగం చేసి వచ్చి మరీ రాత్రీ వంటా వార్పూ చేసి, రాత్రి ఏ పది గంటలకో నిద్ర పోవాలి. ఆ సమయంలో పతిసేవ. మరి తెల్లవారు జామున పని- ఇవి వరుస. ఇంతయినా ఆమె పట్ల కనికరమనేది ఉండదు. భర్త వైపు ప్రతి వాడూ అధికారం చెలాయించే వాడే- కొంత మృదు హృదయ అయితే, కొంత కరకుగా ప్రవర్తించిందా- రాక్షసి, గయ్యాళి. కట్నాల ఆశ చదువుకోని సామాన్యులకే అనే భావం వుండేది నాకు. ఒక సంఘటన చూచిన తర్వాత లోభ మోహాలు బలవానింద్రియ గ్రామో విద్వాంస మపి కర్షతి- అనే వ్యాససూక్తి అర్థమయింది. మూడు దశాబ్దాల నాటి మాట. ఒక సుప్రసిద్ధ పండితుని కుమారునికి ఒక జడ్జీగారు పిల్లనిస్తానని వచ్చారు. పండితుడు సహజంగా మంచి ఉద్దేశాలు కలవాడే. ఆశపాతకుడు కాదు. న్యాయదృష్టి కలవాడు. కాని, శిష్య వర్గం ఆయనను ఎగసనదోసింది - మనపిల్లవాడేంసార్, రాజాలాంటి వాడు. పోస్టు గ్రాడ్యుయేటు. జడ్జీగారికి ఇలాటి వాడు దొరకాలి గదా! పది పదిహేను లక్షలు బ్యాంకుల్లో వుందట. కట్నాలు వద్దనుకున్నా లాంఛనాలు బాగా అడుగుదాం - అన్నారు. ఏ వీక్ గడియలలో వున్నాడో పాపం! లొంగి పోయాడు బ్రాహ్మడు. వెండి బిందెలు, వెండి గంగాళాలు, వెండి చెంబులు, వెండి గ్లాసులు, ఆడబడుచులకు పట్టు పీతాంబరాలు కాక వెయ్యినూటపదార్లు, బంగారు కాసులు- మొత్తం ధాదాపు లక్ష రూపాయల లాంఛనాల జాబితా తయారు చేశారు. నేనూ, ఆ లాంఛనాధ్యర్యంలో వున్నాను. సార్, వాళ్ళు అల్లుడికి ఏమయినా ఇచ్చు కుంటారు. మనకెందుకు? కలవారు గనుక బాగానే మర్యాదలు చేస్తారు. ఈ జాబితా మంచిది కాదు. మీ ఉదాత్తతకు భంగకరం. ఇంత పెద్ద మనిషి ఇంత కక్కుర్తి పడ్డాడా? అని అవతలి వాళ్ళనుకుంటే మీకు తల వంపులు- అని గోల పెట్టాను. వాళ్ళు నా మాట వినలేదు. జాబితా పంపారు. జడ్జీగారు జాబితా చూచారు. ఇంత పెద్ద జాబితా పంపారు కదా! వారి సోషల్ స్టేటస్ ఏమిటి?- అని ప్రశ్నించారు. జాబితా అందజేసిన మహానుభావులు కిక్కురు మనకుండా తిరిగి వచ్చారు. నా మీద ఎగిరి పడ్డారు- అవ లక్షణాలు పలికావు. చెడిపోయింది -అని. ఆ కోపం మరి కొందరు పెద్ద పెద్ద మనుష్యులు రాయబారం చేసే వరకు - దాదాపు మరణం వరకు- ఆ పండితులకు నా మీద వుండనే వుండేది. కనుక సామాన్య మానవులు డబ్బుకు ఆశించడం సహజం. కాని కట్నాలొక విధాయకంగా పరిణమించి సంఘాన్ని కుంగదీస్తూంది. ఇది చట్టాలతో రూపు మాసేది కాదు. మనలో మనఃపరివర్తనం కలగాలి. ఆ పరివర్తనం ఇలాటి ఘాతుకాలు ఎన్నో జరిగితేనే గాని కలుగదు.

### బ్రాహ్మణ సమ్మేళన్ :-

నవంబర్ 15, 16 తేదీలలో జరిగిన అఖిల భారతీయ బ్రాహ్మణ సమ్మేళన్ బ్రాహ్మణులు ముడుచుకొని కూర్చోకుండా, సంఘంలో తమ స్థానాన్ని పదిల పరచుకోడానికి గట్టిగా నిలబడాలని బ్రాహ్మణులను హెచ్చరించింది. అఖిల భారత బ్రాహ్మణ మహాసభ, జంటనగరాల ఆల్ బ్రాహ్మిన్ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ మహా సభల సంయుక్త కృషితో ఏర్పాటయిన ఈ సమ్మేళనాన్ని మహారాష్ట్ర మాజీ గవర్నర్ శ్రీ కోన ప్రభాకరరావు ప్రారంభిస్తూ, బ్రాహ్మణులు సంఘంలో గౌరవ ప్రతిష్ఠలతో మనడం కోసం గట్టి రాజకీయ శక్తి రూపొందాలని, ఇలా జరుగక పోతే, కష్టాలు తీవ్ర మవుతాయని హెచ్చరించారు.

స్వాగతం చెప్పిన అఖిల భారత బ్రాహ్మణ మహాసభ ప్రధాన కార్యదర్శి శ్రీ హరిహర రామశర్మ

నవంబరు 17 న చార్మినార్‌పైనుంచి దూకి ఆత్మహత్య చేసుకున్న శ్రీ వి. సుబ్రహ్మణ్యం, అతని నలుగురు అక్క చెల్లెళ్ళ మృత దేహాలని చిత్రంలో చూడవచ్చు








ఆరేళ్ళ మొదలు అరవయ్యేళ్ళ వరకు....



అందరికీ
అభిమాన
పత్రిక

**ఆంధ్రపత్రిక**



తిరువనంతపురం తెలుగు సాంస్కృతిక సంఘం దీపావళి సందర్భంగా శ్రీ జి. వి. చారి దర్శకత్వంలో ప్రదర్శించిన 'పెళ్ళి సందడి' నాటికలో పాల్గొన్న శ్రీయుతులు మల్లికార్జునరావు, పి. భాస్కరరావు, కుమారి పి. ఎస్. ఎ. భవాని, కె. టి. సురేష్, పి. ఎస్. ఆర్. ఎ. శ్రీనివాసశాస్త్రి, బి. వెంకటరమణ, జి. జగన్నాధ్, జి. వి. చారి గార్లని చిత్రంలో చూడవచ్చు.

# ఉత్తరాలు...

( 7 వ పేజీ తరువాయి)

## వ్యాసాలు

పూర్ణిమ ముఖ చిత్రంతో వెలువడిన ఆంధ్ర సచిత్ర వారపత్రిక అందంగా, చూడ ముచ్చటగా ఉంది. శ్రీ ఉమారుద్ర కోటీశ్వరాలయ విశేషాలు– ఉమాదేవి మూల విగ్రహం, శ్రీ రుద్రకోటీశ్వరుని అచల లింగం, మహానంది, ఆలయ శిఖరం, గర్భగుడిపై శిల్పకళ, గంగా సమమైన నాగావళి

ఫోటోలు నాకు నచ్చినాయి. ప్రతివారం ఆంధ్ర సచిత్ర వారపత్రిక చదవకుంటే నాకు తోచదు.

ఎస్. రామచంద్రమూర్తి, రామగిరి, నల్లగొండ

## దూరదర్శనం

కొత్త శీర్షిక "దూరదర్శనం" చదివి ఈ ఉత్తరం వ్రాయకుండా వుండలేక పోతున్నాను. టి. వి. లలో ప్రసారమయ్యే ప్రసారాలపై శ్రీమతి లతగారి విమర్శ, సద్విమర్శలు ప్రతి వారం సమర్థవంతంగా వుంటాయని ఆశిస్తున్నాను. ఇక తెలుగు ప్రసారాల గూర్చి హైదరాబాద్ టి. వి. పై చేసిన విమర్శ ఎంతో సహేతుకంగా వుంది. ఆమె తన శీర్షికలో హైదరాబాదు టి. వి. రిలే చేసిన (31-10-86) నాడు తెలుగు కార్యక్రమాలని చక్కగా విమర్శించారు. విచిత్రం ఏమిటంటే, ఈ శీర్షిక చదివిన వెంటనే ఆ రోజు టి. వి. పెడితే (17-11-86) హైదరాబాదు నుండి రిలే అయిన కార్యక్రమాలు ఏమిటో తెలుసా? లతగారు విమర్శించిన ప్రసారాలే! తు. చ. తప్పకుండా, అక్షరంగాని, దృశ్యంగాని పొల్లు పోకుండా వరసగా తిరిగి ప్రసారం చేశారు మన హైదరాబాద్ టి. వి. వారు!

ఇది టి. వి. వారి అశ్రద్ధ అంటారా? ఎలాగూ విమర్శలున్నాయికదా? మనం ఎలా ప్రసారం చేసినా ఫరవాలేదనే నిర్లక్ష్య ధోరణా?

"దూరదర్శనం" శీర్షిక టి. వి. వారికి, ముఖ్యంగా హైదరాబాదు కేంద్రం వారికి కనువిప్పు కావాలని ఆశిస్తూ–

బొజ్జా వేంకటేశ్వరరావు, విశాఖపట్నం □

## హైదరాబాద్ నోట్ బుక్

తమ స్వాగతోపన్యాసంలో బ్రాహ్మణ సంఘం కష్టాలను అధికారంలో వున్న పెద్దలకు తెలిపి, వాటిని తొలగించడానికి ప్రయత్నించాలని శ్రీ కోన ప్రభాకరరావును కోరారు. జంటనగరాల ఎ. బి. సి. డి. మహాసభ అధ్యక్షుడు శ్రీ కె. ఎల్. మనోహర్ ఈ సమ్మేళనానికి అధ్యక్షత వహిస్తూ, బ్రాహ్మణులు తాము తక్కువ అనే భావంతో బాధపడడం అనవసరమని, తమ వారసత్వం విషయంలో వారు తల ఎత్తుకొని తిరగాలని ఉద్బోధించారు. బ్రాహ్మణులందరూ ఐకమత్యంతో ప్రవర్తించాలని ఆహ్వాన సంఘాధ్యక్షురాలు శ్రీమతి దుర్గా భక్తవత్సలం కోరారు. వృత్తిని బట్టి ఎన్నో వేల ఏళ్ల కింద ఏర్పడిన ఈ కుల వ్యవస్థ వృత్తులు మారినా ఇంగువ కట్టిన గుడ్డలాగ వుంది. బ్రాహ్మణులు మళ్ళీ తమ పూర్వస్థానాన్ని సంపాదించుకోవాలంటే, అప్పటి గుణగణాలు కూడ అలవరచుకోవాలి. అన్ని వృత్తులకూ ఎగబాకుతూ, మేము గొప్ప అంటే, ఎవరూ గౌరవించరు. పూర్వం లాగ యజనాయాజన అధ్యయన అధ్యాపనాల వరకే తమ వృత్తిని పరిమితం చేసుకొని యధాలాభ సంతుష్టులై సంఘపురోభి వృద్ధికి తోడ్పడితే అప్పటి గౌరవమే కాదు, అదనంగాను గౌరవం వుంటుంది. ఇప్పుడూ అలాంటి వారు గౌరవంతోనే బతుకుతున్నారు అన్ని రాష్ట్రాలలోను.

### ఆకలి యాత్ర :–

నవంబర్ 6వ తేదీన మహబూబ్ నగర్ జిల్లా కిల్లాపూర్ నుంచి బయలు దేరిన ఆకలి యాత్ర నవంబర్ 13న రాజధాని చేరి ముఖ్య మంత్రికి మహబూబ్ నగర్ జిల్లాలోని ఆకలి చావులను గురించి మెమోరాండం అందజేసింది. ఈ యాత్రలో స్త్రీలు, పురుషులు తమ మూటా ముల్లెలతో చంటి పాపలతో పాల్గొన్నారు. దారి పొడవునా ఆయా గ్రామాలలో కమ్యూనిస్టు పార్టీ కార్య కర్తలు చేరారు. సైకిళ్ల మీద కూడ వచ్చారు. ఈ యాత్ర సచివాలయం చేరగానే కమ్యూనిస్టు పార్టీ లెజిస్లేచర్ పార్టీ ఉపనాయకులు శ్రీ రజాబ్ అలీ, శ్రీయుతులు ఎస్. సుధాకర్ రెడ్డి, ఎం. లింగారెడ్డి (మహబూబ్ నగర్ జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శి) మరి ముగ్గురు గల ప్రతినిధి వర్గం ముఖ్య మంత్రి శ్రీ ఎన్. టి. రామారావును కలుసుకొని మెమోరాండం అందజేసింది. లక్షమంది వ్యవసాయ కూలీలకు, ఇతరులకు ఆరు నెలల పాటు నెలకు 50 రూపాయల పెన్షన్ ఇవ్వాలని ఈ మెమోరాండంలో కోరారు. ప్రత్యేక పెన్షన్లు ఇది వరకే మంజూరు చేశామని, జూరాల ప్రాజెక్టు ద్వారా ప్రజలకు పనులు కల్పిస్తామని ముఖ్యమంత్రి అన్నట్టు కమ్యూనిస్టు వర్గాలు తెలిపాయి.

### ఉపశ్రుతి :–

నవంబర్ 8వ తేదీన మద్రాసు మైలాపూర్‌లో భారతీయ విద్యా భవన్ హాలులో శ్రీ వావిళ్ల వేంకటేశ్వర శాస్త్రి గారి శతజయంతి జరుగుతూంది. ఒక శ్రోత వచ్చాడు. ఎన్నాఇదు? (ఏమిటిది?) అనడిగాడు. చెప్పాను. వావిళ్లవా? ఆంధ్రాకారరా? అవరై పత్తి పేశువార్. వేరే ఒన్నుం ఇల్లియే (వావిళ్లనా? ఆంధ్రులా? ఆయనను గురించి మాట్లాడుతారు. మరేమీ లేదుగదా!)– అంటూ వెళ్లి పోయాడు. చూచారా, మనదేశంలోని సమైక్య భావం?– అన్నారు నాపక్కన కూర్చున్న శామిత్రులు సెట్టి ఈశ్వరరావుగారు. ఇదేమీ వింతకాదు. నేను ఆంధ్రుణ్ని. గోదావరీ ప్రాంతం వాణ్ని – అని జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి గారు అన్నారట శ్రీ అశుతోష్ ముఖర్జీతో. ఆయన హూ ఇజ్ అంధ్రా? వ్వేర్ ఇజ్ గోడ్వా ఒర్రీ? అని అడిగాడట– అన్నారు.

–తిరుమల రామచంద్ర

# షార్జా క్రికెట్ వేడుకలు



షార్జా షేక్‌తో భారత క్రికెట్ జట్టు

అరేబియా ఎడారి ప్రాంతము, అరేబియా గల్ఫ్ తీరమున షార్జా నగరములో నవంబరు 27 నుండి నాలుగు దేశముల క్రికెట్ పోటీ ప్రారంభము అయినది. ఈ పోటీలలో మనదేశం, పాకిస్తాన్, శ్రీలంక, వెస్టిండీస్ దేశాలు పాల్గొంటున్నాయి. మొదటి పోటీ ఇండియా, శ్రీలంకల మధ్య, పాకిస్తాన్ వెస్టిండీస్‌ల మధ్య జరుగుతుంది.

షార్జా నిదరపోవుచున్న నగరముగా చెప్పబడు తుంది. రోడ్లపై షేక్‌లు వారికార్లు ఎక్కువగా కనిపించవు. నిన్నటి వరకు పెట్రోలు వలన కొన్ని కోట్లు ఆదాయము గల షేక్‌ల పరిస్థితి నేడు అంతగా లేదు. దేశ ఆర్థిక పరిస్థితి కూడా దిగజారినది. జపాన్ సరుకులు కూడా గల్ఫ్ దేశము లలో అంతగా లభించుటలేదు. క్రీడలంటే అక్కడి వారికి నిన్నటి వరకు ఆసక్తి లేదు. రెండు సంవత్సరముల నుండి పరిస్థితి మారినది. అరబ్ షేక్, వ్యాపారస్థుడు అబ్దుల్ రహిమాన్ బుఖ్తర్ కృషి ఫలితము నాలుగు దేశముల 'రోథమ్స్ కప్' ఛాంపియన్ ట్రాఫీ పోటీ. ఇరవై లక్షలకు పైగా అమెరికన్ డాలర్లు వ్యయముతో అబ్దుల్ రహిమాన్ బుఖ్తర్ తన ఆశయం సాధించాడు. అతను చేసిన వ్యయము తిరిగి రాబట్టగల అవకాశము అక్కడలేదు. క్రికెట్ ఆడుటకు అత్యాధునిక క్రికెట్‌కు ప్రత్యేక క్రీడాంగణము నిర్మించాడు. 14 వేలమంది ప్రేక్షకులు పోటీలు తిలకించుటకు అక్కడ అవకాశము కలదు. ఈ పోటీ సమయములోనే స్టేడియం ఉపయోగములో యుండును. ఇతర సమయములలో అంతగా వాడకము యుండదు. అయినను షేక్ వ్యాపార నిమిత్తం గాక క్రికెట్ ఆసక్తితో యీ పోటీలు జరుపుచున్నాడు. సంవత్సరమునకు రెండు సార్లు యీస్టేడియంలో క్రికెట్ వేడుకలు నిర్వహించ బడ్తాయి. పోటీలలో విజేతలకు నగదు బహుమతి 85,000 అమెరికన్ డాలర్లు లభిస్తాయి. ఇది వరకు లక్షకు పైగా అమెరికన్ డాలర్లు యివ్వబడేవి. కాని ఆర్థిక పరిస్థితులు సరిగా లేక యీసారి బహుమతి మొత్తం తగ్గించ బడినది. పాల్గొన్న దేశ జట్లకు అన్ని సౌకర్యములు అమర్చి 30 వేల డాలర్లు రొక్కం యిస్తారు. అంతేగాక ఉత్తమ ఆసియా క్రీడా కారునికి (ఇండియా- పాకిస్తాన్‌లకు లభించుచున్నది) 50 వేల డాలర్లు ఆర్థిక సహాయముగా యివ్వబడుతుంది.

క్రిందటి సారి నవంబరు 15 నుండి జరిగిన 'ఒక రోజు' యీ పోటీలలో వెస్టిండీస్ ఘన విజయం సాధించినది. ఆ దేశ మేటి ఆటగాడు రిచ్చి రిచ్చర్డ్‌సన్ పాకిస్తాన్‌పై 99, ఇండియా పై 72 పరుగులు చేసి జట్టు విజయమునకు కారకుడయాడు.

1985 నవంబరు 15న పాకిస్తాన్ వెస్టిండిస్ మధ్య జరిగిన పోటీలో వెస్టిండీస్ ఏడు వికెట్ల విజయం పొందినది. పాకిస్తాన్ 45 ఓవర్లలో నాలుగు వికెట్ల నష్టానికి 196 పరుగులు చేసింది. మొహిసీన్ ఖాన్ 86 పరుగులలో యుండి 'అవుట్' కాలేదు. వెస్టిండీస్ 44.1 ఓవర్లలో 199 పరుగులు మూడు వికెట్ల నష్టానికి సాధించినది. రిచ్చర్డ్‌సన్ 99 పరుగులలో యుండి 'అవుట్'కాలేదు. నవంబరు 17న ఇండియా- పాకిస్తాన్‌ల మధ్య జరిగిన పోటీలో పాకిస్తాన్ నాలుగు వికెట్ల నష్టానికి 203 పరుగులు, ఇండియా 9 వికెట్ల నష్టానికి 155 పరుగులు చేసినది. పాకిస్తాన్‌కు 48 పరుగుల గెల్పు దక్కనది.

నవంబరు 22న ఇండియా వెస్టిండీస్ మధ్య పోటీలో వెస్టిండీస్ ఎనిమిది వికెట్ల గెలుపొందినది. ఇండియా నాలుగు వికెట్ల నష్టానికి 180 పరుగులు చేసినది. గవాస్కర్ 76 పరుగులు చేసి అవుట్ కాలేదు. వెస్టిండీస్ రెండు వికెట్ల నష్టానికి 186 పరుగులు సాధించినది. హైన్స్ 72 పరుగులు చేసి అవుట్ కాలేదు.

అంతకు ముందు గత ఏడు ఏప్రిల్‌లో షార్జాలో జరిగిన ఆస్ట్రేలియా - ఆసియా కప్ పోటీలో ఇండియా, న్యూజిలాండ్, పాకిస్తాన్, ఆస్ట్రేలియా, శ్రీలంక పాల్గొన్నవి. పాకిస్తాన్ - ఇండియాల మధ్య ఏప్రిల్ 18న జరిగిన ఫైనలు పోటీలో పాకిస్తాన్ ఒక వికెట్ గెలుపొందినది.

ఇండియా 7 వికెట్లకు 245 పరుగులు, పాకిస్తాన్ 9 వికెట్లకు 248 పరుగులు చేసి గెల్చినది. తిరిగి యీ పోటీ 1987 ఏప్రిల్‌లో జరుగుతుంది.

రోథమ్స్ ఛాలెంజ్ కప్ పోటీలో పాల్గొను మన దేశ జట్టులో కపిల్‌దేవ్ (కెప్టెన్), రవి శాస్త్రి (వైస్ - కెప్టెన్), సునీల్ గవాస్కర్, దిలీప్ వెంగ్‌సర్కార్, శ్రీకాంత్, మదన్‌లాల్, రాగర్ బిన్నీ, అజారుద్దీన్, చేతన్‌శర్మ, చంద్రాపండిట్, మణీందర్ సింగ్, రామన్ లాంబా, గోపాల్ శర్మ రణధీర్‌సింగ్‌లు కలరు.

షార్జా కాంటినంటల్ హోటల్ ప్రపంచ అగ్రగామి హోటళ్ళలో ఒకటి. అబ్దుల్లా కూల్ డ్రింక్స్ లకు మంచి గిరాకీ. అబ్దుల్లాల క్రికెట్‌యందు ఆసక్తి, వ్యయం, ఆటగాళ్ళకు లభించు నగదు బహుమతుల వలన క్రికెట్ ఆటగాళ్ళు యీ పోటీలలో ఎక్కువ ఆసక్తి చూపుచున్నారు.

–ముకరమ్

Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667


సీక్రెట్ ఏజెంట్
విక్రమ్
★ దిలీప్ కదమ్
మోహన్
15.


సరే, అక్బర్ నువ్వెళ్ళి చూపించు.
సంతోషం, పదండి.


విక్రమ్ జాగ్రత్తగా జైలులోపలి భాగమంతా అవగాహన చేసుకున్నాడు.
ఇది నిందితులను ప్రశ్నలడిగే విభాగం కాని కొందరు దీన్ని చిత్రహింసల గది అంటారు.


ఇక నా సరుకు వాడే వాళ్ళను చూద్దాం పదండి.
నా వెంటే రండి.


కొందరు ఖైదీల్ని చూసింతర్వాత అక్బర్ ఒక తలుపు ముందు ఆగిపోయాడు.
ఇక్కడ విలువైన ఖైదీ ఒకరు ఉన్నారు.
ఔనా, నేనాయన్ని చూడొచ్చా?


వార్డర్ మాట్లాడినంత సేపట్లో విక్రమ్ ఆ తాళాన్ని పరిశీలించాడు.
వద్దు, ఆయనకు మత్తు మందుల వసరం లేదు.
ఐతే ఇది ప్రొఫెసర్ ఛటర్జీదే అయి ఉంటుంది.


మళ్ళీ జైలు కార్యాలయంలో –
మంచిది, నేనిక వెళ్ళి సరుకు పట్టుకొస్తాను. మరి మీ కాపలావారి మాటేమిటి?
మిమ్మల్ని అనుమతించమని వాళ్ళకు చెప్పాం. అక్బర్ కారు తీసుకు వెళ్ళండి.


హోటల్‌లో –
రేణూ, నేనిప్పుడాయన్ని విడిపించుకు రావడానికి వెళ్తున్నాను. నువు విమానాశ్రయానికి వెళ్ళి విమానాన్ని సిద్ధంగా ఉంచు.
సరే, క్షేమంగా వెళ్ళి లాభంగా రండి.
© RANG REKHA FEATURES PVT. LTD. 1983


విక్రమ్ మళ్ళీ జైలుకి వెళ్ళాడు.
(ఇంకా ఉంది)

Regd. No. H/VJ-41 ANDHRA SACHITRA VARA PATRIKA
12-18, December, '86